సచిత్ర విచిత్రం

# మార్జాలప్రేమ



అమెరికాలో న్యూ మెక్సికోలోని రియోరేంబో అనే ఊళ్ళో ఇటీవల
80 ఏళ్ల హెలెన్ స్టివార్డ్ అనే ఆవిడ మరణించింది. ఆవిడకి తన
పెంపుడు పిల్లులంటే ప్రాణం. అవివాహిత అయిన ఈవిడ తన
ప్రేమనంతా తన పిల్లులకే పంచింది. ఆవిడ మరణానంతరం
ఆవిడ విల్లుని చదివితే తనకి చెందిన 4 లక్షల 27 వేల డాలర్లు
(సుమారు కోటిన్నర రూపాయలు), తన ఇల్లు, ఇతర ఆస్తుల
న్నింటినీ తన పెంపుడు పిల్లులయిన మేగి, విల్లీలకి రాసే
సిందని తెలిసి బంధువులంతా ఘొల్లుమన్నారు.

సచిత్రవిచిత్రం

# వృద్ధుల తడాఖా





72 నుంచి 76 సంవత్సరాల దాకా వయసు లున్న ఈ నలుగురు వృద్ధులూ సైకిళ్ళేసుకుని, వారంరోజుల్లో 2473 మైళ్ళు పయనించారంటే గొప్ప సంగతే. రోజుకు ఎనిమిది గంటలు సైకిల్ తొక్కిన వీళ్ళు సుమారుగా గంటకు 44 మైళ్ళు పయనించారన్నమాట. అంటే మనగతుకుల రోడ్లమీద పరుగెత్తే బస్సుల వేగానికి దాదాపు సమానం అన్నమాటే. 'ఇదంతా ఎందుకయ్యా' అంటే... 'వయస్సెంతైనా మేమేం యువకులకు తీసిపోం' అని చాటి చెప్పడానికేనట. పోనీ అంటే అదేమంత సుఖవంతమైన ప్రయాణమేకాదు. దారిలో ఎన్నెన్ని ఆటంకాలో! మెక్సికోలో కొండలు, మరోచోట ఎదురు గాలులు ఇంకోచోట అడవులు, వెంటబడే అడవి కుక్కలు, అలా ఎన్నెన్ని ఇబ్బందులెదురైనా తమ శక్తిని చక్కగా ప్రదర్శించారా వృద్ధులు.

# 'భూషణంగారి భోషాణం' పై సమీక్షలు

ఏప్రిల్ నెల 'చతుర'లో ప్రచురితమైన పి. చంద్రశేఖర అజాద్ రచన 'భూషణంగారి భోషాణం' పై మాకందిన ఉత్తమ సమీక్షలు.

## రాబోయే శతాబ్ద సంస్కృతి

*(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)*

రాబోయే ఆధునిక యుగాన్ని ఓ 'భోషాణం'తో ఓ రంగుల చిత్రంగా ఆవిష్కరించింది 'భూషణంగారి భోషాణం' నవల.

'కాదేదీ కవితకు అనర్హం' అని మహాకవి శ్రీశ్రీ అన్నట్లు, 'కాదేదీ కథకూ, నవలకూ అనర్హం' అనిపించేలా ఓ "భోషాణం"తో సమాజ స్థితిగతులను వివరిస్తూ మనిషి ఎవరెస్టులా పేరుపొందాలన్నా, అభివృద్ధిలోకి రావాలన్నా, పరిణతి చెందుతున్న సమాజంలో 'యాడ్'ల పాత్ర ఎలా దోహదం చేస్తుంది అన్నది రచయిత సమగ్రంగా వివరించారు. ఈ రోజుల్లో ఏ టి.వి. ఛానల్ చూసినా, ఏ రేడియో ఆన్‌చేసినా, ఆఖరికి ఏ బజారుగోడ చూసినా మనకు కనిపించేది ప్రచారాలే. చివరికి ప్రచారం లేకపోతే ప్రోడక్టు గిడ్డంగిని వెక్కిరించే పరిస్థితి వచ్చింది. సమాజమూ అదేవేగంతో ఉంది. ఏ వస్తువు మార్కెట్‌లో వస్తుందో అది దేనికో తెలుసుకోవాలంటే, మనిషికి తనకాలం సరిపోతుంది ఈ రోజుల్లో. అందుకే ప్రజలు 'యాడ్'లపై నడవక తప్పటంలేదు. రాబోయే శతాబ్దాలలో యీ 'యాడ్'లు సమాజ దిశ, దశలను మార్చుతాయనటంలో సందేహంలేదు.

ఇటీవల కాలంలో అంతర్జాతీయ మార్కెట్‌ని 'పేటెంట్' అనే పదం ఓ ఊపు ఊపింది. కరపత్రాల హోరు, రాజకీయ మీటింగ్‌ల జోరు 'పేటెంట్'ని తూర్పారబట్టాయి. అయితే అధిక సంఖ్యాకులకు అది బధిర శంఖారావంలానే ఉంది. ఆ మాట విన్నా దాని స్థితిగతులు ఆలోచించిన వారూ అతి తక్కువే. రచయిత ఈ నవలలో 'పేటెంట్' గురించి అతి సున్నితంగా అంటించి, దాని లాభనష్టాలు ఆలోచించుకోవాలని చెప్పకనే చెప్పి సమస్యను ప్రజలకే వదిలేశారు. కనీసం నవల చదివిన వారు అయినా పేటెంట్ హక్కుల ప్రభావాన్ని ప్రచారం చేస్తారని ఆశిద్దాం.

'బొంగు-బోషాణం' అనే వ్యంగ్యార్థాన్నిచ్చే గ్రామీణ వస్తుజాలం, గ్రామీణులకు అతి సన్నిహిత పదజాలంతో, ఓ అంతర్జాతీయ స్థితిపదం 'పేటెంట్' గురించి చెప్పడానికి ఓ భోషాణాన్ని రచయిత కథావస్తువుగా ఎన్నుకొన్నాడంటే కనీసం ఈ గ్రామీణ సన్నిహిత వస్తువు 'భోషాణం'తో అయినా ఆ పేటెంట్ పదం ప్రజలకు సన్నిహితమై అర్థమవుతుంది. అపుడైనా దాని ప్రభావంగురించి

అధిక సంఖ్యాభాగమైన గ్రామీణ జనులు సమాలోచనలు చేస్తారని ఓ ఆశ, ఓ మహత్తర ఆశయం కావచ్చు!

చివరిగా, చదివి ఆనందించేవి కొన్ని అయితే, చదివి ఉపయోగపడేవి కొన్ని ఉంటాయి. అలాంటివాటిలో ఈ నవల చదివి ఉపయోగపడే జాతికిందకు వస్తుంది. 'భోషాణం' రూపంలో కొన్ని సందేశాలు



స్పష్టంగా యిచ్చింది. ప్రచురించిన 'చతుర' సంపాదకులు, చతురులయిన రచయితకు ప్రత్యేక అభినందనలు.

**-మోటూరు గంగాధర ప్రసాద్**
వెల్లటూరు- 522 257

## లోకం పోకడ

*(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)*

"**భూ**షణంగారి భోషాణం"... పేరు మాత్రమే కాదు ఇందులో రచయిత ప్రెజెంట్ చేసిన విషయం కూడా ఎంతో వైవిధ్యంతో కూడి వున్నదని నవల చదివాక అర్థమయింది.

'భూషణం'పాత్ర చిత్రీకరణ కొంచెం వింతగా అనిపించినా నిజంగా అలాంటి వారు లేకపోలేదు. ఏ.ఎస్. స్వార్థంతోనే ఆ భవనంలోకి ప్రవేశించినా అతనిని పూర్తి స్వార్థపరునిగా, మోసగానిగా చిత్రీకరించక పోవటం నాకెంతో నచ్చింది. తాను పైకి వస్తూ 'కూపస్థమండూకం'లా పడివున్న భూషణాన్ని, వంటవానిగా సూరిబాబుని పైకి తీసుకురావటం బాగుంది. సంఘానికి దూరంగా, ఒంటరిగా బతుకుతున్న భూషణం తనకు ప్రతిరోజూ వార్తలలో కనిపించాలని వుందని చెప్పటం నవ్వు తెప్పించినా వాస్తవానికి దగ్గరగా వుంది.

విరిగిపోయిన పాత వస్తువులను అవి ఏకాలం నాటిది, ఏ.ఎస్.ఎలా సేకరించాడు అని ఆరా తీయకుండా పిచ్చిగా లక్షలిచ్చి కొనటంమాత్రం అసహజంగా వుందని చెప్పక తప్పదు. మొత్తంమీద అక్కడక్కడ 'అతి'గా అనిపించినా లోకం పోకడను, వ్యాపార మెళుకువలను, మారుతున్న మనుషుల అభిరుచులను చక్కగా వర్ణించారు

రచయిత.

'అఖిల'ను విడోగా చూడాలని భూషణం కోరుకోవటం సహజంగా వుంది. చివరికి మనశ్శాంతి కోసం అఖిల మనదేశానికే రావటం, అదీ తన చిన్ననాటి నేస్తం 'భూషణం'తో కలిసి రావటం బాగుంది. ఏళ్ళు గడచిపోతున్నా విఫలమయిన తన ప్రేమను తలచుకుంటూ ఆ జ్ఞాపకాల్లో భూషణం పడే తపనను హృదయానికి హత్తుకునేలా వర్ణించారు. చివరిలో తనవెంట వస్తున్న అఖిలతో పెండ్లి ప్రస్తావన తేకుండా 'తిరిగి మేమిద్దరం పసిపిల్లలమయిపోతాం. జీవించినంత కాలం మా వయసు ఆ బాల్యం దగ్గరే స్తంభిస్తుంది' అని భూషణంచేత చెప్పించటం రచయిత ఉన్నత భావానికి నిదర్శనం. ఈ నవలలో ఆమాటే నన్నెంతో ఆకట్టుకుంది. మొత్తంమీద ఒక మంచి నవల చదివామన్న తృప్తి కలిగింది.

**-దామెర్ల గీత,**

ఆత్మకూరు-524 322

## ఉత్తేజకరం

*(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)*

సహజంగా అందరూ బతకటానికి ఏదో ఒక వ్యాపారంచేస్తారు. కాగితాలతో, పాత ఇనుప సామాను, గాజుపెంకులతో, చివరకు ఎముకలతో కూడా వ్యాపారం చేస్తారు. అలాంటి ఈ దేశంలో 'నేను జమీందారును కాబట్టి ప్రజల లోకి నేను రాను. వారే నా దగ్గరకు రావాలి' అనే భావనతో పాడుబడ్డ భవనంలో గిరిగీసుకుని కూటికి కూడా లేకుండా గడుపుతున్న భూషణంను, 'నీకు అండగా నేను వున్నాను' అంటూ తనెవరో తెలియనీకుండా ప్రజలనాడి తెలుసుకుని వారిచేత ఓహో అనిపించిన ఏ.ఎన్.... వీరిద్దరిని విభిన్న భావాలతో చిత్రీకరించారు. లేకుంటే షా, కేథరిన్ పాత్రలు కొద్దిగా సినిమాటిక్‌గా ఉన్నా, భోషాణం కథకు ముఖ్యంకాకున్నా మనిషి తెలివితేటలకు ఒక సవాల్‌లా 'భూషణంగారి భోషాణం'ను రచయిత చంద్రశేఖర అజాద్‌గారు స్ఫూర్తిదాయకంగా మలచారు.

మామూలుగా మనం పాత వస్తువులు ఏమైనా అమ్మాలంటే ముఖం తిప్పుకునే ఈ రోజులలో, ఎందుకూ పనికిరావు అనుకున్న వస్తువులను ముందుగా పబ్లిసిటీ ఇచ్చి, ఎవరూ వూహించని రీతిలో అమ్మకం జరిపి, అర్ధరూపాయి లడ్డూ అయినా అయిదు నక్షత్రాల హోటల్‌లో అందమైన అద్దాల బీరువాలో అందంగా అమర్చిపెడితే అయిదు రూపాయలుకు కొంటారని నిరూపించారు రచయితగారు. హ్యాట్సాఫ్! అందరిచేత చదివించి, ఆలోచింపచేస్తుందీ నవల. తెలివిగల ప్రతివారూ జీవనపథంలో ముందడుగు వేస్తూ తోటివారిని కూడా అభివృద్ధి పరచాలనే ఒక సందేశం ఉంది ఈ నవలలో. దీనికి కుల, మత, ధనిక, దరిద్ర, తారతమ్యాలు లేవని ఆధునిక్ ద్వారా మనకు సూచించారు. కనీసం కొందరినైనా ఈ నవల 'డిగ్నిటీ ఆఫ్ లేబర్' సూత్రంమీద ఉత్తేజితులను చేయాలని నా కోరిక.

**-డాక్టర్ సి.హెచ్. శ్రీనివాస్**

నందవరం- 524 307

## ఏ సుదూర తీరాలకు...?

*(నాలుగవ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)*

కాల ప్రవాహాన్ని ప్రతిబింబిస్తూ సాగిన ప్రయాణాన్ని 'భూషణంగారి భోషాణం' నవ

లలో చూస్తాము. ప్రపంచాన్ని ఆవరించిన వేలంవెర్రి, ఫ్యాషన్ భావజాలం, బలహీనతలు, కీర్తీ డబ్బు సునాయాసంగా సంపాదించే మార్గాలూ- యీ నవలలో మంచి వ్యంగ్యంతో ఎలివేట్ చెయ్యబడినవి. డబ్బు ఎక్కువైపోయినవాళ్లు దానిని ఏం చేసుకోవాలో తోచక చేసేవి పిచ్చిపనులుగా తోచినా యిది ఆధునికత అనే పేరుతో సాగుతున్న కాలప్రవాహపు అంతర్వాహిని అనేది కాదనలేని నిజం.

ఎటొచ్చీ, యిందులో పాత్రలూ, పాత్రధారులూ ఏది అనుకుంటే అది, ఎలా అనుకుంటే అలా నిరాటంకంగా జరిగిపోవడం కొంత కృతకం అనిపించింది.

ఆధునిక ప్రపంచం తాలూకు ఈ ప్రయాణాన్ని కాలం ఏ తీరానికి చేరుస్తుందో!

**-వి. కామేశ్వరరావు**

తుని- 533 401

## ఆనందోబ్రహ్మః

***(అయిదవ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)***

**ఒ**క వ్యక్తికో, వస్తువుకో ఉన్న విలువ వాటిని ప్రెజెంట్ చేసిన వ్యక్తిమీద, ఆ విధానంమీద ఆధారపడి వుంటుందన్న మాటలకి నిర్వచనం ఏప్రిల్‌నెల చతుర నవల. చెయ్యి తిరిగిన రచయిత అజాద్ ఈ సబ్జెక్టును అద్భుతంగా ప్రజెంటు చేయగలిగారు. నామకః జమీందారు భూషణం, పాత కాలపు దివాణంలో, ఊరివారిచేత నిందింపబడుతూ, ఛాందసాలతో జీవిస్తుండగా అతని జీవితంలోకి సుడిగాలిలా ప్రవేశించిన ఏ.ఎన్. పనికిరాడనుకున్న అదే భూషణాన్నీ పనికిమాలిన భోషాణాన్నీ కూడా ఏ విధంగా ఖండాతరాలలో కూడా పాప్యులర్ చేసాడన్నదే దీని యితివృత్తం.

ఈ నవలలో చెడ్డపాత్రలు లేవు. అంతా మంచివారే. మోసాలు లేవు. పడిన మనిషి లేచే ప్రయత్నంలో ఆరంభమైన నవల ఎనలేని విజయపరంపరలతో సాగిపోయింది. ఎక్కడా హర్డిల్స్ లేవు. ఏ.ఎన్.కు భూషణం, భోషాణాల గురించి ఎలా తెలిసిందనేది చెప్పలేదు. అలాగే అతను భూషణాన్నే ఎందుకు ఎంచుకున్నాడో కూడా తెలియలేదు. తిట్లతో ఆరంభమై కన్నీటితో భూషణాన్ని, పాఠకునికి కూడా వీడ్కోలు చెప్పే మంచిపాత్ర సూరిది. ఇదంతా సాధ్యమా? అన్న ప్రశ్న వేధించకపోతే ఈ నవల గొప్పది.

భారతంలో శ్రీకృష్ణుడే కథానాయకుడైనట్లు యిందులో భూషణమే నాయకుడు. మింగమెతుకు లేకున్నా మీసాలకు సంపెంగ నూనె వ్రాసుకునే భూషణం, కొద్ది సౌఖ్యాలను చూసి ఇందుకే అఖిల తనని వదిలి వెళ్లిపోయిందనుకున్న భూషణం, ఎంతో పాప్యులర్ అయినాక తనని తాను 'మిస్' అవుతున్నానన్న సత్యాన్ని గుర్తించిన భూషణం, తన బూజు భావాలను కన్నీటితో కడుక్కున్న భూషణం, అఖిలను చూశాక తన సంకుచిత భావాలను నిర్మలంగా ఏ.ఎన్.ముందు పరిచిన భూషణం, తిరిగి ఇండియావెళ్లిపోయి ప్రశాంత జీవనం గడపాలనుకోవడంలో 'ఇంతింతై వటుడింతై...' అన్నట్లు ఎదిగిపోతాడు. ఆనంద విషాదాలకు వచ్చే కన్నీటికి ప్రతీకగా, "విషాదాంత్య ఆనందోబ్రహ్మః" అన్న ఆర్యోక్తికి దీటుగా నిలుస్తాడు భూషణం. చక్కగా చదివించే గుణమున్న నవల యిది.

**-సుజాత**

వసంతగంట్యాడ

# రచయితలకు మనవి



- ★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- ★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**
- ★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**
- ★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
- ★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచేడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
- ★ **ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**

# చతుర

సంపుటి:21

సంచిక:5

జూన్, 1998


చాలా ఏళ్ల తరువాత గంపెడాశతో ఆ ఊరు
చేరాడతడు.
ఒకప్పుడు అతడు చేసిన చిన్న పొరపాటుకు ఆ ఊరు
అతణ్ణి తరిమి తరిమి కొట్టింది.
భార్య కూడా తప్పనిసరి పరిస్థితుల్లో అతన్ని
మోసం చేసింది.

ఎదిగిన కూతురు అన్యాయానికి బలైపోయింది.
జీవన సమరంలో ఒంటరిగా పోరాడిన అతడు...
కాళ్లు కూడా పోగొట్టుకున్న దయనీయస్థితిలో
ఆ ఊరు చేరాడు.

అక్కడ అతనికి చీకటిలో చిరుదివ్వెలా...
వెలుగునిచ్చినది ఏమిటి? కాలం... కాలనాగులా అతన్ని
కాటేయడం వెనుక కారణాలు ఎలాంటివి?
జీవితంలో శ్రమించడంతప్ప సుఖించడం ఎరుగని
జీవితాల ప్రతిబింబం ఎ.ఆర్. రాసాని రచన
' చీకటిముడులు ' ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

# చీకటి ముడులు

క్రాస్ రోడ్డు దగ్గరే బస్టాండు!

అక్కడ ఒక్కటే రద్దీ!

నిముష నిముషానికీ జనంతో బస్టాండు నిండిపోతోంది.

వచ్చే జనం ఎక్కువ! పోయేజనం తక్కువ! ఎప్పుడోగానీ బస్సులు రావడం లేదు.

గంటకో బస్సు వచ్చినా అందులోనుంచి కొందరే దిగుతున్నారు. అంతకు పదింతల మంది బస్సులో ఎక్కుతున్నారు. దాంతో బస్సులో నిలబడడానిక్కూడా చోటుండదు.

అది పుష్పక విమానంలా కదుల్తూ వెళ్తుంది. ప్రయాణీకులు గంటల తరబడి నిలబడి తాము ఎక్కాల్సిన బస్సులకోసం ఎదురు తెన్నులు చూస్తున్నారు.

అక్కడవున్న పుస్తకాల కొట్టులో అప్పటికే న్యూస్‌పేపర్ అయిపోయింది.

బోర్ కొట్టకుండా కొందరు వీక్లీస్ కొనుక్కొని వెళ్తున్నారు. కొందరు ఆర్టీసీ వాళ్లను దుమ్మెత్తిపోస్తుంటే ఆడవాళ్లు, వృద్ధులు, పిల్లలు నేలపైనే కూర్చొని తమ వస్తువుల్ని జాగ్రత్తగా చూసుకుంటున్నారు. ఇద్దరు స్త్రీలు తమ చంటి పిల్లలకు పాలిస్తుంటే ఎదురుగావున్న ఇద్దరు స్టూడెంటు కుర్రాళ్లు అర్ధనగ్నంగా కనిపిస్తున్న వారి స్తనాలవైపు దొంగచూపులు చూస్తున్నారు. జేబులు కొట్టే వారికోసం పోలీసులు అక్కడక్కడా నిఘా వేసి నిలబడి డేగ చూపుల్తో వచ్చిపోయే వారిని గమనిస్తున్నారు. కొందరు ఎంక్వయిరీలో, రాబోయే బస్సులకోసం వాకబుచేస్తున్నారు.

విసుగు చెందిన కౌంటర్‌లోని ఉద్యోగి అలా అడిగిన వారిని పురుగును చూసినట్లు నిర్లక్ష్యంగా ఒక చూపు చూసి అరకొరగా జవాబు చెబుతూ, పక్క ఉద్యోగితో మాత్రం ఆనందంగా బాతాఖానీ కొడుతున్నాడు.

అప్పుడప్పుడూ వస్తున్న బస్సుల్లో నుంచి దిగిన డ్రైవర్‌లు, కండక్టర్‌లు క్యాంటీన్‌లో కాఫీలు తాగి, వెళ్తున్నారు. కొందరు కండక్టర్లు అక్కడే వున్న ఆఫీసు గదిలోకి వెళ్లి తమ ఎస్.ఆర్.లు చెక్ చేయించుకుంటున్నారు.

వచ్చేజనం! పోయే జనం!!

'అంతా రద్దీ రద్దీ... రద్దీ. ఒకటే రద్దీ!!

ఇంతలో శక్తిలేక కాళ్లీడ్చుకుంటూ ఊగుతూ పీకల్దాకా తాగినడుస్తున్న ముసలివాడి మాదిరి వచ్చి ఆగిందో బస్సు. అది పీలేరు టు పులిచెర్ల గ్రామణి బస్సు.

అంతే! తేనెటీగల్లా ముసురుకున్నారు జనం.

బస్సులో వచ్చిన ప్రయాణీకులు దిగుతుంటే... కిందనుంచి బస్సులోకి వెళ్లే జనం తోసుకుంటూ లోపలికి దూసుకుపోతున్నారు.

అక్కడ సివిక్‌సెన్సు సదా ఆత్మహత్య చేసుకుంటూనే ఉంటుంది. ఏ ఒక్కరూ క్యూ పాటించడంలేదు.

ఆ తోపులకి కొందరు అయ్యో అంటున్నారు.

"దారి వదలండయ్యా! దిగనీండయ్యా" అని కొందరంటున్నారు.

"ఏమయ్యా! పాణాలు పోతుండాయా? దిగేవోళ్లని దిగనీండి. మళ్లెక్కుదురుగాని" కండక్టర్ కసురుకుంటూ దూసుకు వెళుతున్న వారిని మందలిస్తున్నాడు.

కానీ అతని మాటల్ని ఎవ్వరూ ఖాతరు చేయడంలేదు. అప్పటికే కొందరు కిటికీల్లోంచి బస్సులోకి దూకి సీట్లు ఆక్రమించుకున్నారు.

డ్రైవర్ దిగేశాడు!!

అతని వెంట డ్రైవర్ సీట్లోనుంచే కండక్టరూ దిగేశాడు.

ఎట్లాగయితేనేం? బస్సులో వచ్చిన ప్రయాణీకులు దిగేశాక అంతవరకూ వేచివున్న ప్రయాణీకులతో మళ్లీ బస్సు నిండిపోయింది.

లోపల స్థలంలేక కొందరు టాప్‌పైన కూడా ఎక్కికూర్చున్నారు. ఇప్పుడు అక్కడ కూడా సందులేదు. లోపల ఎంత మంది

వున్నారో పైనా అంతమందీ వున్నారు.

పల్లెలకు వెళ్లే బస్సులకు టాప్‌పైన ప్రయాణించే జనం మామూలే.

ఇక ఆ బస్సు తప్పితే ఆదారి వెంట వేరే బస్సులేదు. అదే ఆ రూట్లో ఆఖరి బస్సు.

బస్సు దిగిన డ్రైవర్ కాఫీ తాగి మళ్లీ బస్సు ఎక్కి తన సీట్లో కూర్చొని హారన్ వేశాడు. బస్సు కదలబోతోందని తెలిసి మళ్లీ ఎక్కిన జనం మరోసారి తోసుకున్నారు.

ఫుట్‌బోర్డుపైన కూడా కాలుమోపడానికి స్థలంలేదు. బస్సు లోపల ప్రజలు సీట్లల్లో ఇరుక్కొని కూర్చున్నారు. మరింతమంది బస్సు మధ్యలో నిలబడి వున్నారు.

బస్సులో ఇసక వేస్తే రాలనంత జనం! ఒకటే జనం!

ఆ జనంతో శ్వాస ఆడ్డంకూడా కష్టంగానే వుంది.

అయినా అంత రద్దీలోనూ ఒక ముసలాయన ఎప్పుడెక్కాడో ఎలా ఎక్కాడోగానీ బస్సెక్కేశాడు. అతను బస్సు మధ్యలో కిందనే కూర్చున్నాడు. అతనికి నిలబడి వున్నవారి కాళ్లు తప్ప ఏమీ కనిపించడం లేదు. నిలబడివున్నవారు కూడా తమ కాళ్ల వద్ద ఓ జీవివున్నట్లు అనుకోవడంలేదు. అసలు వారికి ఆ స్పృహే లేనట్లుంది.

అలాంటి పరిస్థితిలో కండక్టర్ ఎక్కి డోరు వేసుకొని రైట్ రైట్ అన్నాడు.

బస్సు కదిలింది!

పెట్టెలో వేసి ప్యాక్ చేసినట్టున్న ఆ జనం బరువుకి ఒక్కసారి భారంగా వెనక్కీ ముందుకీ ఊగింది బస్సు.

ఆ ఊపుకి జనం సముద్ర కెరటంలా కదిలారు.

"అమ్మోయ్ చచ్చాన్రో దేవుడో" అన్న కేక వినిపించింది.

ఎవరోగానీ బస్సు ఊపుకి కింద కూర్చొని వున్న ఆ ముసలాయన్ని తొక్కినట్టున్నారు.

అందుకే అరిచాడు అతను.

ఎలాగయితేనేం... బస్సు బస్టాండు వదిలింది.

అది అగ్రహారం దారిగుండా రామిరెడ్డి గారిపల్లె మీదుగా పులిచెర్ల చేరుకుంటుంది.

అది మట్టిదారి. పైగా డొంకదారి. మెల్లగా ఆ దారిలోకి పరుగుతీసింది బస్సు.

ఆ దారి పొడుగునా రకరకాల కంపచెట్లు, కానగచెట్లు, చింతచెట్లు వున్నాయి. అక్కడక్కడా రోడ్డుమీదికి పెరిగిపోయివున్న చీకిచెట్లు బలిసి వున్నాయి.

వాటినన్నింటిని తప్పించుకుంటూ నీటిపైన ప్రయాణించే పడవలా ఇటు అటు ఊగుతూ వెళ్తోంది బస్సు. సర్రున బస్సును వరుసుకొని పోతున్న ఆ చీకికంపలు తగలకుండా కిటికీల పక్కన కూర్చున్నవారు బస్సులోకి వదిగివదిగి కూర్చుంటున్నారు. అవిదాటి మామిడి తోటల మధ్యగా వస్తోంది బస్సు.

దారి చుట్టూ దట్టమైన చింత చెట్లున్నాయి. ఏమాత్రం యామారినా టాప్ పైనున్న శాల్తీలన్నీ లేచిపోతాయి.

అందుకే డ్రైవర్ వడుపుగా బండి నడుపుతున్నాడు. చెట్టు కొమ్మలొచ్చినప్పుడంతా టాప్ పైనున్న వాళ్లువంగి తలలు వంచుకుంటూ జాగ్రత్త పడుతున్నారు.

బస్సు భారంగా రంగప్ప కటవ దగ్గరకొచ్చింది. అది పల్లం!!

బస్సు ఆ పల్లంలోకి దూసుకు వెళ్తోంది. ఎదురుగా రోడ్డుపైకి వంగివున్న చింతకొమ్మ ఎక్కుపెట్టిన బాణంలా కనిపిస్తోంది.

"హొరేయ్! చింతకొమ్మ! వంగోండీ!" అని టాప్‌పైనున్న కొందరు హెచ్చరించారు.

"అమ్మో" అన్నాడొకడు.

ఆ కేక విన్న డ్రైవర్ ఎంతో నేర్పుగా బస్సు ఆపాడు.

ఆ చింతకొమ్మ టాప్‌పైనున్న వారిని హొరుసుకుంటూ వెళ్లిపోయింది. ఒకరిద్దరికది గీరుకుపోయి రక్తం కమ్ముకొచ్చింది. మరో అతనికి గాయమై "అమ్మో" అంటూ అరిచాడు.

ఆ అరుపుకే డ్రైవర్ సడన్ బ్రేకు వేశాడు. బస్సు ఆగిన ఊపుకి బస్సులోని జనం కిందుమీదులయ్యారు.

"చచ్చాన్రో దేవుడో"

బస్సులోంచి మళ్ళీ అదే ముసలాయన కేక!

బస్సు ఆగిన ఊపుకి జనం అతనిపైన పడ్డారు.

అందుకే అతను అరిచాడు. అంతా మళ్ళీ సంబాళించుకున్నారు.

బస్సుపైన దెబ్బ తగిలిన వ్యక్తి గాయం నుంచి కారిన రక్తం జలజల అతని ముఖం పైకి జారింది.

ఆ రక్తం చూసుకున్న ఆ వ్యక్తి "ఓయమ్మో" అని ఏడుపు లంకించుకున్నాడు.

"ఏం జరిగింది? ఏం జరిగింది? " అన్నారు కొందరు.

"తల బొక్క పడిపోయింది సామే. యింకెట్లరా దేవుడో" బెంబేలు పడిపోతూ అరిచాడా వ్యక్తి.

ఏం జరిగిందోనని కొందరు బస్సులో నుంచి బిలబిలమని దిగారు. అదృష్టవశాత్తు పెద్ద గాయం కాలేదు. చిన్నదే! ఎవరో చేతిరుమాలు తీసిచ్చి గాయానికేసి అదిమి పట్టుకున్నారు. అతనూ అలాగే చేశాడు.

ప్రజలు నానా రకాలుగా అనుకోసాగారు.

"ఈ ముండ ప్రభుత్వంలో ప్రజల్ని పట్టించుకునేదెవరు? "

"ఏ గవురుమింటోడొచ్చినా మనకు చేసేదేమీలేదు"

"అదీమాట! ఇదే సూడు... మన ఊర్లకు అసలు బస్సే లేదు. ఈ ఆర్టీసీ బస్సులు వస్తే వరుసగా వస్తాయి. వరసగా బోతాయి. లేకుంటే రానేరావు" మరొకతను నిష్ఠూరంగా అన్నాడు.

"ఏమిరా... పరవాలేదా.. కొంతసేపు వోర్చుకో, పుల్చెల్ల ఆసుపత్రిలో సూపెట్టుకుందువుగానీ..." అన్నాడో ముసలాయన.

దాంతో ప్రజల టాపిక్ ప్రభుత్వంపై నుంచీ దవాఖానాలపైకి మళ్లింది.

"ఆ ఈ ఆసుపత్రులూ అట్టే యేడ్సినాయిలే. మందులుంటే డాక్టర్లుండరు. డాక్టర్లుంటే మందులుండవు"

"యాడయినా గవురుమెంటు ఆసుపత్రికి బోతే ఆర్నెల్లకు సచ్చేవోడు నెలకే సస్తాడు. అంతెందుకూ... పెద్దాసపత్రి అదే మన తిరపతి రొయ్యాసుపత్రి సూడు. ఆడికి బోయిన మడిసి తిరిగొస్తే వొట్టు"

"వాళ్లకు పడేదేదో జేబిలో పడిపోతే అప్పుడు బాగానే సూస్తారు. ప్రైవేటుగానైతే యింకాబాగా సూస్తారనుకో"

"ప్రతి దానికీ లంచమే! లోకమే అట్టుండాది" అలా చర్చించుకుంటున్న ప్రయాణీకుల మాటలకడ్డొస్తూ "ఏం పరవాలేదులే వయ్యో. ఆసుపత్రి దగ్గిర దించుతా. ఆడ సూపెట్టుకో" అన్నాడు కండక్టర్.

అతని మాటల్లో అంత వరకే తన బాధ్యతన్న భావం ధ్వనించింది.

"ఏమబ్బా అయిందా? " దాంతో తనకు సంబంధం లేనట్లే హెచ్చరించాడు డ్రైవర్.

"అయిపోయిందబ్బా యింకపోనీ" అన్న కండక్టర్ మాటతో తిరిగి బస్సు స్టార్టు చేశాడు డ్రైవర్.

"అందరూ ఎక్కండబ్బా" హెచ్చరించాడు కండక్టర్.

కండక్టర్ మాటతో ప్రయాణీకులంతా ఒకర్నొకరు తోసుకుంటూ తిరిగి బస్సులోకి వెళ్లారు.

"రైట్ రైట్" అంటూ డోర్ వేసుకుంటూ కేకేశాడు కండక్టర్.

"కొంచెం మెల్లగా పోనీబ్బా" ఓ ప్రయాణీకుడు డ్రైవర్‌ని హెచ్చరించాడు.

బస్సు మళ్లీ కదిలింది.

'బాలి చెరువు' దగ్గర, రైల్వే డాం కింది నుంచి వెళ్లి తిన్నగా ప్రభుత్వ ఆసుపత్రి పక్కగా వెళ్లి ఆగింది.

అక్కడ కొందరు దిగారు. వారితోబాటు గాయమైన వ్యక్తీ టాప్ పైనుంచి జాగ్రత్తగా దిగి ఆసుపత్రివైపు అడుగులువేశాడు. తిరిగి కండక్టర్ డోరువేసుకుంటూ రైట్ రైట్ అని అరిచాడు.

కొంతసేపు తర్వాత పులిచెర్ల బస్టాండులో ఆగింది బస్సు. కండక్టర్ డోరుతెరచి 'పులిచెర్ల! పులిచెర్ల' అని రెండుసార్లు అరిచి కిందికి దిగాడు.

అతని వెంట కొందరు ప్రయాణీకులు వరుసగా దిగారు. వారితోబాటు అంతవరకూ కింద కూర్చొని ప్రయాణం చేసిన ఆ ముసలాయనా దిగాడు.

కిందికి దిగగానే 'హమ్మయ్య' అంటూ గాలిపీల్చుకున్నాడతను.

మళ్లీ కొందర్ని ఎక్కించుకొని నిండు గర్భిణిలా ఆ బస్సు రొంపిచెర్ల వైపు కదిలి వెళ్లిపోయింది.

అలాంటి పల్లెలకు వెళ్లే బస్సుల్లో ఇలాంటి ప్రయాణమంటే సర్కస్ ఫీట్లు వేసినట్లే.

అందుకే కిందికి దిగిన ముసలాయనకు తల్లి వడిలోకి చేరుకున్నట్లు ఏదో ఆనందం.

అతను ఆ ఊరు వదిలి సుమారు పది సంవత్సరాలకు పైగానే అయింది.

చుట్టూ ఒక్కసారి చూశాడు. అప్పటికీ ఇప్పటికీ ఎంతో మార్పు. పులిచెర్లలో ప్రత్యేకంగా బస్టాండంటూ ఏదీలేదు. చదుం నుంచీ కల్లూరు మీదుగా వచ్చేరోడ్డు అలాగే నేరుగా మంగళంపేటకు పోతుంది.

బస్సు ఆగిన చోటునుంచీ ఉత్తరంగా రొంపిచెర్లకు వెళుతున్న రోడ్డు... ఆ రోడ్డును అక్కడే కలుస్తుంది.

దానికి ఒకవైపు ఒజ్జిగాడి సైకిల్ షాపు, దాని పక్కనే నాగులయ్యా టైలరింగు షాపు, దానికెదురుగా హుస్సేన్ సాయిబు చిల్లరంగడి వుంది. అది కల్లూరురోడ్డు.

మంగళంపేట రోడ్డులో కమ్మపల్లె సుబ్బరమణి చిల్లరంగడి, వగళ్ల రమణారెడ్డి మందులషాపు, మేకలమధు ఎరువుల అంగడి, దానికవతల బొజ్జన్న సారాయి అంగడి.

రొంపిచెర్ల రోడ్డులో నారాయణ టీకొట్టు, దానిపక్కన అబ్బయ్యశెట్టి చిల్లరంగడి, దానికెదురుగా సిద్ధారెడ్డి హోటల్, దాటితే సంతగేటు అందులో రాముల వారి గుడి.

అదే పులిచెర్ల బస్టాండు!

ఒకప్పుడు అవన్నీ పూరిండ్లే. కానీ ఇప్పుడవి పక్కా .మిద్దెలుగా మారివున్నాయి.

అందుకే వాటివైపు ఆశ్చర్యంగా చూస్తున్నాడు ఆ ముసలాయన. అతని పేరు కుశాలన్న.

అది అతని అసలు పేరు కాదట. చిన్నప్పుడు అతను చాలా కుశాలగా మాట్లాడేవాడట. అందుకే అతన్ని అందరూ కుశాలన్న అంటూ పిలుస్తూ వచ్చారట. ఆ తర్వాత అదే అతని పేరుగా సార్థకమైపోయి, అతని అసలు పేరును ఆ ఊరి వాళ్లతోబాటు అతనూ ఎప్పుడో మరచిపోయాడు.

అతని వయసు రెండు పాతికల పైనుండవచ్చు నిత్యం శ్రమించడంవల్ల మూడు పాతికలు దాటిన మనిషిలా కనిపిస్తున్నాడు.

చప్పిదవడలు, చింపిరితల, లోపలికి పోయున్న గుంటకళ్లు, వాటికి షోడాబుడ్డీ అద్దాలు, రెండు రాలిపోయిన దంతాలతో బోసిగా కనిపించే నోరు, ముడతలుపడ్డ శరీరం, పెరిగిన గడ్డం, చినిగిన నూలు బనీను, ఒక పాత పంచెగోచీ, చచ్చుబడి సన్నగా మారివున్న కాళ్లు... ఇదీ అతని ఆకారం.

అతను నడవలేడు.

అందుకే తన రెండు చేతుల్ని నేలకు ఆన్చి దేకుతూ నడుస్తాడు.

అలా నడవడంవల్ల అతని చేతులు కాయలుకాచి గిడసబారి పోయి వున్నాయి.

ఎప్పుడో వదిలివెళ్లిన పాలేటిని చూడ్డానికే తిరిగి ఆ ఊరొచ్చాడతను.

అతడున్నది అక్కడికి మైలు దూరంలో వున్న బండారోళ్లపల్లెలో.

సంతగేటులో వున్న రాములవారి గుడి గోపురంపైనున్న లౌడ్ స్పీకరులో నుంచి "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అని వినిపిస్తోంది.

అతనికి ఆ తెలుగు తెలియకపోయినా దాని గాన మాధుర్యాన్ని అనుభవిస్తూ, దేకుతూ కదలి నాగులయ్య షాపు దగ్గరకొచ్చాడు.

స్నేహితుల్తో ఏదో మాట్లాడుకుంటూ, బట్టలు కుడుతున్న నాగులయ్య ఆ శాల్తీని చూసి గుర్తుపట్టాడు.

"ఓ కుశాలమామా! బాగుండావా... ఇన్ని దినాలూ ఎక్కడ బొయ్యింటివి? " అని ప్రశ్నలు కురిపించాడు.

అతని మాటల్లో నువ్వింకా బతికే వున్నావా అన్నంత ఆశ్చర్యం ధ్వనిస్తోంది.

"ఎవురబ్బా నీవు? "

అని తల పైకెత్తి నిదానంగా చూసి "ఓ... గెల్లపల్లోళ్ళ నాగులుగోడా... ఏదో కడుపాత్రంకొద్దీ పోయి ఉంటిన్నాయనా...! పాలేటుండాడా? " అని ఎదురు ప్రశ్న వేశాడు.

పాలేటి గురించి తెలుసుకోవాలన్న కుతూహలం అతని మాటల్లో వ్యక్తమౌతోంది.

"ఆఁ... ఉండాడు. బెంగుళూరునుంచి వచ్చేసి ఈడనే ఉండిపోయినాడు. అది సరే గానీ నువ్వేంది మామా ఇట్టయి పూడిసినావు? " అతని అవిటితనాన్ని చూసి పరిశీలనగా అన్నాడు.

అతను ఆ ఊరు విడిచి వెళ్ళినప్పుడు కాళ్ళు బాగానే వున్నాయి. అందుకే నాగులయ్య అలా అడిగాడు.

"అది నా కర్మ!" అంటూ తలదించుకున్నాడు, కుశాలన్న!

"మనూరికేనా? "

తిరిగి ప్రశ్నించాడు నాగులయ్య.

"అవున్నాయనా... వస్తా? "

అంటూ ముందుకు వెళుతుంటే... "నేను ఇంకొంతసేపు తాలి వస్తాన్లే పదా" అంటూ తనపనిలో మునిగిపోయాడు నాగులయ్య.

నాగులయ్యదీ బండారోళ్ళపల్లే. పులిచెర్లలో టైలరింగు నడుపుతున్నాడు. ఉదయం వచ్చి సాయంత్రం తిరిగి వెళ్తుంటాడు.

నాగులయ్య చూస్తుండగానే కుశాలన్న బండారోళ్ళపల్లెవైపు దేక్కుంటూ పోసాగాడు.

అక్కడినుంచి అర్ధఫర్లాంగుదూరంలో రైల్వే స్టేషనుంది. దాన్ని దాటుకొని వెడితే కుడివైపున వెంకయ్యగారి ఆయిల్ మిల్లుంది. ఎడమవైపున 'తిమ్మం చెరువు'. ఆ చెరువు కట్టమీదుగానే ఆ ఊరికి వెళ్లాల్సి వుంటుంది. అందుకే బరబరమని తన శరీరాన్ని ఈడ్చుకుంటూ స్టేషన్‌వైపుకు కదలసాగాడు కుశాలన్న.

కొద్ది క్షణాల్లోనే కుశాలన్న స్టేషన్ చేరుకుని వెయిటింగ్‌హాల్ దాటుకొని వెళ్ళాడు. ఇక మూరెడు ఎత్తున్న ప్లాట్‌ఫాం దిగి రైలు పట్టాలు దాటుకొని పోవాలి.

తిన్నగా ప్లాట్‌ఫాం దిగడానికి దాని అంచు వైపుకు గెంతాడు.

స్టేషన్లో తోటి ఉద్యోగస్తులతో ఏదో మాట్లాడుకుంటూ జండాలు పట్టుకొని వున్న పోర్టర్ సీతాపతి అతన్నే చూస్తున్నాడు. అతని పక్కనే బెంచీపైన కూర్చొని అతని కొడుకు ఉమాపతి మరో ఉద్యోగి పోర్టర్ రామయ్యతో పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నాడు.

కుశాలన్న ప్లాట్‌ఫాం దిగడానికి చలనం లేని తన రెండు కాళ్ళను చేతుల్తో ఎత్తి ప్లాట్‌ఫాం అంచు కవతల పల్లంలోకి దించాడు.

ఇక శరీరాన్ని దించడానికి మెల్లగా ఒక చేతిని పల్లంలోకి చాచి వంగాడు.

అంతే! పొరబాటున పల్లంలో వున్న రైల్వే పాలాలపైకి అలాగే దొర్లుకున్నాడు.

అతని కంటి అద్దం 'ఫట్'మని పగిలిన శబ్దం! సరిగ్గా అదే సమయంలో పీలేరు నుంచి కూతలు వేసుకుంటూ పెనుభూతంలా ఉరుకులు పరుగులమీద పైటేళ బండి రావడం... "వరే... ఎవుడో సచ్చురా నాకొడుకు" అని కేక పెట్టడం ఒకేసారి జరిగిపోయింది.

మిగిలిన రైల్వే ఉద్యోగులు అటువైపు పరుగెత్తుకొచ్చారు. పొగలు గక్కుకుంటూ ఆఘమేఘాలమీద యముని మహిషంలా దూసుకు వచ్చేసింది ధర్మవరం ప్యాసింజర్ బండి.

## వల్లెచివర ఇల్లు



**కు**శాలన్న ఊరొదిలి పోయినప్పుడు పాలేటికి పద్దెనిమిదేళ్ళు ఇప్పుడేం చేస్తున్నాడో ఎలా ఉన్నాడో చూడాలనే తిరిగివచ్చాడు. మనుషుల మధ్య వుండే మమకారాలలాంటివి. ఈ అనురాగాలు, అనుబంధాలే మనుషుల్ని ఒక్కచోట చేరుస్తుంటాయి. ఆ అనుబంధమే అతన్ని తిరిగి అక్కడికి రప్పించింది. పాలేటి అతని ఏకైక పుత్రుడు.

అతని ముఖంలో దైన్యం, కళ్లలో ఆశ!

పోర్టర్ సీతాపతేగనక గబాలున సమయానికి వచ్చి ఉండకపోతే కుశాలన్న ప్రాణం ఎప్పుడో బుడుంగుమనేది.

సీతాపతి పుణ్యమాని బతికి బట్టకట్టాడు. ఆ ఊరు దారి పట్టాడు.

అలాగే దేక్కుంటూ తిమ్మం చెరువు కట్ట దాటుకొని వెంకయ్యగారి బావి, కమ్మోళ్ళ మడులు దాటుకొని మేకలోళ్ళ బావికాడికొచ్చాడు.

అది నల్లరాళ్ల డొంకదారి.

దారిపొడవునా చిన్నచిన్న గుండ్లున్నాయి. రాళ్ళు రప్పలు వున్నాయి. ఆ దారి చుట్టూ కానగచెట్లు.

అక్కడి వాతావరణం చల్లగా వున్నా ఆ దారెంట వెళ్ళడానికి కుశాలన్న గుండె గుభేలుమంది.

'బాగున్నెప్పుడు పెద్దపెద్ద అడవుల్లో తిరిగినోన్ని. ఇప్పుడు ఈ సిన్న దోవకే భయపడి పోతండానే' అనుకున్నాడు.

కుడివైపున్న మేకలోళ్ల బాయిని చూశాడు.

'ఒకప్పుడు... ఇరవై నాలుగ్గంటలూ మేకలోళ్ళ జల్లుచిన్నబ్బ పాట పాడతా కపిల తోల్తావుండె. ఎప్పుడూ వరిమళ్ళతో, చెరుకుతోటలతో ఎంతో రమణీయంగా వుండేభూమి. ఎట్టున్న భూమి ఎట్టయిపాయె. ఇప్పుడు చూస్తామంటే అరచెయ్యంత పైరేలేదే. కపిలిదోలే 'బారి' సూడు ఎట్ట పాడుపడి పడిపోయుండాదో. ఆ మళ్లల్లో జిల్లేళ్ళు మొలిచి పోయుండాయే. ఈ పదేళ్ళలో ఎంత మార్పు' అనుకుంటూ ముందుకెడుతున్నాడు కుశాలన్న.

'పొద్దుపోయేలోపల ఇల్లు చేరుకోవాల' అనుకుంటూ వెడుతున్నాడు.

ఒకప్పుడు అక్కడ ఎంతో పచ్చదనం వుండేది. ఎప్పుడు చూసినా చుట్టుపక్కల నుంచి కపిలతోలేవాళ్ళ పదాలు, ఈలలు వినిపించేవి. ఆడుసుదున్నేవాళ్ళ ఎద్దుల అదిలింపులు వినిపించేవి. ఆ చుట్టుపక్కల వెంకయ్యగారి బావితప్ప అన్నీ కపిల బావులే.

ఆ బావి పక్కనే పెద్ద చెరువు, దాంట్లో ఎప్పుడూ నీళ్ళుండేవి. ఆ చెర్లో గూడేసేవాళ్ళ సందడి రేయింబవళ్ళు వుండేది. రాత్రిపూట

కూడా రైతులు వంతులేసుకుని గూడేసుకునే వాళ్ళు.

ఇప్పుడు ఆ పచ్చదనం మచ్చుకయినా లేదు. జనం సందడి అంతకన్నాలేదు.

వర్షాలు లేక పెద్దపెద్ద చింత చెట్లు సైతం మోడుబారిపోతున్న చిహ్నాలు కనిపిస్తున్నాయి.

పెద్ద చెరువు బీటలువారిపోయి అందులో చీకి ముళ్ళు మొలిచిపోయి వున్నాయి.

అవన్నీ చూస్తుంటే కుశాలన్నకి కాస్తంత బాధ కలిగింది. అలాగే దేక్కుంటూ వంక దారిలో కొచ్చాడు. అక్కడ వెంకటముని చెరుకుతోట వేసినట్టుంది. కాలువల్లో నీళ్ళు తిప్పుకుంటూవున్నాడు.

దానికవతల ముంగర చెంచయ్యమడి. ఆ మళ్ళలో వరిపైరు కలుపుకు వచ్చి నల్లగా నిగారిస్తోంది.

ఆ నేల తప్ప అక్కడ మిగిలిన మడంతా బీడుగావుంది. ఒకప్పుడు ముంగర చెంచయ్యమడి ఎంత కరువులోనైనా ఇరుగారూ పండేది. ఇప్పుడు సగం భూమి బీడుగానే వుంది. చెంచయ్య ఒకరింటిపైన వాలిన కాకిని తమ ఇంటిపైన కనీసం రెక్కల చప్పుడు కూడా చేయనిచ్చేవాడు కాడు. అయినా అక్కడామళ్ళకు నీళ్ళు తిప్పుకుంటూవున్నాడు.

ఆ మళ్ళు దాటుకొని మలుపు తిరిగితే అక్కడినుంచి అరఫర్లాంగు దూరంలో బండారోళ్ళపల్లె.

ఆ మలుపులోకి అడుగుపెట్టాడు కుశాలన్న.

అప్పటికే ఒకరిద్దరు అతన్ని చూసుకుంటూ వెళ్ళారు. దాంతో 'కుశాలన్న బతికొచ్చినాడోచ్' అన్న వార్త ఆ గ్రామంలో దావానలంలా వ్యాపించింది.

అతను ఊరు వదిలివెళ్ళిన పిదప ఎక్కడో చనిపోయుంటాడని ఆ గ్రామస్తులు భావించారు.

అందుకే కుశాలన్న వచ్చాడన్న విషయం ఒక ముఖ్య వార్తయి పోయింది. అప్పటికే సూర్యుడు తన గూటికి దగ్గరవుతున్నాడు.

అది బండిబాట!

ఆ దారిన దేకుతూ ముందుకు పోతున్నాడతను.

కుడిపక్కన ఊరిముందరున్న 'నల్లరాళ్ళ'లో ఇప్పుడు బడికూడా వెలసివుంది. అక్కడ రోడ్డు పక్కగా ఓ పెద్ద కానగచెట్ల గుంపు వుంది.

ఆ ప్రదేశం దాటుకొని మళ్ళీ మలుపు తిరిగిన దారి... అలాగే చక్కగా దక్షిణం వైపు సాగి ఊరివీధిగా మారిపోతోంది.

ఆ దార్లో ఎడమవైపున భద్రావతాయన ఇల్లు. కుడిపక్కన కంసల వెంకటాద్రి ఇల్లు.

అది. పూరి పాక. దానిమధ్యలో కొలిమి... పేదవాడి గుండెలా రగులుకుంటోంది ఎర్రగా. ఆ కొలిమిలో కాలిన ఇనుప ముక్కను పట్టుకారుతో ఒక చేత్తో పట్టుకొని, మరో చేతిలో వున్న సుత్తితో కొడుతున్నాడు. అతని తమ్ముడు బ్రహ్మాచారి కొలిమి చక్రం తిప్పుతూ కూర్చొని వున్నాడు.

భద్రావతి బలభద్రి కొడుకు శేషాద్రి పైచదువులు చదివి పెద్ద ఉద్యోగంలో వున్నాడు. తన కొడుకు పెద్దహోదాలో వున్నాడు గదాన్న ధీమా, ఇంటిముందర అరుగుపైన కూర్చొనున్న ఆయన ముఖంలో కొట్టొచ్చినట్టు కనిపిస్తూనే వుంది.

అయినా వాళ్ళ ఇంటిని చూస్తే ఎవ్వరూ శేషాద్రి ఇల్లు ఇదే అంటే నమ్మకపోవచ్చు అదీ పూరిల్లే.

దాన్ని దాటుకొని కొంచెం ముందుకుపోతే ఎడమవైపున గెల్లపల్లోళ్ళ ఇండ్లు. వాటికెదురుగా గాజులోళ్ళ రంగనాధం చిల్లరంగడి.

ఆ దారి అట్లే... నడివీధిలో దూరి... అక్కడికి కిలోమీటరు దూరంలో వున్న దాసపల్లెకు చేరుకుంటుంది. అలాగాక గెల్లపల్లోళ్ళ ఇండ్లకు పక్కగా తూర్పుకు వెళ్ళే కాలిబాట అలాగే కాలనీ యిండ్లకు చేరుకుంటుంది. అవి వడ్డెవాళ్ళకు ప్రభుత్వంవారు

ప్రత్యేకంగా కట్టించి యిచ్చిన ఇళ్ళు.

ఆ దారెంటపోతే... ఆ చివర్న... కాలనీ ఇండ్లకెదురుగా వున్న ఇల్లే కుశాలన్నది. ఆ యిల్లు అటు కాలనీకి, ఇటు పల్లె ఇండ్లకు మధ్యన వుంది.

ఆ యింట్లోనే కుశాలన్న సంసారం సాగింది ఒకప్పుడు.

ఆ మలుపులోకొచ్చి ఆగాడు కుశాలన్న.

అప్పటికే ఆడా, మగా, పిల్లలు, పెద్దలు అందరూ అక్కడ పోగైపోయారు. అందరూ అతన్ని ఒక వింతజంతువును చూసినట్లు చూస్తున్నారు. గెళ్ళపల్లోళ్ళ ముసలమ్మ అత నికి స్వయాన 'అక్క'. ఆమెకు తొంభై ఏండ్లుండవచ్చు. ఆ సమయంలో ఆమె గడ పలోనే కూర్చొని వుంది.

"అవ్వా! కుశాలమామ వచ్చినాడు" అని చెప్పాడు అతన్ని చూసివచ్చిన ఆమె చిన్న మనవడు రుక్మాంగదుడు.

ఆ మాట వినగానే అవ్వ ముఖం క్షణకా లంపాటు ఆనందంతో వెల్లివిరిసింది.

'అయ్యో నాసామి. ఇన్నిరోజులూ ఎక్కడు న్నావురా తండ్రీ. ఏమైపోతివిరా కొడుకా. నా సెక్కిరిపండూ... నా బంగారు సాములూ" అని వగర్చుకుంటూ అక్కడికి పోయింది అవ్వ.

నేలపైన మరగుజ్జులా కూర్చొని వున్న కుశాలన్నను ఆ స్థితిలో చూసిన అవ్వ కడుపు చెరువైపోయింది.

"ఏమిరా ముండాకొడకా నీకీగతీ? " అనడి గింది.

అక్కను చూసేసరికి కుశాలన్నకి దుఃఖం ఆగిందికాదు. మౌనంగా కళ్ళనీళ్ళు పెట్టుకు న్నాడు.

కాళ్ళు లేని అతన్ని చూస్తుంటే అందరి ముఖాల్లోను ఆశ్చర్యం, ఆవేదనా చోటుచేసు కున్నాయి.

వాళ్ళందర్నీ చూస్తుంటే...తన బంధువు ల్నందర్నీ చూస్తున్నట్లు, ఆత్మీయులందర్నీ కళ్ళారా చూసుకున్నట్లు అనిపించింది కుశా లన్నకు.

అందరి ముఖాల్లోను అతనిపట్ల జాలి. దయ కనిపిస్తున్నాయి. వారి ఆప్యాయతను చూసిన కుశాలన్న కళ్ళు చెమర్చాయి.

"అయినోళ్ళనందర్నీ వొదులుకొని బొయ్యి ఈ గతి కొచ్చినా" అనుకొని ఒక నిట్టూర్పు విడిచాడు. అందర్నీ ఒక్కసారి తనివితీరా చూశాడు. రైల్వే పాలాలపైన పడ్డప్పుడు పగిలిన అద్దంలోంచి అస్పష్టంగా కనిపిం చారు కొందరు. మరికొందరు బాగున్న అద్దంలోనుంచి స్పష్టంగానే కనిపిస్తున్నారు.

"ఆయప్ప ఆయాసపడిపోతా అంత ఎండ నబడి వస్తే... వొగముండయినా ఇన్ని మంచినీళ్ళిచ్చిందేమొసూడో... దారొద లండీ... వదలండీ" అంటూ గెల్లపల్లోళ్ళ పెద్దకోడలు యల్లమ్మ అందర్నీ తోసు కుంటూ వచ్చింది.

ఆమె చేతిలో నీళ్ళ చెంబుంది.

"ఇందా కుశాలన్నా... తాగు" అంటూ ఆ చెంబు అతని చేతికిచ్చి, అతని దుస్థితికి మనసులోనే మధనపడుతూ నిలబడింది. ఆ నీళ్ళను ఆత్రంగా తాగేశాడతను. ఆ తాగ డంలో కొన్ని నీళ్ళు పక్కకు దొర్లి, అతని ఛాతీపైనున్న బాడీగుడ్డ తడిసిపోయింది. ఆ తాగడంలోనే తెలిసిపోయింది అతను తిండి తిని చాలారోజులయిందని.

అతన్ని చూస్తూనే ఏదో అనారోగ్యంతో బాధపడుతున్నట్లు ఇట్టే చెప్పేయొచ్చు.

"ఏమక్కా, యల్లక్కా బాగుండావా? దప్పి కతో ప్రాణంబోతావుండె. అన్ని నీళ్ళిచ్చి పుణ్ణెం గట్టుకుంటివి. సల్లంగ నూరేండ్లు బతుకు" అని నీళ్ళు తాగేసిన చెంబును ఆమెకు తిరిగిచ్చేస్తూ నీరసంగా అన్నాడు.

"అది సరే... నువ్వేందిట్లయిపోతివే" బాధగా అడిగింది యల్లమ్మ.

"నా కర్మక్కా!" అని ఆపైన మౌనం వహించాడు.

"మా పాలేటుండాడా? " ఒక్కక్షణం

తర్వాత మళ్ళీ అతనే అడిగాడు.

అతని మాటల్లో ఎప్పుడెప్పుడు పాలేటిని చూద్దామన్నంత ఆతృత.

"ఆ... ఉండాడు"

సమాధానంగా అంది యల్లమ్మ.

"ఆఁ... ఉండామండాడు. ఇంట్లోనే ఉండాడు"

మరి కొందరు ఆమెకు వత్తాసుగా అన్నారు. ఆ మాటతో దేక్కుంటూ అటువైపుకు బయలుదేరాడు. అందరూ అతన్నే చూస్తున్నారు.

కొంత దూరంలోనే అతని ఇల్లు. ఏ ఆలనా పాలనా లేని అనాథ పిల్లలా ఒంటరిగా కనిపిస్తోంది.

ఎప్పుడో పదిహేను సంవత్సరాలముందు బోదతో కప్పిన చుట్టిల్లది. అక్కడక్కడా కప్పు జారిపోయి నల్లగా శిథిలావస్థలో కనిపిస్తోంది.

"యెట్టున్నయిల్లు యట్టయిపోయింది?" అని మనసులోనే అనుకున్నాడు. దాంతో అతని స్మృతి పథంలోనుంచి ఎన్నో సంఘటనలు తెరలుతెరలుగా అతనిముందు రూపుదిద్దుకోసాగాయి.

ఒక్కసారిగా గతమంతా అతని కళ్ళ ముందు గిర్రున తిరిగింది.

## ఆనాటి వ్యథలు



ఆ ఊర్లో బాపట్ల వెంకయ్య ఆయిల్ మిల్లంటే తెలియని వాళ్ళుండరు. ఆ జిల్లాకే అది ప్రసిద్ధి.

పరిశుభ్రమైన ప్యూర్ గ్రౌండ్‌నట్ ఆయిల్ సరఫరా చేసే పేరున్న కంపెనీల్లో అదీ ఒకటి.

దాని మేనేజర్ కన్నయ్య. చాలా ధార్మికుడనీ, మంచివాడనీ చెప్పుకుంటుంటారు.

ఆస్తిపాస్తులు ఏమాత్రం లేని కుశాలన్న ఎలాగో కన్నయ్యను పట్టుకొని 'అయ్యా! నేను దిక్కులేనోన్ని... షావుకారింట్లో ఏదయినా పనిప్పించండయ్యా' అని కాళ్ళమీద పడ్డాడు.

దాంతో కన్నయ్య గుండె కరిగి కుశాలన్నను వెంకయ్య బంగళాలో వంటమనిషిగా పెట్టాడు.

అక్కడ కుశాలన్న ఎంతో ఓపిగ్గా పనిచేసుకుంటూ, నమ్మకస్తుడుగా ఉండిపోయాడు. అప్పుడప్పుడు మాత్రం తన పల్లెకు వెళ్ళి తనకున్న ఏకైక ఆస్తి అయిన పూరింటిని చూసివస్తుండేవాడు.

ఆ రోజుల్లోనే కుశాలన్న పెళ్ళిచేసుకున్నాడు.

పెళ్ళి చేసుకున్న మరు సంవత్సరానికే కూతురు పుట్టింది. ఆ తర్వాత కొన్నేళ్ళకు కొడుకు పుట్టాడు. అతని జీవితం అక్కడే హాయిగా గడిచిపోతోంది. భార్యాపిల్లలతో ఉండటానికి కన్నయ్య ఫ్యాక్టరీ పక్కనే వున్న 'పట్టెడ'లో ఒక పూరికొంప యిచ్చాడు. అలా బంగళాలోను, ఫ్యాక్టరీలోను పనిచేసే వారి కోసమే ప్రత్యేకంగా కట్టింపబడింది 'పట్టెడ'. అక్కడే భార్యాపిల్లలతో ఉంటున్నాడు కుశాలన్న.

ఒకరోజు వెంకయ్యగారి అనుమతి తీసుకొని పల్లెలో తన ఇంటిని ఒక్కసారి చూసి రావడానికి బయలుదేరాడు కుశాలన్న.

అలా పల్లెలోకి వచ్చిన కుశాలన్న తన యింటిని చూసి.. వచ్చి రంగనాథం చిల్లరం గడిదగ్గర బెంచీపైన కూర్చున్నాడు. రంగనాథం అంగడిలో కూర్చొని వచ్చిపోయేవా

ళ్ళకు సరుకులిచ్చి చిల్లర తీసుకుని గల్లాపె ట్టెలో వేసుకుంటున్నాడు. ఆ బెంచీ పైనే ఉన్న నాగులయ్య, చెంగల్రాయుడు, దొర స్వామిలతో కబుర్లాడుతున్నాడు.

"య్యాప్! రంగనాథం.. మిషన్ చెడిపో యిందిగానీ.. ఒగ నూర్రూపాయలుంటే ఇయ్యవయ్యా. తిరిగి ఆదివారం సంత నాటికిచ్చేస్తా" అన్నాడు నాగులయ్య.

"ఏమైందబ్బా... మిషనుకు?" ప్రశ్నిం చాడు రంగనాథం.

"రేయింబవళ్లు తొక్కే పనే గదా! చెడి పోక ఏంచేస్తుందీ?" సాగదీస్తూ అన్నాడు దొరస్వామి.

"అది సరే... పులిచెర్లలో అంగడి పెడితి విగదా... కుట్టేదానికి బాగొస్తా వుండాయా గుడ్డలు?" చెంగల్రాయుడడిగాడు.

"వస్తావుండాయి గుడ్డలకేమీ కొదవలా... అన్నీ అప్పులే. కుట్టించుకోనిబోతారు. ఎప్పుడో సంతనాటికిస్తారు" సమాధానం చెప్పాడు నాగులయ్య.

"ఏమ్మామా... ఎట్టుండాది బంగళాలో ఉద్యోగం?" కుశాలన్నను చూసి టాపిక్ మార్చుతూ రంగనాథం అడిగాడు.

"బాగానే వుండాదబ్బా! తినేదానికీ కుడిచే దానికీ ఏమీ తక్కువలా!" అన్నాడు కుశా లన్న.

"అది సరేమామా! మీ షావుకారుం డాడే... బాపట్ల వెంకయ్య. ఆయన గురించి శానా కథలు చెబతావుంటారే... అది నీకు తెలుసునా?" ఆసక్తిగా అడిగాడు రంగ నాథం.

"సెప్పన్నా... నేనూ యింటా..." అప్పుడే అక్కడికి వచ్చిన వడ్డి గంగన్న అక్కడే కూర్చుంటూ, "రే రంగా... ఒక కట్ట బీడీ ఇయ్యి" అని చిల్లరందించాడు.

"ఏం చెప్పేదబ్బా!" అంటూ నసిగాడు కుశాలన్న.

"అదే మామా... ఆయప్ప ఈ ఊరొచ్చిన ప్పుడు పైగుడ్డ భుజానేసుకొచ్చి... ఈడ కోటీశ్రుడైనాడంటనే... అదీ?" చెంగల్రా యుడు అందుకున్నాడు.

"అదా!?" ఒక్కక్షణం ఆలోచించాడు కుశా లన్న.

"బాపట్లనుంచి వచ్చిన వెంకయ్యకు ఇర్వై లచ్చలు లాటరీ తగిలిందంట. దాంతో ఈ ఫ్యాక్టరీ కట్టినాడని కొందరు చెబుతారు. కొందరేమో... ఆయప్ప మద్రాసుకు బొయ్యి సీట్లాడేవోడంట. ఒకసారి అట్ట సీట్లాడి లచ్చలు సంపాదించుకొని ఒక బాడుక్కారు మాట్లాడుకొని వస్తావుంటే... డబ్బులు పోగొట్టుకున్న రౌడీలు వెంటబడినారంట. వోళ్ళు ఒక జీపులోను, ఒక లారీలోనూ వస్తావున్రంట. సరిగ్గా పుత్తూరు అడవిలో లారీ రాంగానే అటకాయించేసినారంట. ఆయప్ప దగ్గరుండే దుడ్లు పెట్టె వొగసీటు కింద పెట్టేసినాడంట కనిపించకుండా. ఆ కారు డ్రైవోరు కూడా వోళ్ళ మడిసేనంట్లే.. వాళ్ళను సూడంగానే కారాపేసినాడంట. అందరూ కత్తులెత్తుకొని ఆయప్ప దగ్గిరి కొచ్చి దుడ్డేడ బెట్నావోసెప్పు అని గదుమా యించినారంట. ఈయనేమి సామా న్యుడా... కొంతసేపు సెప్పలేదంట. అప్పుడు... ఇస్తావా సస్తావా అని మిడిమే ళంగా మీదపడితే 'ఆగండయ్యా సామి... మిమ్మల్ని చూసేసందిక నాకు వంటికొస్తా వుంది భయ్యానికి... దాట్లబొయ్యి వంటికి బోసేసొస్తా అని చెప్పి, వాళ్ళు ఆ పక్కనుం డగానే ఈ పక్కకొచ్చేసి కారు స్టార్టు చేసు కొని, అదేపత్తా వచ్చేసినాడంట. వోళ్ళేమో తిరపతి రేణిగుంట దాకా ఆయప్ప వెనకం టనే లారీలోనూ, జీపులోను వచ్చి, ఇంగ ఆడ సావనీలే ముండాకొడుకని వదిలేసినా రంట. ఈయప్పేమో ఆ కారును తిరపతి లోనే వదిలేసి సక్కగా రైలెక్కేసి వచ్చేసినా డంట. ఆ దుడ్డుతో ఫ్యాక్టరీ కట్టినాడం టారు. ఏదినిజమో తెలీదుమరి" అంటూ ఓ కథలాగా చెప్పి ముగించాడు.

రంగనాథం యిచ్చిన బీడీ కట్టలోనుంచి ఓ బీడీ తీసి నోట్లో పెట్టుకొని, జేబులోనించి అగ్గిపెట్టెతీసి, గీసి బీడీ ముట్టించుకుంటూ "అట్టగాదన్నా... అదంతా గప్పాలుగానీ..." అని తనకు తెలిసిన విషయం చెప్పసాగాడు గంగన్న.

"ఆయప్ప బాపట్లనించి వచ్చేసినాక... రంగుల ప్రింటింగు బిజినెస్సు బెట్నాడంట. ఆ రంగుల్లో, మన రూపాయలకేసే రంగో చ్చేసిందట. దాంతో ఆయప్ప అచ్చులు తయారు చేయించుకొని ఎవురికీ తెలీకుండా ఇంట్లో కూసోని రేయింబగళ్ళు కట్టలు కట్టలు గుద్దేసినాడంట. అట్ట కోట్లు కొట్టేసి మార్పించేసి ఈ బంగళా, ఫ్యాక్టరీ కట్టినా డంట. వొగసారి గవురుమెంటోడికి తెలిసి పోయి పోలీసులొచ్చి సోదా చేస్తావుంటే.. వోళ్ళకు తెలీకుండా ఆ అచ్చులు దెచ్చి పెద్ద బాయిలో ఏసేసినాడంట"

"యాడ, కళ్ళంకాడుండే పెద్దబాయి లోనా? " మధ్యలో ప్రశ్నించాడు నాగు లయ్య.

"ఆc మిల్లులోవుండే ఆ బాయిలోనే... పోలీసోళ్ళుపోయినాక మళ్ళా అచ్చులు దెచ్చుకొని... ఇంకా కొడతానే వుండాడని చెబుతారబ్బా" అంటూ ముగించాడు గంగన్న.

"అది గూడా నిజమే ఉండచ్చుగానీ గంగన్నా... ఇంకో కథ కూడా చెప్పుకుంటూ ఉంటారబ్బా.. ఏందంటే వోళ్ళ బంగళా కట్టేటప్పుడు గోడలకు కావలసిన రాళ్లన్నీ... కల్లూరడివిలో వుండే పెద్దనగిరిపాలెం కోటుండ్లా ఆడినించీ తోలకొచ్చినారంటగదా. ఆ కోట ముందెవరిదో రాజుల్దంటలే... ఆ కోటరాళ్లు దెచ్చుకునేటప్పుడు... లంకెబిం దెలు లేసినాయంట. వాటిని దెచ్చుకొని షావుకారై పూడిసినాడంటలే" అంటూ తనకు తెలిసిన అంశం చెప్పాడు రంగ నాథం.

"అది సరే రంగా... నాకు నూరూ ఇస్తావా? ఇవ్వవా? అది సెప్పు" తిరిగి గుర్తుచేశాడు నాగులయ్య.

"సరేబ్బా! ఇందా" అంటూ గల్లాలోనుంచి రెండు యాభై రూపాయల నోట్లు లెక్కబెట్టి ఆతనికిచ్చాడు రంగనాథం.

ఆ సమయంలోనే వెంకయ్య ఇంట్లో వున్న మరో వంటగాడు రామయ్య గసపో సుకుంటూ వచ్చి "య్యోవ్ కుశాలన్నా! నీ పోసుగోల... మన పెద్దాయన గుండెనె ప్పితో సచ్చిపోయిండయ్యా... అర్జంటుగా పిల్చకరమ్మని కనకయ్య పంపించినాడు సామీ? " అని చావు కబురు చల్లగా చెప్పాడు.

"అయ్యయ్యో... యట్ట సచ్చిపోయినాడం టయ్యా.. రామయ్యా... దర్మాత్ముడు గదయ్యా..." అంటూ లేచి రామయ్య వెంట తిరిగి పులిచెర్లకు బయలుదేరాడు కుశాలన్న.

ఆవిధంగా బాపట్లనుంచి కట్టుబట్టలతో వచ్చి కోట్లు సంపాదించి, ఆ ఫ్యాక్టరీకట్టి వెళ్ళిపోయాడు షావుకారు వెంకయ్య.

ఒక స్నేహితుడిలా, అన్నదమ్ముడిలా తనను ఆదరించిన వెంకయ్య మరణించిన కొద్దిరోజులకే కలిచెర్ల కన్నయ్య ఇంకా అక్కడ ఉండలేక తన సొంత ఊరు కలిచె ర్లకు వెళ్ళిపోయాడు.

అతని స్థానంలో కొత్త మేనేజర్ వచ్చాడు.

ఏ నాయకుడైనా, ఏ అధికారయినా వచ్చిన కొత్తలో తన ప్రత్యేకతను నిలుపుకో వడం కోసం ఏవేవో మార్పులు, చేర్పులు చేస్తుంటారు. అలాగే ఆ మేనేజరూ ఆ కంపెనీలో కొన్ని మార్పులు చేశాడు. కొత్త కొత్త రూల్సు పెట్టాడు.

కంపెనీలో ఏవేవో అవకతవకలు, చిన్న చిన్న దొంగతనాలు జరుగుతున్నాయనీ, పద్ధతులన్నీ చాలా స్ట్రిక్టుగా తయారు చేశాడు. పొదుపు చర్యలు కూడా ప్రవేశపె ట్టాడు.

తక్కువ మందితో ఎక్కువ పనిచేయించి ఎక్కువ లాభాలు గడించాలన్నది అతని

సిద్ధాంతం.

ఫలితంగా చాలామంది ఉద్యోగుల్ని తీసే శాడు. ముఖ్యంగా అంతకుముందున్న మేనే జర్ అమలుచేసిన పద్ధతులనన్నింటినీ మార్చివేశాడు. అతను ఉద్యోగంలోకి తీసు కున్న చాలామంది వ్యక్తుల్ని ఉద్యోగంనుంచి తీసేశాడు. అందులో భాగంగా వంటమని షిగా చేరిన కుశాలన్ననూ ఇంటికి పంపే శాడు.

ఉన్న ఉద్యోగం ఊడడంతో కుశాలన్న పరిస్థితి... ఏ ఆదరువు లేకుండా... గట్టు మీద చేపలా తయారయింది. అతని కుటుంబం వీధిన పడింది. ఇక గత్యంతరం లేక పట్టెడలో వున్న ఇంటిని ఖాళీచేసి, భార్యా పిల్లల్ని తీసుకుని తిరిగి తన పల్లెకే వచ్చేశాడు.

ఇక చేసేపనులు ఏవీలేక చాలామంది పేదవాళ్లలాగే కంపెనీలో కూలి పనిచేయ డానికే పూనుకున్నాడు.

ప్రతిరోజూ ఉదయాన ఎనిమిదింటికే మిల్లులో కూత వినపడుతుంది. చుట్టుపక్క లనుంచి వచ్చే కూలీలందరూ ఆవేల్టికి పనుల్లో దిగిపోవాల్సిందే. మళ్ళీ పన్నెండుకు మరోకూత. అప్పట్నించీ తిరిగి రెండుగంట లకు మూడోకూత పడేంతవరకు 'లంచవర్'

ఇక అప్పటినుంచీ పొద్దుగూకేవరకూ పని చేయాల్సి వుంటుంది. సాయంత్రం గుమస్తా దగ్గర రోజుకూలీ పట్టీ రాయించుకొని ఆఫీ సుకు వచ్చి 'కూలి డబ్బు' తీసుకొని వెళ్ళాల్సి వుంటుంది.

వ్యవసాయపనులు చేసే ఆడకూలీలకు ఏడు రూపాయలు, మగ కూలీలకు పది రూపాయలు కూలీ.

మిల్లులో పనులయితే చాలాకష్టం గనుక అక్కడ పనిచేసే వాళ్లకు కాస్త ఎక్కువ కూలీ చెల్లిస్తారు.

భార్య దేవకి వ్యవసాయపనులకు పోతుంటే కుశాలన్న మిల్లులో పనికి వెళుతు న్నాడు.

చేసే ఓపిక వుంటే... కంపెనీలో ఇరవై నాలుగ్గంటలూ పనే. రేయింబవళ్ళు 'ఎక్స్‌పె ల్లర్' నడుస్తూనే వుంటుంది. వేరుశనగ మూటలు 'షెల్లర్'లో కుమ్మరించడం, కళ్ళా లలో పప్పు ఎండపోయడం, నూనె తూకం వేసి డబ్బాలకు పట్టడం, శెనగపిండిని మూటలకు వేసి కుట్టడం వంటి పనులెన్నో వుంటాయి.

కళ్ళంలో 'నెట్టుకట్టి'న చెనక్కాయల మూటల్ని ఒక్కొక్కటే వీపున మోసుకెళ్ళి ఇరవై అడుగుల ఎత్తున్న షెల్లర్‌లో కుమ్మ రించాలి. ఆ ఇరవై అడుగుల ఎత్తుకి ఇరవై మెట్లుంటాయి. వాటిని ఎక్కి మూటను షెల్లర్‌కున్న గరాటు ఆకారంలో కుమ్మరిం చాల్సి వుంటుంది. ఈ పని చాలా కష్టం.

మూట కుమ్మరించేటప్పుడు షెల్లర్‌లో **తిరిగే** ముండ్ల చక్కానికి సంచులు తగులు కొని, మనిషే దాంట్లో పడిపోయే అవకాశం వుంటుంది. అక్కడ పనిచేయడమంటే ప్రాణాలతో చెలగాటం. ఏమరుపాటున దాంట్లో పడి కాళ్లూ చేతులు పోగొట్టుకున్న వాళ్లూ వున్నారు. పైగా ఫ్యాక్టరీలో దయ్యం తిరుగుతుందనే వదంతి ఒకటి! అందుకే కరెంటు పోతే చాలు అక్కడ పనిచేసే కూలీలందరూ బిలబిలమని ఫ్యాక్టరీ ముందుండే కళ్లంలోకి పరుగెత్తుకొచ్చేస్తారు.

పగలే సరైన వెలుతురుగానీ, గాలిగానీ వుండదు. గాలికోసం మాత్రం షెల్లర్‌కు సరిగ్గా పైన రేకుల కప్పులోనుంచి ఓ రేకును తీసి ఆకాశంవైపుకు లేపి, అది పడి పోకుండా ఒక ఇనుప రాడ్‌ను అమర్చారు. వర్షంవస్తే మాత్రం దాన్ని మూసేస్తారు. మొత్తానికి అక్కడ పనిచేయడమంటే కూలీ లకు ప్రాణాలతో చెలగాటమే. అక్కడ మూటలు మోసేపని చేస్తున్నాడు కుశా లన్న.

ఉదయాన్న ఇంత ఉడకేసుకొని చెరి కొంచెం క్యారియర్‌లో పెట్టుకొని దేవకీ

కుశాలన్న బయులుదేరి వచ్చేస్తారు. దేవకి వ్యవసాయ పనులకు పోతే కుశాలన్న ఎక్స్ పెల్లర్‌లో పని చేస్తుంటాడు కుశాలన్న ఈమధ్య ఒక పేయదూడను కూడా పట్టుకున్నాడు. దాన్ని మేపే బాధ్యత గౌరికి అప్పగించాడు. గౌరి వాళ్ల కూతురు.

ఫ్యాక్టరీకి చుట్టూ ఎత్తైన గోడలున్నాయి. దానికానుకొని పడమట పక్కన వెంకయ్య నివాసముంటున్న బంగ్లా. ఫ్యాక్టరీకి దక్షిణం వైపున ఓ ఎత్తయిన గేటు. ఆ గేటు ద్వారానే శనక్కాయలు తోలే రైతులు, కూలీలు వస్తుంటారు. లోపలివైపున గేటుపక్కనే ఆఫీసు. అందులో పదిమందిదాకా ఉద్యోగస్తులు పనిచేస్తుంటారు. కూలీలకు టాయ్‌లెట్స్, బాత్‌రూమ్స్, త్రాగునీరు అన్నీ సమృద్ధిగా, సౌకర్యంగా ఉన్న ఫ్యాక్టరీ అది. అక్కడే కడప బండలు పరచిన కళ్లాలు... వాటిమధ్యన 'పెద్దబాయి'.

ఒకరోజు ఉదయాన మొరవపల్లె బుడగశెట్టి, కుశాలన్న మరికొందరు ఆడకూలీలు కళ్లంలో పనిచేస్తున్నారు. కుశాలన్న, బుడగశెట్టి కళ్లం మధ్యలో ఉన్న పప్పు మూటల్ని, కుట్లు విప్పి గుమ్మరిస్తుంటే ఆడ కూలీలు బారెడు పొడువు గొలుసున్న వెడల్పుపాటి రేకుల్ని లాగుతూ పప్పును కళ్లమంతా పరుస్తున్నారు.

వారిని చూసి పందుంపుల్ల నములుతూ... అక్కడికి వచ్చాడు నైట్‌డ్యూటీ వాచ్‌మెన్ ఏకాంబరం.

"ఏం కుశాలన్నా! నేను శానా దినాలుగా సూస్తానేవుండా. తెల్లారొస్తావు, మధ్యాన్నం అన్నంతిని మళ్లా పైటేలకంతా పోతావు. మళ్లా ఏడుకొచ్చి రేతిరి ఏ వంటిగంటకో ఇంటికి పోతుంటావు. ఇట్ట రేయింబవళ్లు పనిచేస్తే మడుసులు గడ్డకడతారా? బిన్నే సచ్చిపోరూ!" కుశాలన్నను కబుర్లలోకి దించాడు.

"యేం చేసేది యాకాంబరమా! కడుపాత్రం అట్టాంటిది. బిడ్లోన్ని గదా! రెక్కల్లో బలమున్నంతవరకుగదా ఈ గసపాటు" తన పని తాను చేసుకుంటూనే చెప్పాడు కుశాలన్న.

"ఇంతరూ పనిచేసేది గుత్తకా? కూలికా?"

"పొగులు కూలి, రేత్రి గుత్త"

"నిన్న ఎంత మాత్రం గిట్టుబాటయ్యా!"

"ఏం గిట్టుబాటోలే యాకాంబరమా! ఈన్నించీ మూట మోసకపోయి షెల్లర్‌లో ఏస్తే మూటకు పావలా అంతేగదా! పైగా ఈ ముండ కరెంటొకటి! గంటకో మాలి పోతాదీ ఒస్తాదీ" యాస్టపోతూ చెప్పాడు కుశాలన్న.

"ఈ గవురుమెంటులో పాణం పోకటా, కరెంటు రాకటా ఎవురూ సెప్పేటిగాలా" మధ్యలో అందుకున్నాడు బుడగశెట్టి.

"మెరుపు మాదిరితో అట్టొస్తాది. ఇట్టపోతాడీ... కరెంటుపోతే ఈ దయ్యం బాధొకటీ?" అన్నాడు కుశాలన్న.

దాంతో వారి సంభాషణ దయ్యంపైకి మళ్లింది.

"దాన్ని నివ్వెప్పుడయినా చూసినావా యాకాంబరమా?" కుతూహలంగా అడిగాడు బుడగశెట్టి.

"ఓ సూడకేమబ్బా... సూసినాన్లే!"

చూశానంటే గొప్పతనంగా ఉంటుందని అలా అనేశాడు. దాంతో ఆ ఇద్దరూ వివరాలకు దిగారు.

"ఎప్పుడు సూస్తివయ్యా సామీ. అంతా వట్టి కతగానీలే!" అన్నాడు కుశాలన్న.

"లేదబ్బా. మాయబ్బతోడు... మాయమ్మ సాచ్చిగా చూసినా" ఒట్టుపెట్టుకున్నాడు **ఏకాంబరం**.

"నీకేంలే సామీ.. బిడ్డా పాపా? బెమ్మచారివి. ఎన్ని వట్లయినా పెట్టుకుంటావు. ఇవన్నీ డవులు మాటలు గానీలే!" ఎద్దేవా చేస్తూ తిరిగి అన్నాడు కుశాలన్న.

"లేదబ్బా సూసినానంటే నమ్మవే?" కచ్చితంగా చెప్పాడు ఏకాంబరం

"ఎప్పుడు సూస్తివో ఎట్ట సూస్తివో సెప్పు యాకంబరమా?" ఆతృతగా అడిగాడు

బుడగశెట్టి.

"నేను ఈ మిల్లు కట్టినప్పట్నుంచీ పనిజేస్తానే ఉండా. అబద్ధం చెప్పను. ఏగ సారి నైట్‌డ్యూటీ వాళ్లు గూడా ఇండ్లకు పొయ్యింగ్రి. నేనొగన్నే గేటు బీగాలేసుకొని దీకళ్లంలోనే బెడ్‌షీటు యేసుకొని పడుకో నుంటి.. ఆకాశంలో సుక్కలు కనిపిస్తా వుండె. గాలి మెల్లిగా రవరవాని తోల్తావుండె. సీమ సిటుక్కుమన్నా వినిపిం చేటట్టు యాడా ఏ సద్దూ లేకండావుండె. మాగన్నుగా నిద్దరపట్టేసింది. ఇంతలో ఉన్న ట్టుండి కరెంటు పూడిశె. అంతా నిరామ యంగా వుండె. మన అరసెయ్యి మనకే కనిపించనంత గాడాం ధకారంగా వుండె.



పైన సుక్కలు, ఆకాశమూ అంతే. ఇంకేమీ కనిపించకుండా వుంది. అంతసీకట్లోనూ కాళ్ల గెజ్జిలు వినిపించె. ఆమింద ఎవురో ఆడమడిసి మెల్లగావచ్చి నా పక్కన పొడు కున్నట్టనిపించె. రేతిరి యట్లో ఈ ఆడ మడిసి ఇక్కడే ఉండి పూడిసినట్టుండాదే. ఇంక నాకు బలే శాన్సు దొరికిందిలే పో అనుకుంటావుంటి. పక్కన పొనుకున్న ఆ మడిసి ఊరికే వుండ్లా. ఎక్కడంటే అక్కడ



వళ్లంతా తడంబట్టె. తీగన్నుమాగన్ను మిందుండా. పూర్తిగా నిద్దరాలా... మెలక వాలే.... అయినా అంతా తెలస్తానే వుండాది. ఇట్ట కొంతసేపు పోయినాకా ఉన్నట్టుండి ఆ మడిసి నా మీద కూచుండె. అంతే అది అట్ట కూసున్నిందోలేదో ఊపిరా డకపాయ. గుండెలమింద మోయలేనంత బరువెక్కిపాయ. గొంతెవురో పిసికేసిన ట్టుండె. మాట్టాడదామంటే మాటరాలా కదిలిద్దామా అంటే కాళ్లూసేతులు ఆడలా ఇది దెయ్యమేరా నాయనా. ఇంగెట్లరా పర మాత్మా అనుకొని మనసులోనే 'నమో వీరాంజనేయం, ప్రసన్నాంజనేయం, జైవజ్ర కాయం' అంటూ ఆంజనేయులు దండకం సదవబడితి. అలా రెండుసార్లు అయిందో లేదో నా కాళ్లూసేతులు కదిలించేదానికి సత్తావచ్చె దాంతో రెండు సేతులూ ఎత్తి దాన్ని పట్టుకుందామనుకుంటి. ఏందో సేతికి దొరికీ దొరకనట్ల బొచ్చుబొచ్చుగా అనిపించె. 'తూ నీ యబ్బడాలా! గబ్బు ముండా! కొడతా! మెట్టుతో కొట్టేస్తా... పోయే లమ్డీపో' అని అరిస్తిని జూడు. ఆ మాటెత్తేసందికి మిల్లులోకి పరిగెత్తె పోరం బోకి దెయ్యం. నల్లంగా పొడువుగా భయం కరంగా ఉండాదిలే. సన్నాబన్నోళ్లయితే జడుసుకోవాల్సిందేననుకో. నేను కాబట్టి సరి పోయిందిగానీ! ఇంక అబ్బుటినించే సెప్పులో పొరకో ఏదో ఒకటి తలకిందేసు కొని పడుకోవాల్సిందే. లేకుంటే వచ్చి మెదె క్కేస్తుంది గబ్బుముండ"

తన అనుభవాన్ని చెప్పాడు ఏకాంబరం.

"సరే ఈడ దెయ్యమెందుకు ఉంటుందం టావు యాకాంబరమా? " కుశాలన్న అడి గాడు.

"యాడ గుప్తనిధులుంటాయో ఆడ పిశా చులు కావిలుంటాయని పెద్దోళ్లు సెప్తావుం టారుగదా!" అన్నాడు ఏకాంబరం.

"సరే ఈడ అంత గుప్తనిధులు యాడుం డాయబ్బా యాకాంబరమా? పిశాచులుండే దానికి? " బుడగశెట్టి అడిగాడు.

అక్కడ మిగిలిన కూలీలు చాలా ఉత్సా హంగా వారి సంభాషణను వినసాగారు.

"యాందయ్యో బుడగశెట్టీ! బంగ్లాలో ఎంత దుడ్డుందో మనకు తెలుసునా. అలివి గాని దుడ్లు, బంగారం బీరువాలకు, బీరువా లకే యేసింద్రా మన షావుకారు. ఈ మిల్లు కొన్ని లచ్చల విలువగదా! మరి వీటికి పిసా చులు కావిలుండవంటావా? " అంటూ ఏదో కొత్త సత్యం కనుగొన్న శాస్త్రవేత్తలా చెప్పాడు ఏకాంబరం.

"ఏమిరా మాటలు పొద్దన్నే. పని కానీంద్రా ముండాకొడుకుల్లాలా!" అంటూ అప్పుడే ఆఫీసుకు వచ్చిన గుర్రప్ప వాళ్లను హెచ్చరిస్తూ దగ్గరికొచ్చాడు.

"చేస్తానే ఉండాంగదన్నా. ఎందుకరస్తావు గానీ" ట్వయన్‌పురి ఎక్కించిన దబ్బనంతో సంచుల్ని కుడుతూనే అన్నాడు కుశాలన్న.

"వీడొకడు కూసేగాడిదొచ్చి మేసే గాడి దను చెడగొట్టినట్టు. లేరా ఏకాంబరం... రేతిరంతా డ్యూటీ చేస్తివిగదా! ఇంకేం ఇంటికి పోరాదా!" ఏకాంబరాన్ని చివాట్లు పెట్టసాగాడు.

"పొగులు డ్యూటీకి... బుడ్డాసాయిబు ఇంకా రాలేదన్నా. వాడొస్తే పోతాలే. ముఖం కడుక్కుందామని ఇట్టొస్తి అంతే" అంటూ నీళ్ల పంపువైపుకు నడిచాడు ఏకాం బరం.

"ఆ త్వరగా కానీ" అని కూలీలను హెచ్చ రిస్తూ ఆఫీసువైపు నడిచాడు గుర్రప్ప.

## అగ్గిదెయ్యం

ఆరోజు రాత్రి...

బండారోళ్లపల్లె వీధిమధ్యలో ఓ పందిరి వేసి వుంది. ఆ పందిరికింద కరెంటు లైటు వేసుకుని యువకులు ఇక వారం రోజు లున్న శివరాత్రి నాడు వేయబోయే నాట

కాన్ని ప్రాక్టీసు చేసుకుంటున్నారు.

పందిరికిటు పక్కన అటుపక్కన రెండు బెంచీలు వున్నాయి. ఆ బెంచీలపైన ఒక వైపున హార్మోనియం వాయించే కదిలి వీరప్ప, చిటి తాళాలు వేసే శరమయ్య, తిమ్మయ్య కూర్చొని వున్నారు. మరో వైపున కంబళ్ల సిద్ధయ్య తబలా వాయిస్తున్నాడు. అతని పక్కనే వెంకటయ్య 'లవకుశ' అన బడే చుక్కలూరి రామ నాటకం పుస్తకాన్ని ముందరుంచుకొని దరువు మరిచిపోయిన వాళ్లకు గుర్తుచేస్తూ అటానీ ఎత్తిస్తున్నాడు. కొందరు నటులు అటు ఇటు కూర్చొని వెనక పాట పాడుతుండే వాల్మీకి పాత్రధారి చిన్నడు "ఎవ్వరహో ఈ కాననమున ఒంట రిగా ఈ వేళా" అంటూ రూపక తాళంలో దరువునాలపిస్తున్నాడు. వారి ముందర కొందరు స్త్రీలు, పిల్లలు కూర్చుని వారి దరు వులు వింటున్నారు. మగవారు కొందరు తమ ఇండ్లపక్కన వేసివున్న బండలపైనా, అరుగులపైనా కూర్చొని ఏవో లోకాభిరామా యణాలు మాట్లాడుకుంటూనే వారి దరు వులు వింటున్నారు.

గెల్లపల్లోళ్ళ ఇంటిముందరున్న బండపైన రంగనాథం, చెంగ్రాయుడు, నాగులయ్య, దొరస్వామి వంటి యువకులు కూర్చొని ఎక సెక్కాలాడుకుంటున్నారు.

"అబ్బ... దినొమ్మ సందేల... పాడిందే పాడరా పంగనామాల దాసరీ అని ఈ ప్రాక్టీసు ఏందిరా రామకిష్టా..." అన్నాడు రంగనాథం.

"యేంటి రంగా అట్టంటివీ... అది సుక్కు లూరి రామనాటకం. ఎంత మంచినాటకమ నుకుంటివి? " అన్నాడు రామకిష్టుడు.

"నాటకం కత అట్టుండనీ గానీ... దీని వల్లా... గోడలు దాటే కారు పిల్లకాయల కంతా మంచి ఛాన్సురాబ్బా!" అన్నాడు చెంగ్రాయుడు.

"అదెట్టా? " అన్నాడు... ఆ పక్కనే వున్న సహదేవుడు.

"హోర్నీ పాసులగూల... పల్లెల్లో ఈ నాట కాలు, భజనలు ఇవన్నీ యేసేది ఎందుకను కుంటివి... ప్రేమించుకోనుండే ఆడోళ్ళు మొగోళ్ళు కలుసుకునేదానికే గదరా నీయిత్త గిలా..." ఉత్సాహంగా చెప్పాడు నాగు లయ్య.

"నిజమేగదా! ఇంట్లో పెద్దోళ్ళంతా ఈ 'వద్దిక' కాడికి వచ్చి కథ యింటావుంటే మొనగోళ్ళు ఆడపిల్లల్ని సులభంగా కలుసు కొని వచ్చేస్తావుండ్లా..." వత్తాసుగా అన్నాడు సుబ్బరమణి.

"ఏమిరా నాయాలా వద్దికంటానే నీకు ఆడాళ్ళు గుర్తుకొస్తా వుండారు... యాడన్నా మరిగినావా ఏందిరా నాకొండె..." వెక్కిరి స్తున్నట్టుగా అన్నాడు దొరసామి.

"యాడనో... గోడలు దాటతా తొక్కుడు బిల్లాట ఆడతావున్నట్టుండాడు కొడుకు... లేకంటే అంతమాటన్నా" ఉడికిస్తూ అన్నాడు సహదేవుడు.

"యే తలమాసిన ముండా మమ్మల్ని జూసి యామారదు గానీ ఊరికే ఉండం డయ్యో... నామిందెందుకు పడతారు? " ఉడుక్కుంటూ అన్నాడు సుబ్బరమణి.

"ఈ పిరికి నా కొడుక్కి... దమ్ములే డివి... రాత్రిపూట వంటిగా ఉచ్చలు పోసే దానికే ఒకరు తోడుండాల... అలాంటోడు గోడలు దాటేంత మొనగోడయినాడంటే నమ్మేదెట్టా? "

అనుమానంగా అన్నాడు దొరసామి.

"ఏమిరా... అట్టాంటి పన్లుచేసే నా కొడు కుల్నందర్నీ వదిలేసి సుబ్బునిపైన పడి అంత మిడిమేళంగా మాట్టాడతారేందిరా"

సుబ్బరమణికి సపోర్టుగా మాట్లాడాడు రామకిష్టుడు.

"సర్లేబ్బా... తమ్ముడి వరసని వాణ్ణి బలే సపోర్టు చేస్తావుండావుగానీ... ఇప్పుడు గనక సుబ్బరమణిగోడు వంటిగా ఊరిముం దరుండే వోన్లోకి పొయ్యి రమ్మనండబ్బా...

పందెం ఏసుకుందారి!" పందెం కాస్తున్నట్లు అన్నాడు దొరసామి.

"వోన్లోనుంచీ మన నల్లరాళ్ళదాంకా దయ్యం తిరగతాదంటలే... ఇంక వాడేడ బోతాడుగానీ..." భయపెట్టే ఉద్దేశంతో అన్నాడు నాగులయ్య.

"దయ్యమంటే గుర్తుకొచ్చిందబ్బో... మా నాయనకూడా సెప్తావుండె... మేకలోళ్ళ బాయికాడినుంచి... అట్ట బచ్చనకుంట దాంకా, ఇట్ట పెద్ద చెరువు దాంకా... అప్పు డప్పుడు కొరివి దయ్యం తిరుగుతుం దంట..." తాను విన్న విషయం చెప్పాడు చెంగ్రాయుడు.

"అవునంటబ్బా! పదడుగుల ఎత్తు, బారెడు పొడువుజడలు, కొరివిమండినట్టు నెత్తిన కుంపటంత అగ్గి పెట్టుకొని తిరుగు తుందంట... అది వచ్చేటప్పుడు గనక ఎదు రుగా బోతిమా అంతే మనకత... నెత్తురు కక్కోని సావాల్సిందేనంట" అన్నాడు నాగు లయ్య.

సుబ్బరమణికి దయ్యాలంటే మహా భయం. అందుకే వారిమాటలు వింటుంటే లోలోపలే అదురు పుడుతోందతనికి... ఆ విషయం తెలిస్తే... ఎగతాళి చేస్తారని మహాధైర్యశాలిలా నటిస్తున్నాడు.

నిజమే... వారందినాలుగా నేనూ చూస్తావుండా... కొరివిదయ్యం వోనింటీ బోతావుందబ్బా!" అన్నాడు రంగనాథం.

"ఆహా... కోస్తివిగదన్నా..." అపనమ్మ కంగా అన్నాడు దొరస్వామి.

"లేదురా దొరసామీ...నేను నిజంగానే సెప్తావుండా.."

నిక్కచ్చిగా చెప్పాడు రంగనాథం.

"రోజూ నువ్వొక్కడివే ఎట్ట సూస్తావుం డావు రంగడా!"

అనుమానంగా అడిగాడు నాగులయ్య.

"నాకీ మద్దెన వంటీపు (ఆరోగ్యం) తగ్గిం దిలే. పది దినాలుగా కడుపుసుగ్గు బోతా. వుండాది. దినామ్మూ నడిజాంకాడ సంపతా వుండాది.... అందుకని నల్లరాళ్ళలోకి వచ్చి పోతావుంటా... అప్పుడే సూస్తావుండానబ్బా దెయ్యాన్ని... నాకు భయ్యమే.... అది ఉత్తోళ్ళ మడికాడికి రాంగానే నేను వచ్చేస్తా వుండాలే... ఈరోజు కూడా వస్తుంది. కావా లంటే... సూపిస్తా." నమ్మకంగా చెప్పాడు రంగనాథం.

"రంగా... ఈ కాలంలో దెయ్యాలేడి వయ్యా సామీ... మిషన్లు, కరెంటు తీగెలు... ఇనుమంటే వాటికి భయం గదా... ఇనుముంటేఇంక ఆ పొడకే రావు దెయ్యాలు... దేశమంతా తీగలైపాయె...

ఇంకెక్కడ దెయ్యాల్లే అన్నాడు రామకిష్టుడు.

"లేదబ్బా... మాయమ్మసాచ్చిగా... మాఇ ల్లెపదేవుడు ఈశ్రుడిసాచ్చి... ఈ భూమమ్మ సాచ్చిగా నిజమే సెప్తాండ... నేను అగ్గి దెయ్యాన్ని దినొమ్మూ చూస్తానేవుండా" ఒట్టు పెట్టుకుని మరీ చెప్పాడు రంగనాథం... అతని మాటల్లో ఎలాగయినా తాను కొరివి దయ్యాన్ని చూసినట్టు నమ్మకం కలిగించా లన్న తాపత్రయం గోచరిస్తోంది.

"సరే! అయితే ఆ దయ్యాన్ని ఈరోజు మాకు చూపిస్తావా? " సీరియస్‌గా అన్నాడు దొరస్వామి.

"అట్టకాదబ్బా. పందెమేసుకోండి"

వాళ్ళను పందేనికి ప్రోత్సహిస్తూ అన్నాడు నాగులయ్య.

"పదిరూపాయలు పందెమబ్బా! ఎవురు వోడిపోతే వాళ్ళు గెల్చినోళ్ళకు పదిరూపా యలియ్యాల? "

ఇద్దరిమధ్యన పెద్దమనిషిలా అన్నాడు రామకిష్టుడు.

"ఆ... నేను రెడీ... ఇబ్బుడే ఊరిముంద రికి పోదాం చూపిస్తా..." నమ్మకంగా అన్నాడు రంగనాథం.

"ఏం దొరసామీ! నీమాట!" అడిగాడు చెంగ్రాయుడు.

"ఎర్రి ముండాకొడుకుల్లారా... దెయ్యాలే డుండాయిరా... మడిసికి మించిన దెయ్య

మేలేదురా ప్రపంచంలో" అన్నాడు దొరస్వామి.

"రంగనాథం పందెం కట్టినప్పుడు నీకే మబ్బా... మరిపందెం కాయి!" రెచ్చకొడుతూ అన్నాడు నాగులయ్య.

"నేనూ రెడీ... రంగానాథంను చూపించమనండి దయ్యాన్ని" ఛాలెంజింగ్‌గా అన్నాడు దొరసామి.

"నేను ఇప్పుడుకూడా రెడీ!" దృఢంగా అన్నాడు రంగనాథం.

ఇద్దరూ పట్టుదలకు పోయారు. సరే అంటే సరే అనుకున్నారు. వారికి అదీ ఒక ఆటలాగా తమాషాగా తోచింది. టైం చూసుకున్నారు. సరిగ్గా పదకొండయింది. నాటకం వద్దికలో కుశుడి పాత్రధారి "పట్టుడీ హయముని పట్టుడీ" అంటూ దరువును ఆదికెక్కించి పాడుతున్నాడు... ఆదికెక్కించిన తాళం, తబలా, మిగిలిన వారివెనుక పాట... ఆ ప్రాంతాన్ని గుమ్మెత్తిస్తున్నాయి. నాటకంలో అశ్వాన్ని పట్టడానికి కుశుడు బయలుదేరితే అదేదీ పట్టించుకోని దొరస్వామి, అతని మిత్రులు దెయ్యాన్ని పట్టడానికి ఊరిముందరకు బయలుదేరారు. ఊరిముందరున్న నల్లరాళ్ళపైన కూర్చొని కొరివిదయ్యం కోసం ఎదురుచూడసాగారు.

కొరివి దయ్యం తిరిగే 'హోని' అక్కడికి ఫర్లాంగుదూరంలో వుంది. కబుర్లాడుకుంటూ అటువైపే చూస్తున్నారు.

ఊహు... అలా ఎంతసేపు చూసినా సమయం గడచిపోతోంది గానీ కొరివి దయ్యం రావడంలేదు. క్రమేపీ వారిలో అసంతృప్తి చోటుచేసుకుంటోంది. రంగనాథంలో ఓడిపోతానేమోనన్న భయం బయలుదేరుతోంది.

ఊర్లో వద్దిక ఆగిపోయి చాలాసేపయింది.

పల్లెపల్లే రాత్రివడిలో మత్తుగా జోగుతోంది. ఎక్కడ చూచినా చీకటి.

అప్పుడప్పుడూ 'అంబా' అని అరుస్తున్న ఓ లేగదూడ అరుపు.

ఆ చీకటిలాగే కటిక నిశ్శబ్దం!

సమయం గడిచేకొద్దీ దొరస్వామికి గెలుస్తానన్న ధీమా!

"యేం రంగా! నిజం సెప్పు. నువ్వు అగ్గిదెయ్యాన్ని నిజంగా చూసినావా?" అడిగాడు చెంగల్రాయుడు.

"మాసరస్తో (సరస్వతి సాక్షిగా) చూసినారా... నిన్నా యింతపొద్దుకాడనే చూసినా" నెత్తిన చెయ్యిపెట్టుకొని చెప్పాడు.

"అయితే యాడన్నా. ఇంకా రాలా?" బెరుకుబెరుగ్గా అన్నాడు సుబ్బరమణి.

"ఆ... ఉంటేగదా సూపిచ్చేదానికీ.." హేళనగా అన్నాడు నాగులయ్య.

"అబ్బ... ఎంతసేపురా నాయనా... నిద్దరొస్తాఉండాది" ఆవులిస్తూ అన్నాడు సహదేవుడు.

"అబ్బ... ఉండంర్రా... ఇంకొంచెం సేపు సూద్దాం.. అటోఇటో తేలిపోతుందిగానీ" అన్నాడు రామకిష్టుడు.

"ఎంతసేపు చూసినా ఇంతేగానీ...ఇంక లెయ్యన్నా నిద్దరొస్తావుండాది" మళ్ళీ అన్నాడు సహదేవుడు.

"వీడొగ మొద్దురాయుడురా సామీ... ఎప్పుడూ నిద్రే..." అసహనంగా అన్నాడు చెంగల్రాయుడు.

"మొత్తానికి రంగనికి పదీ పోయినట్లేబ్బా!" తిరిగి రెచ్చగొడుతూ అన్నాడు నాగులయ్య.

"అదెట్టబోతుంది గానీ చూస్తా ఉండంర్రా నాగులూ!" లేని నమ్మకాన్ని తెచ్చిపెట్టుకుంటూ అన్నాడు రంగనాథం.

పదిరూపాయలూ ఇక నాదేననుకుంటూ లోలోపలే ఆనందపడిపోసాగాడు దొరస్వామి.

ఇలా మరికొన్ని క్షణాలు దొర్లినాయి.

అయినా లాభంలేకపోయింది.

కొరివి దయ్యం రాలేదు.

రానురాను రంగనాథంకు కూడా

నమ్మకం చెదిరిపోతోంది.

"ఏమబ్బా! నిజంగా దెయ్యంవుండి.. అది ఇట్టేవస్తే ఎట్టబ్బా? " అన్నాడు సుబ్బరమణి.

"వొరే అదురు నాకొండె... అస్సలు దెయ్యమనేది ఉంటేగదరా వచ్చేదానికీ..." అన్నాడు నవ్వుతూ దొరస్వామి.

"గెలుస్తానని ఎంత కుశాలగా ఉండాడో సూడబ్బా దొరస్వామి... నాకు నిద్దరొస్తా వుందంటే... మీకు తమాసగా ఉండాదే... ఏంచేయాలి? " నసపెట్టసాగాడు సహదేవుడు.

"సరే! ఇంకఅదిరాదుగానీ... రంగనాథం ఓడిపోయానని వప్పుకోవాలగదా!" అన్నాడు నాగులయ్య.

"ఏమిరంగా! ఇంక వప్పేసుకోబ్బా ఆడపోనీ... రేతిరి అయిపోతావుండాది" రామకిష్టుడు తొందరచేశాడు.

"లేదబ్బా! రోజూ చూస్తానేవుండా... ఇదే టైము. ఇంకరావాల!" ఆకాశంలోకి ఒకసారి చూసి ఆ తర్వాత మేకలోళ్ళ బాయివైపుచూశాడు.

అగ్గి దయ్యం వెలుతురు కాదుగదా... కనీసం 'బీడీ' వెలుగుతున్నంత కాంతికూడా కనిపించలేదక్కడ. దాంతో 'నా పదిరూపాయలూ గెట్టివి కాదేమో'అని మనసులోనే ఓటమిని అంగీకరించడానికి సిద్ధపడసాగాడు రంగనాథం. అందరూ దొరస్వామి గెలిచినట్టే భావించసాగారు.

ఇంతలో "రంగన్నా!" అంటూ కేక పెట్టాడు సుబ్బరమణి.

ఆ అరుపుకు అందరూ అదిరిపడ్డారు. చీకట్లో ఏదయినా పురుగు ముట్టుకున్నదేమోనని అనుమానపడ్డారు.

"ఏమిరా సుబ్బా!" కంగారుగా అన్నాడు రంగనాథం.

"అట్ట సూడండి సామీ! వచ్చేస్తావుండాది కొరివిదెయ్యం" భయంతో వణికిపోతూ చెప్పాడు సుబ్బరమణి.

అందరూ అటువైపుకు ఒక్కసారిగా చూశారు.

అక్కడ మేకలోళ్ళ బాయిదగ్గర మూరెడు పొడవుతో ఒక జ్వాల కదులుతూ రావడం కనిపించింది.

"దొరస్వామీ... ఏమోననుకుంటిమి గానీ... ఇప్పుడు నువ్వు ఓడిపోయినట్టే నబ్బా" ఉత్సాహంగా అన్నాడు నాగులయ్య.

"నేను చెప్పలా... నామాట నమ్మితిరా మీరు... ఇప్పుడు చూడండి.. సరిగ్గా ఇదే టయానికి వస్తాది... అదే అగ్గి దెయ్యం"

తాను గెలిచానన్న ఆనందంలో పొంగిపోతూ అన్నాడు రంగనాథం.

"ఆ...ఏమి దొరసామీ... ఇంక పదీ రెడీ చేసుకో" సహదేవుడన్నాడు.

"ఉండరా ముదాలీ! అది కొరివిదెయ్యం అవునోకాదో సూద్దాం" అన్నాడు దొరస్వామి.

అందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు.

అది రాను రాను దగ్గరకాసాగింది.

అందరూ ఊపిరిబిగపట్టి అట్టే చూడసాగారు.

శూన్యంలో అటువేపుకే వస్తున్నజ్వాల...

మూరెడు పొడవుతో మండుతున్న నెగడులా కదిలివస్తున్న జ్వాల!

"ఇట్నే వస్తాంది సామీ... అది మనల్ని గమనించినట్టే వుండాది. మనల్ని మింగేసునా ఏమిసామి.... కొరివిదెయ్యం అంటే... 'మిత్తవ' గదా. అది 'కాటేరి'తో సమానం... ఈడే వుంటే నెత్తురు కక్కోని చస్తాం.

మాయమ్మకు నేనొగన్నే కొడుకునయ్యా సామీ... నేను బోతే పేరు సెప్పేదానికి కూడా ఎనకా ముందూ ఎవరూ లేరు. నామాటిని పోదాంపదండి..."

బెంబేలుపడిపోతూ... దొరస్వామిని గట్టిగా పట్టేసి అన్నాడు సుబ్బరమణి.

"తు... బెదురునాయాలా... ఊరికే ఉండు"

# ....ఏరిన ముత్యాలు....

★ విద్యయే దేశ ప్రధాన రక్షణ

-ఎడ్మండ్‌బర్క్

★ చేసిన తప్పు ఒప్పుకోవటం ఉత్తమం. అది మన దారుఢ్యాన్ని పెంచుతుంది

-గాంధీ

★ అజ్ఞానం నుంచి భయం ఉద్భవిస్తుంది

-ఎమర్సన్

★ ఆత్మకు ప్రాణవాయువు స్వేచ్ఛ

-మోపేదయాన్

★ నిలకడలేనివారు సూత్రాలను చొక్కాలకంటే తేలికగా మార్చుకుంటారు

-ఎడ్వర్డ్‌యంగ్

★ పిరికివాడు చనిపోయే లోపుల అనేకసార్లు మరణిస్తాడు. సాహసవంతుడు ఒకేసారి మరణిస్తాడు

-విలియమ్ షేక్స్‌పియర్

★ అనేకత్వంలో ఏకత్వాన్ని కనుగొనడమే ధ్యానం

-స్వామివివేకానంద

★ బలహీన మనుష్యుల ఒకే ఒక ఆశ్రమం సోమరితనం

-పి.డి.స్టాన్‌హోప్

★ చట్టమనే పతాకాన్ని ధనమనే పవనం ఎగురవేస్తుంది

-రష్యన్ సామెత

★ వేయిమంది మతాచార్యులకంటే ఒక ఉత్తమోపాధ్యాయుడే విలువైనవాడు

-ఇంకర్‌సాల్

★ చరిత్రను నిర్మించేది వీరులుకాదు. చరిత్రయే వీరులను నిర్మిస్తుంది

-జె.వి.స్టాలిన్

★ చచ్చిన తరాల సాంప్రదాయపు బరువు, పీడ కలవలె బతికున్న వారి బుర్రలను వెంటాడుతుంది

-కార్ల్‌మార్క్స్

★ విద్యావంతులైన ప్రజలను నడిపించుట తేలిక, తరమటం కష్టం. పరిపాలించుట తేలిక, కాని బానిసలను చేయటం అసాధ్యం

-వార్డ్‌బ్రోహమ్

★ మేధకు అధ్యయనం, దేహానికి వ్యాయామం లాంటిది

-సర్ రిచర్డ్‌స్టీవ్

సేకరణ: జక్కుల వెంకన్న




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

జూన్ చతుర నవల **చీకటిముడులు**

........................................................................................

**సమీక్షకుని పేరు :** ........................................................................

**చిరునామా :** ..............................................................................

........................................................................................

........................................................................................

........................................................................................

అతని చేతుల్ని విసిరికొట్టి పైకి లేచాడు దొరస్వామి.

లేచి దానివైపు పరిశీలనగా చూశాడు. అతని మస్తిష్కంలో ఏదో అనుమానం కుమ్మరిపురుగులా తొలిచింది.

"ఒరే... దీనికతేందో తేల్చేద్దాంగానీ దా కానగచెట్టుచాటుకు రాండ్రా" అన్నాడతను.

ఆ మాటతో లేచి అందరూ అతనితో బాటు ఆ కానగచెట్టువెనక్కి వెళ్ళి నక్కి చూడసాగారు.

అది ఇంకాస్త దగ్గరయింది.

ఆ వెలుగులో ఏదో ఓ ఆకారం నల్లగా కదలి వస్తున్నట్లు అనిపించింది.

క్షణాలు గడిచిపోతున్నాయి.

అది ఇంకా దగ్గరగా వచ్చింది.

సుబ్బరమణి వణికిపోసాగాడు.

చెంగల్రాయుడు కూడా లోలోపలే వణికి పోసాగాడు.

అది ఇంకా ఇంకా దగ్గరవుతోంది.

ఈసారి అందరూ భయంతో వణికిపోతు న్నారు. ఒక్కదొరస్వామి తప్ప.

వారి గుండెల చప్పుడు వారికే వినిపి స్తోంది.

ఊపిరి బిగపట్టి చూస్తున్నారు.

"మామా... నాకు...నా....కు శానా భయ్యంగా ఉం...డా....ది" వణికిపోతూ దొరస్వామి చెవిలో గుసగుసమన్నాడు సుబ్బరమణి.

"వీడెవడ్రా వీడు... పిల్లిని సంకలో పెట్టు కున్నిట్టుండాడే..." కసురుకున్నాడు దొర స్వామి.

"ఈ అదరు నాకొండె ఉచ్చలు పోసుకునే ట్టుండాడే..." మంద్రస్థాయిలో అన్నాడు రంగనాథం.

అతనికీ లోపల భయంగానే వుంది.

"అవునురా... దేవుడా... పంచెతడిసి పోయేట్టుగా ఉండాదే? " అన్నాడు సుబ్బర మణి.

"హారేనాయనా....మేమంతా ఉండంగా నిన్నొగన్నే ఎత్తకపోదులేరా... అంతగానైతే నాపానం అడ్డవెడతాలేరా ఊరుకోనుండ్రా నాకొండె" అన్నాడు దొరస్వామి.

దాంతో మౌనంగా అలాగే ముడుచుకుని కూర్చున్నాడు సుబ్బరమణి.

ఇప్పుడు అది సరిగ్గా ఆచెట్టుకాడికేవ చ్చింది.

వారి ప్రైప్రాణాలు పైనేపోయినట్టనిపిం చింది.

దొరస్వామి మాత్రం దాన్నే తీక్షణంగా చూస్తున్నాడు.

ఇప్పుడది సరిగ్గా ఆ చెట్టుదగ్గరికి వచ్చే సింది.

సుబ్బరమణి భయాన్ని అణచుకోలేక చెట్టుకొమ్మను చేత్తో పట్టుకున్నాడు. దాంతో చెట్టుకొమ్మ ఆకులు సరసరమని శబ్దం చేశాయి.

ఆ శబ్దానికది అక్కడే టక్కున ఆగిపో యింది.

పైన జ్వాల.... కింద... ఆకారం!

ఆకుల మధ్యనుంచి చూస్తున్న వాళ్ళకి ఆ ఆకారం అస్పష్టంగా కనిపిస్తోంది.

అది ఆచెట్లోకే చూస్తూ నిలబడ్డది.

పైనజ్వాల... కింద...ఆకారం.

"ఎవురో మడిసిలాగుండాడే..." అని అను కొని పైకిలేచి చూశాడు దొరస్వామి.

అది గమనించి 'ఎవరక్కడ' అని ప్రశ్నిం చింది ఆ ఆకారం.

"నేనే" అంటూ చెట్టుచాటునుంచి ముందుకొచ్చాడు దొరస్వామి.

"ఓ... దొరస్వామీ నువ్వా... ఇంతరేతి రిలో ఈడేం చేస్తావుండావు? " ప్రశ్నించింది ఆ ఆకారం.

"నువ్వా కుశాలన్నా! ఎవురో అనుకొం టిలే!" అతని దగ్గరికి పోయాడు దొర స్వామి.

ఆ మాటతో మిగిలిన వాళ్ళూ పుట్టలో నుంచి వస్తున్న చీమలుమాదిరి ముందు

కొచ్చి నిలబడ్డారు.

"ఓ యేందిరాబ్బా... ఇంతమందుండా రీడా!" ఆశ్చర్యంగా వారినిచూస్తూ ప్రశ్నిం చాడు కుశాలన్న.

"నాటకం వద్దిక అయిపాయ. ఇట్ట వంటి కొచ్చినాం గానీ... నువ్వేంది కాగడా పట్టు కొని ఇంతరేతిరికాడ వస్తావుండావే? " రంగ నాథం ప్రశ్నించాడు.

"నైట్ డ్యూటీ గదా మిల్లులో... పన్నెం డుకైపాయ....మబ్బులో పురుగూపుట్రా వుంటుందనీ... పాత సంచిపట్ట కట్టెకుసు ట్టుకొని నూనెలో అద్ది ముట్టించుకోనొస్తా వుండా... అది కరెట్టుగా మన ఊరిదాంకా వస్తాదిలే..."

వివరంగా చెప్పాడు కుశాలన్న.

అప్పటికే సంచిపట్ట కాలిపోయి ఆరిపోవ డానికి సిద్ధంగా వుండడంతో... దాన్ని అక్కడే దారిపక్కన పడేశాడు.

"వస్తాబ్బా... మూట్లు మోసీ మోసీ వళ్ళు పోట్లుగనే " అంటూ ఊర్లోకి నడవసాగాడు కుశాలన్న.

కొరివి దయ్యం రహస్యం మంచులా కరి గిపోవడంతో అందరూ అతనివెంటే... ఊర్లోకి బయలుదేరారు.

రక్తం తాగిన భూతం



ఈ సంఘటన జరిగిన కొద్దిరోజులకు మిల్లులో కుశాలన్నకో ఎదురుదెబ్బ తగి లింది.

ఒకరోజు మధ్యాహ్నం...

కొక్కోళ్ళపల్లెనుంచి నిండా శనక్కాయల మూటలు వేసుకొని వచ్చి ఆఫీసు పక్కన ఆగింది లారీ. అది ఆగీ ఆగగానే గుత్తకు మూటలు మోసే కూలీలు పరిగెత్తుకుంటూ లారీ దగ్గరకు చేరుకున్నారు. వారితోపాటు కుశాలన్న, బుడగశెట్టీ కూడా వచ్చారు.

"ఆ... తూకమేసినవేగానీ, అన్లోడు చేసి కళ్ళంలో ఒకపక్కన నెట్టు కట్టండి. రేపు ఎండబోయొచ్చ" అని పురమాయించాడు అప్పుడు అక్కడికి వచ్చిన అసిస్టెంట్ మేనే జర్ గుర్రప్ప. అప్పటికే డ్రైవర్ దిగిపోయి వున్నాడు.

కుశాలన్న గబగబ లారీ ఎక్కి 'డోరు' తీసేశాడు. బుడగశెట్టి భుజానుండే తలగుడ్డ తీసి తలకు చుట్టుకున్నాడు. బనీను తీసి, ఆఫీస్ కిటికీకి చుట్టిపెట్టాడు. ఆ తర్వాత డోరు ముందరికొచ్చి "అందియ్యిమూట"అని వీపును డోరువైపు మళ్ళించి సిద్ధంగా వున్నాడు. అప్పటికే లాఘవంగా ఒకమూ టను దించి మోకాలితో నెట్టుకుంటూ దాన్ని బుడగశెట్టి వీపున పెట్టాడు. దాన్ని అతను అలాగే మోసుకెళ్ళి ఆఫీసు ముందరేవున్న కళ్ళంలో ఒకపక్కగా వేసి వచ్చాడు. మిగి లిన కూలీలు అదేమాదిరి మరోవైపు మూటలు దించసాగారు.

అలా తెచ్చిన మూటల్ని ఒకదానిపైన ఒక టిగా మట్టసంగా పేర్చుతున్నారు. అదే నెట్టుకట్టడమంటే...

అలా లారీలోని మూటలన్నింటినీ దించి నెట్టు కట్టడానికి దాదాపురెండు గంటలు పట్టింది. చివర వాటికి పట్టీ రాయించుకు న్నారు. అలాచేసిన పనికంతా పట్టీరాయిం చుకుని చివర ఆ పట్టీను ఆఫీసులో 'క్యాషి యర్'కిచ్చి డబ్బు తీసుకోవడం అక్కడ పరి పాటి.

కొందరు అలా తమ పట్టీలు ఆఫీసులో యిచ్చి. సొమ్ము తీసుకువెళుతున్నారు.

ఇంతలో "వరే కుశాలగా! బుడగడు, నువ్వూ... కళ్ళంలో ఆపక్కుండే కాయ షెల్లర్‌లో పోసిపొండి..." అని పురమా యించాడు గుర్రప్ప.

అతను చూపించిన కాయల్ని ఒకొక్క మూట చొప్పున వీపున మోసుకొని వెళ్ళి ఎక్స్‌పెల్లర్‌లోని షెల్లర్‌లో వేయసాగారు కుశాలన్న, బుడగశెట్టి. పైన షెల్లర్‌కు ఆను కొని బారెడు వెడల్పు మాత్రమే చెక్కలతో నిర్మించిన స్థలంవుంది. దానిచుట్టూ ఒక ఇనుపరాడ్డు ఆధారంగా వుంది. సరిగ్గా దానికి పైన గాలికోసం పైకెత్తబడివున్న రేకుగుండా ఆకాశం కనిపిస్తోంది.

వాళ్ళు ఒకరు మార్చి ఒకరు మూటల్ని ఎత్తుకెళ్ళి ఆ చదరంలో దించి, అలాగే మూటను చాకచక్యంగా వంచి షెల్లర్‌పై నున్న పెద్దగరాటు ఆకారంలో పోస్తున్నారు. ఖాళీ అయిన సంచుల్ని మడతపెట్టి మెటిక లకింద ఒకచోట చేర్చిపెట్టుకుంటున్నారు.

గరాటు ఆకారంలో పోయబడినకాయలు మెల్లగా షెల్లర్‌లోకి జారి ఆ తర్వాత పొట్టు ఒకవైపుకు, పప్పు ఒకవైపుకు విడిపోతు న్నాయి. గింజలు ఒకరేకు గొట్టంద్వారా మరోవైపున నేలపైన కుప్పగా పడుతు న్నాయి. పొట్టు పొడవాటి గొట్టంద్వారా ఎక్స్‌పెల్లర్ వెలుపలికి పడిపోతోంది.

ఈ షెల్లర్‌కు ఇటువైపున అలాంటి మిషనే మరొకటి వుంది. అందులో గింజల మూటలు కుమ్మరిస్తే... అవి క్రష్షర్‌లో పడి నలిగి, పిండి ఒక వైపుకు, ఆయిల్ మరోవై పుకు గొట్టాలద్వారా పంపబడుతోంది. అలా వెళ్ళిన ఆయిల్ 'ఫిల్టర్‌టాంక్'లోకి పంపబడి శుద్ధిచేయబడుతుంటే అక్కడున్న ఇద్దరు కూలీల్లో ఒకరు గొట్టంద్వారా డబ్బాలకు పట్టి తూకం వేస్తుంటే... మరొకతను ఆ డబ్బాలను వరుసగా ఒకచోట పెడుతు న్నాడు. అతను వరుసగా పెట్టిన ఆ డబ్బా లకు మరొకతను ఆపక్కనే సీలువేసి పెడు తుంటే మరొక ఇద్దరు కూలీలు వాటిని గోడ వున్కు చేరుస్తున్నారు.

ఇవన్నీ సులభమైన పనులేగానీ షెల్ల ర్‌లో శనక్కాయలు, పప్పూ కుమ్మరించడమే కష్టం. ఏమాత్రం ఏమారినా ప్రమాదమే. మూటకుమ్మరించేటప్పుడు గరాటు ఆకారం కింద తిరుగుతున్న 'మర'కు గోనెసంచి గానీ, లేదా దానికున్న ట్వొయిన్‌దారాలు గానీ తగులుకుంటే... కనురెప్పపాటులో అది లాగేస్తుంది. కాబట్టి కుశాలన్న, బుడగ శెట్టి జాగ్రత్తగా మూటలు కుమ్మరిస్తున్నారు. అలవాటయిన పనేగనుక చెకచెక చేసుకుపో తున్నారు.

దాదాపు అన్ని మూటలు అయిపో యాయి. ఇకరెండు మూటలు మాత్రమే మిగిలాయి. అందులో ఒక మూటను ఎత్తి మరో మూటపైన పెట్టి, వెనక్కి తిరుక్కొని ఆ మూటను వీపున పెట్టుకొని వెళ్ళి కుశా లన్న దాన్ని షెల్లర్‌లో కుమ్మరించి మెటి కలు దిగాడు. సరిగ్గా అప్పుడే బుడగశెట్టి చివరిమూటను మోసుకెళ్ళి షెల్లర్‌లో పోస్తూ కుశాలన్నతో మాట్లాడసాగాడు.

"ఏం కుశాలన్నా. నువ్వింక ఇంటికిపో... పట్టీ రాయించుకుని నేను డబ్బులు తీసిపె డతాను. బిన్నే యింటికి పొయ్యి అంత తినేసి ఏడుకంతా నైట్‌డ్యూటీకి టంచనుగా వచ్చెయ్"

"అట్టేలే బుడగా. మీ యిల్లు ఈడ పట్టెడ లోనే గదా... నువ్వు ఆ పనిచేసుకొని వచ్చేయ్. వంటికంటుకున్న దుమ్మును తల గుడ్డతో దులుపుకుంటూ చెప్పాడు కుశా లన్న.

వారి శరీరాలు శనక్కాయలదుమ్ము అంటుకొని నల్లగా అసహ్యంగా కనిపిస్తు న్నాయి.

ఇలా మాట్లాడుతుంటే... బుడగశెట్టి చేతి లోని సంచీ కొంచెం కొంచెమే కిందకి జారు తోంది.

"ఏం బతుకో ఏమో... ఇంత కష్టంచేసినా

పొట్ట నిండేదే కనా కష్టంగా ఉండాది"

నిరాశతో నిట్టూరుస్తూ నిష్ఠూరపోయాడు బుడగశెట్టి.

అతని చేతిలోని సంచి ఇంకొంచెం కిందికి జారింది.

"మన బతుకులింతే... మనబాధలు మారవు. మన బాధలగురించి ఎవరికి పట్టింది. ఏదో మాదిరి బతక్క తప్పదు గదా"

తాత్త్వికంగా అన్నాడు కుశాలన్న.

"ఎదిగిన బిడ్డ యింట్లో ఉండిపాయ. మిగిలిన పిల్లోల్లకు సదూ సందెలేదు. ఆ పెద్ద బిడ్డెనట్ల వొగింటిదాన్ని చేసేస్తే... కొంచెం ధైర్యం కానీ జరగలా.... ఏం జేయాల!" తన బాధను ఏకరువు పెట్టాడు బుడగశెట్టి.

"ఆ... నాకూ ఒక ఆడకూతురుండాది. ఈ సంవత్సరమంతా పోతే నేనూ ఆయమ్మకు పెండ్లి చేయాల్సిందే" తన పరిస్థితిని తల్చుకున్నాడు కుశాలన్న. ఇంతలో బుడగశెట్టి ఓ గావుకేక పెట్టాడు.

"ఏమిరా బుడగా" అంటూ కంగారుగా పైకి చూశాడు కుశాలన్న.

అక్కడ సంచీ కొస తగులుకొని 'మర' మిషన్ అతన్ని లాగి గుంజేసింది. ఓ క్షణం ఏం చేయాలో కుశాలన్నకు పాలుపోలేదు.

అతను గరాట ఆకారంపైన బడి గింజుకుంటున్నాడు.

మరుక్షణం కుశాలన్నకు కర్తవ్యం స్ఫురించింది. అంతే "వొరే... మిషనాపండ్రా... బుడగడు మిషన్‌లో పడి పాయరా... వొరే మిషనాపండ్రా సామీ..." అంటూ పిచ్చిగా అరుస్తూ వెలుపలికి పరుగెత్తాడు కుశాలన్న.

అతనికేకలు విని అందరూ! అక్కడికి వచ్చేశారు.

మేనేజరు, అసిస్టెంట్ మేనేజరు అందరూ అక్కడ చేరిపోయారు.

"మిషన్లో మడిసి పడిపాయ... ఆపండి దేవరా. మిషనాపండి" ఏడుస్తూ పెడబొబ్బలు పెట్టాడు.

అంతే! మరుక్షణం మిషన్ ఆగిపోయింది.

అందరూ షెల్లర్ దగ్గరికి పరుగెత్తారు.

బుడగశెట్టి గరాటుపైన అచేతనంగా బోర్లాపడివున్నాడు.

గరాటుకింది భాగం రక్తంతో తడిసి ఎర్రగా కనిపిస్తోంది. అతను స్పృహలో లేడు!

వెంటనే కంపెనీ జీపులో వేసుకొని ఆసుపత్రికి తీసుకుపోయారు.

పులిచెర్ల ఆసుపత్రిలో వున్న డాక్టర్ చాలాసేపు ప్రయత్నం చేసి ఇంజక్షన్స్ చేసి, అతనికి స్పృహ తెప్పించాడు.

అతని చెయ్యి 'మర'లో తగులుకొని మోచేతివరకు నజ్జునజ్జు అయిపోయివుంది. కొద్దిరోజుల్లోనే అతని ఆరోగ్యం కుదుటపడిందిగానీ, మోచేతివరకు చేయి తీసెయ్యడం వల్ల... మొండిచేయిగా మిగిలింది. ఇక అప్పటినుంచీ అతను బుడగశెట్టికి బదులుగా మొండిశెట్టిగా మారిపోయాడు.

**నిశిలోపిశాచి**



**త**నతో కలిసి పనిచేస్తూ మూటలు మోయడంలో చేదోడు వాదోడుగా వున్న బుడగశెట్టి హఠాత్తుగా మొండోడైపోయి పని మానేయడంతో తన కుడిభుజం పోయినట్ట

నిపించింది. కుశాలన్నకు.

అయితే అతని సిన్సియారిటీని, నైపుణ్యాన్ని, కష్టాన్ని చూసి కంపెనీ వాళ్ళు అతన్ని ప్రత్యేకంగా చూడసాగారు. మిల్లులో ప్రతిరోజూ పనిచేసుకునే ఏర్పాటు చేశారు. ఎవరికి పనిలేదన్నా అతనికి మాత్రం పని కల్పించేవారు. వేరే గత్యంతరం లేక కుశాలన్నా ఆ కూలిపనినే నమ్ముకొని దాన్నే రేయింబవళ్ళు చేయసాగాడు.

అయినా తగిలినకాలే తగుల్తుందనీ...కష్టాలు పడేవారికే ఇంకా ఎక్కువ కష్టాలు వస్తాయంటారు. కుశాలన్న విషయంలో అది నిజమే ననిపించింది.

బుడగశెట్టి మిషన్లో పడిపోయినప్పటి నుంచీ కూలీలు అప్రమత్తంగా వుంటున్నారు. పైగా మిల్లులో వుండే దయ్యమే బుడగశెట్టిని అందులో తోసేసిందని కూడా చెప్పుకోసాగారు. దాంతో కూలీల్లో దయ్యం భయం ఎక్కువయింది.

ఒకరోజురాత్రి పదకొండు గంటల సమయం.

ఆఫీసు రూము మూసివేయబడివుంది.

నైట్ డ్యూటీచేసే ఏకాంబరం గేటుతాళం వేసివచ్చి కళ్ళంలో పడుకోనున్నాడు.

మిషన్ నడుస్తున్న శబ్దంతప్ప మరే శబ్దమూలేదు.

షెల్లర్కు మూటలు మోసేవాళ్ళు, ఆయిల్ పట్టేవాళ్ళు, మిషన్ డ్రైవర్, ఏకాంబరం తప్ప అక్కడ ఎవ్వరూలేరు.

మిషన్ నిర్విరామంగా నడుస్తోంది.

మిల్లులోపల 'ధన్‌ధన్' మన్న శబ్దం చెవుల్ని చిల్లులుపడేటట్లు చేస్తోంది. అక్కడున్నవారికది అలవాటే గనుక తమపనిలో తాము నిమగ్నమై వున్నారు.

వీరప్ప, సిద్ధడు, గోవిందు, కదిరప్పవంటివారు మూటలు మోస్తున్నారు.

కుశాలన్న ఫిల్టర్ టాంక్‌నుంచీ డబ్బాల్లోకి ఆయిల్ పట్టి తూకమేసి పెడుతుంటే మునెప్ప ఆ డబ్బాలను వెయిట్ మిషన్ పైనుంచి తీసి పక్కన పెడుతున్నాడు.

శనక్కాయ మూటను వీపున మోసుకుని షెల్లర్‌లో కుమ్మరించాడు వీరప్ప. ఉన్నట్టుండి గరాటు నిండిపోయి పక్కకు పొర్లుకొచ్చాయి చెనక్కాయలు. కాయలు మరమిషన్‌లోకి జారడంలేదు. అతనికి ఏం చేయాలో తోచలేదు. అతను కొత్తగా ఆ పనికి వస్తున్నాడు కాబట్టి అందులో పట్టువిడుపులు ఇంకా తెలుసుకోలేదు. అందుకే కిందికివచ్చి 'కుశాలన్నా... కాయలు సరిగా జారలేదు... అట్ట సూడన్నా... అంతదాకా నేను నూనెపడతాలే..." అన్నాడు.

"సరే సూస్తావుండు" అనిచెప్పి, పైకి వెళ్ళి ఆ పక్కనే వున్న ఓ పొడువాటి కట్టెతో శనక్కాయలు కూరసాగాడు.

అలా చాలా సేపు ప్రయత్నించిన తర్వాత మెల్లగా కాయలు కిందకు జారసాగాయి. గరాటు ఆకారానికి, మరమిషన్‌కు మధ్య వున్న అడ్డేదో తొలగిపోయింది... ఇంక మెటికలు దిగివద్దామా అనుకునేంతలో ఉన్నట్టుండి చీకటైపోయింది.

ఎక్స్‌పెల్లర్ ఆగిపోయింది.

కరెంటు కట్!

దాంతో చేస్తున్నపని అలాగే వదిలేసి అందరూ పరుగెత్తుకుంటూ మిల్లు వెలుపలకువచ్చి, కళ్లం ముందర కూర్చున్నారు.

కానీ కుశాలన్న మాత్రం ఆచీకట్లో మెటికలు దిగిరాలేక అక్కడే వుండిపోయాడు.

అందరి హృదయాల్లోనూ దయ్యం తాలూకు భయంచోటుచేసుకుని వుంది.

కుశాలన్నకు ఏంచేయాలో తోచలేదు. అక్కడే అలాగే కూర్చొని వుండిపోయాడు.

ఎటుచూసినా చీకటి. కళ్ళు పొడుచుకున్నా కనిపించనంత చీకటి. రాక్షసమాయలాంటి చీకటి.

ఉన్నట్టుండి ఏదో కందెన సముద్రం పొంగుకొచ్చినట్లు, అందులో వంటరిగా చిక్కిపోయిన పాంథుడిలా తనను తాను

ఊహించుకున్నాడు.

ఆ ఊహే అతనికి విచిత్రంగా తోచింది.

ఏమీ తోచక పైకి ఒకసారి చూశాడు.

చీకటి సముద్రానికి ఓవైపున అమర్చిన ఓ చిన్న కవాటంలా అనిపించింది గాలికోసం ఎత్తివుంచిన రేకు. అందులోనుంచి నిర్మలమైన ఆకాశం, గాలికి ఆరేసిన నీలిబట్టలాగానూ, నక్షత్రాలు దానికి అక్కడక్కడ వున్న జిలుగు రవ్వలుగానూ అనిపిస్తున్నాయి. ఆ ఆకాశంకింది అనంతమైన ఆ చీకటి కుహరంలో తాను ఒంటరిగా మిగిలిపోయిన ఒక మరుగుజ్జులా అనిపించిందతనికి.

ఇలాకొన్ని క్షణాలు గడిచాయో లేదో... దూరంనుంచి ఏదో శబ్దం వినిపించింది.

చెవులు రిక్కించివిన్నాడు.

మిల్లు పైకప్పుపైన, రేకులమీద, ఎవరో మెల్లగా నడచి వస్తున్నట్లు అడుగుల చప్పుడు వినిపిస్తోంది.

ఎన్నడూ భయమంటే ఎరుగని కుశాలన్నకు సైతం ఆ శబ్దం వినేసరికి ఒక్కసారి గుండె ఝల్లుమంది.

రానురాను ఆ శబ్దం దగ్గరకాసాగింది.

ఇది దయ్యమేనేమోనన్న అనుమానం కలిగింది కుశాలన్నకు.

ఎవర్నయినా పిలుద్దామా అంటే... మిల్లు వెలుపలున్నారు. వినిపించదు. ఏంచేయాలి. అనుకొని ఏదయితే అది అయిందిలే అని మొండిధైర్యం తెచ్చుకున్నాడు.

ఆ శబ్దం రానురాను ఇంకా దగ్గరై హఠాత్తుగా ఆగిపోయింది. దాంతో పైకి చూశాడతను.

అంతే! అతని గుండె గుభేలుమన్నది. అతని నవనాడులూ ఒక్కక్షణం 'పనిచేయడం మానేసినట్టనిపించింది.

ఏదో ఆకారం తెరచివున్న రేకుగుండా కిందికి దిగుతోంది.

నోటి మాటరాక... ఒక పక్కకు వదిగి కూర్చొని అలాగే చూస్తున్నాడతను. ఆ ఆకారం... ముందు తన శరీరాన్ని దింపి కాళ్ళను రాడ్డుపైన పెట్టి... రేకు పట్టుకొని అలాగే నిలబడింది.

అది చూస్తుంటే కుశాలన్నకేదో అనుమానం వేసింది. అలా దిగడం దానికి బాగా అలవాటయినట్టనిపించిందతనికి.

"ఈదినం దీని కథేందో తేల్చేస్తా"ననుకున్నాడతను.

అది మెల్లగా అలాగే షెల్లర్ పక్కనున్న చదును ప్రదేశంలో కుశాలన్న పక్కగా దిగి నిలబడింది. ఆ చీకట్లో కాస్త పట్టుతప్పి కుశాలన్నపైన ఒకడుగు వేసి మరీ దిగింది.

సరిగ్గా అప్పుడే కరెంటు వచ్చింది.

క్షణంలో గాఢాంధకారం మాయమై ఆ ప్రాంతమంతా దేదీప్యమానమైంది. ఈ హఠాత్సంఘటనకు ఆ ఆకారం తత్తరపడిపోయి గబగబ వచ్చిన దారంట వెళ్ళిపోయింది.

ఆ ఆకారం నల్లని దుస్తులు వేసుకుని వుంది.

అయినా ఆ ఆకారాన్ని గుర్తుపట్టనే పట్టాడు.

'ఇదన్నమాట దయ్యంకథ' అనుకున్నాడు.

ఆ ఆకారం వెంకయ్యకు నమ్మినబంటు... అతని వంటమనిషి రామయ్యేనని తెలుసుకోవడానికి అతనికెంతో సేపు పట్టలేదు.

'అయినా దయ్యంలా రావాల్సిన అవసరం ఏముంది రామయ్యకి' అని ఒక్కసారి తనను తాను ప్రశ్నించుకున్నాడు.

కొంతసేపు ఆలోచించిన తర్వాత దానికి సమాధానం కూడా స్ఫురించింది. "ఫాక్టరీలో పంచులు, నూనెడబ్బాలు, రకరకాల ఇనుప వస్తువులు వంటి విలువైన వస్తువులెన్నో ఎక్కడంటే అక్కడ పడివుంటాయి. వాటిని జనసంచారంలేని రాత్రిపూట ఎవరైనా దొంగిలించే అవకాశం వుంది. అయినా అప్పుడప్పుడు చిన్న చిన్న దొంగతనాలు జరుగుతూనే వుంటాయి. అవి జరక్కుండా వుండడానికి 'దయ్యం' భయాన్ని ప్రజల్లో

కల్పించడానికే రామయ్యచేత వేషం వేసి పంపిస్తున్నాడు. ఫాక్టరీ పైకప్పు బంగాళాకు ఆనుకునే ఉండడంవల్ల రామయ్యకది సులభంగా సాగిపోతోంది. ఇదే నిజమై వుంటుంది"

ఒక నిర్ణయానికొచ్చాడు కుశాలన్న.

కరెంటు వచ్చిన అయిదు నిముషాలకు మళ్ళీ మిషన్ రన్నయింది.

కూలీలందరూ తిరిగి లోపలికి వచ్చారు.

"ఏమన్నా? చీకట్లో వొగడే ఉండిపోయినావే..."

అన్న వీరప్ప ప్రశ్నతో ఇహంలోకొచ్చాడు కుశాలన్న.

ఆ తర్వాత కుశాలన్నతోబాటు అందరూ ఎవరి పనుల్లో వారు మునిగిపోయారు.

**అంపకానికి అవకాశాలెన్నో**



"ఏమ్యాయోవ్ కుషాలన్నా... మేనేజర్ సాబ్... వస్తానే... నీకి పంపమని చెప్పాడ్... పోయి కలువ్... జావ్..."

ఆ మరునాడు ఉదయాన ఫాక్టరీలో అడుగు పెట్టిన కుశాలన్నతో అన్నాడు పగలు డ్యూటీచేస్తున్న వాచ్‌మేన్ బుడ్డా సాయిబు.

మేనేజర్ సహజంగా లోపలికి ఎవ్వరినీ పిలవడు. కూలీలను అస్సలు లోపలికి సామాన్యంగా పిలవరు. 'అలాంటప్పుడు నన్నెందుకు పిల్చినట్టు?' అనుకుంటూ తలుపు తోసుకుని మేనేజర్ గదిలో అడుగు పెట్టాడు కుశాలన్న.

బల్లముందు కూర్చునివున్న మేనేజర్ ఫోన్లో ఎవరితోనో మాట్లాడుతున్నాడు. అతనికెదురుగా ఓ గాడ్రేజీ కుర్చీలో కూర్చొనివున్నాడు అసిస్టెంట్ మేనేజర్ గుర్రప్ప. గుర్రప్ప పక్కన మరి రెండు కుర్చీలు ఖాళీగా వున్నాయి. వారికి పైన ఫ్యాన్ మెల్లగా తిరుగుతోంది.

ఆ గదినంతా వింతగా చూస్తూ చేతులు కట్టుకొని వినయంగా నిలబడ్డాడు చేతిలో తల గుడ్డను నలుపుకుంటూ కుశాలన్న.

అతన్ని చూసినా మేనేజర్ చూడనట్టె ఫోన్లో మాట్లాడుతూనే వున్నాడు. గుర్రప్ప అతని ముఖంలోకే చూస్తున్నాడు. కొంతసేపు తర్వాత "ఆ... అలాగే... లారీ పంపుతాను థాంక్స్" అంటూ గుర్రప్పవైపు తిరిగి ఫోన్ పెట్టేస్తూ "మిట్టమింద పల్లెలో రాజారెడ్డిగారు మూడువందల మూటలు మిల్లుకు పంపుతానంటున్నారు. మీరు గుమస్తానెవర్నయినా పంపించి ఈరోజు తూకం వేపించి పెట్టెయ్యండి. రేపు లారీ పంపుదాం.." అన్నాడు గుర్రప్పతో.

ఆతర్వాత నెమ్మదిగా కుశాలన్నవైపుచూసి "ఎవురయ్యా నువ్వు...? ఏం కావాలి?" అని ప్రశ్నించాడు.

"దండాలయ్యా! తమరు రమ్మన్నారంట... నాపేరు కుశాలన్న" అని తనను తాను పరిచయం చేసుకున్నాడు.

"ఓ... నువ్వా?" గుర్తుకు తెచ్చుకున్నట్లు అన్నాడు.

ఏం చెబుతారోనన్న జంకుతో వంగి తన విధేయతను ప్రకటించుకుంటూ నిలబడి వున్నాడు కుశాలన్న.

"ఏమ్యా... రేతిరి నువ్వేమో చూసినావంటనే"

అని ప్రశ్నించాడు గుర్రప్ప.

ఏదో ఉపద్రవం తన నెత్తిన పడబోతోం

దని అతని మనసు కీడును శంకించింది.

"నేనేం చేశాను సార్!"

బిత్తర చూపులు చూస్తూ అన్నాడు కుశాలన్న.

"రేతిరి నువ్వు దెయ్యాన్ని చూస్తివంటగ దయ్యా!" సూటిగా ప్రశ్నించాడు మేనేజర్.

"నేను చూడాలని చూడలేదు సార్!" నసుగుతూ అన్నాడు.

తానెవరికీ చెప్పకపోయినా రాత్రి జరిగిన విషయం ఉదయానికంతా వీళ్లకెలా తెలిసిందబ్బా అనుకొని ఆశ్చర్యపోయాడతను.

"కరెంటుపోతే భయంతో అందరూ బయటకొచ్చేస్తారుగదా! నువ్వెందుకక్కడేవున్నావ్? " తిరిగి ప్రశ్నించాడు మేనేజర్.

"కిందికి వచ్చేదానికి కుదర్లా సారు. అందుకనీ షెల్లర్ దగ్గిరే ఉండిపోయినా"

"అప్పుడేనా దయ్యాన్ని చూసింది నువ్వు? "

"అవును!"

"ఆ దెయ్యం ఎవురయిందీ తెలిసిపోయిందికదా నీకు!"

తెలుసంటే ఏం కొంప మునిగిపోతుందోనని "లేద్సార్... నాకేమీ తెలీదు. నేను గుర్తుపట్టలా" అన్నాడు.

"సరే నువ్వు గుర్తుపట్టినావో లేదో నాకు తెలీదు. ఈ విషయం ఎవరికీ చెప్పొద్దు. చెప్పినావా నీకిక్కడ సీటుండదు" నిక్కచ్చిగా చెప్పేశాడు మేనేజర్.

'ఇదేంట్రా దేవుడా' అనుకుంటూ అలాగే నిలబడిపోయాడు కుశాలన్న.

"నువ్వు ఇట్లాగే పనులు చేసుకొని బతకాలన్నా, నీ పెండ్లాం బిడ్డెలు సుఖంగా ఉండాలన్నా... ఈ క్షణం నుంచీ చూసింది చూసినట్లు మరచిపో" అన్నాడు గుర్రప్ప.

"యాడా చెప్పొద్దు. ఇంకపో" అన్నాడు మేనేజర్.

బతుకు జీవుడా అనుకుంటూ వెలుపలికి వచ్చేశాడు కుశాలన్న.

అతన్నలా వాళ్లు హెచ్చరించి పంపారే గానీ అంతటితో ఊరుకోలేదు.

రామయ్యను దయ్యంలా పంపించి కూలీలకు భయం కల్పిస్తున్న రహస్యం.. వెంకయ్యకు, వారి కుటుంబ సభ్యులకు, ఆ తర్వాత మేనేజర్‌కు, అసిస్టెంటు మేనేజర్‌కు తప్ప మరెవ్వరికీ తెలీదు. ఇన్ని రోజులకు ఆ రహస్యం కుశాలన్నకు తెలిసిపోయింది. మరి ఆ రహస్యం తెలుసుకున్న వ్యక్తిని ఇక ఇక్కడ ఉంచుకోరాదనీ, ఎలాగైనా సరే ఏదో నెపంతో అతన్ని కంపెనీకి శాశ్వతంగా దూరం చెయ్యాలనీ తగిన అవకాశాలకోసం ఎదురు చూడసాగారు వారు.

## అడుక్కుతినే ఉద్యోగం



ఎంత కష్టపడినా తిండికీ బట్టకే సరిగా సరిపోవడంలేదు. పిల్లలు పెరిగేకొద్దీ అవసరాలు పెరుగుతుండడంతో కుశాలన్న పరిస్థితి రోజురోజుకీ దిగజారిపోతోంది. రేయింబవళ్లు కష్టపడుతున్నా అతని పరిస్థితిలో మార్పు రావడంలేదు. అయినా అలాగే మిల్లులో పనికే పోతున్నాడు. వేరే మార్గం లేదు. అక్కడ శ్రమ ఎక్కువ. ఆదాయం తక్కువ. కాబట్టే చాలామంది కూలీలు ఖాళీ సంచుల్ని గోడకవతల వేసేస్తుంటారు. రాత్రి పని ముగిసింతర్వాత వచ్చేసేటప్పుడు వెనకదారిన వెళ్లి ఆ సంచుల్ని తెచ్చుకొని అమ్ముకుంటుంటారు కూలీవాళ్ళు.

ఈ విషయాన్ని పసిగట్టి కొత్త మేనేజర్ నిఘా ఏర్పాటు చేశాడు.

అందరిలాగే కుశాలన్న కక్కుర్తిపడ్డాడు.

అదే అతను చేసిన పొరబాటు.

మూడు సంచుల్ని ఎవ్వరూ గమనించకుండా గోడకవతలకు విసిరి వేసేశాడు.

రాత్రి పని విరమించి ముఖం కడుక్కొని ఇంటికి బయలుదేరాడు.

గోడకివతలకి వచ్చి తాను వేసిన సంచుల్ని తీసుకోవడానికి అటువైపుకు వచ్చాడు.

అటూ ఇటూ చూశాడు. రెండు కానగ చెట్లు... వాటికవతల ఒక చిన్న చింతచెట్టు కనిపించాయి. అక్కడ మనిషి అలికిడేలేదు. కీచురాళ్లు మాత్రం అరుస్తూనే వున్నాయి. అతను వేసిన సంచులు కుప్పగా అక్కడే పడివున్నాయి.

వెళ్లి వాటిని చేతుల్లోకి తీసుకున్నాడు. వాటిని ఒక్కసారి ఆ చీకట్లోనే కళ్లారా చూసుకున్నాడు. అతని ముఖంలో ఏదో సాధించానన్నంత ఆనందం! కానీ ఆ ఆనందం ఎంతోసేపు నిలువలేదు.

అంతవరకూ కానగచెట్ల వెనుక నక్కివున్న ఆఫీసు ఉద్యోగులు వెంటనే అతన్ని పట్టుకున్నారు.

ఫలితంగా అతనికి దండన జరిగింది. అన్ని రోజులూ చేసిన కూలీ ఆపేశారు. అతన్ని బయటకు పంపడానికి మేనేజర్‌కు అదొక మంచి అవకాశంగా తోచింది. ఇక ఈ పక్కకే రావద్దని పంపించేశారు.

ఓనర్స్‌కు తెలిస్తే చాలా సీరియస్ అన్నారు. బెదిరించారు. భయపెట్టారు.

ఆ చిన్న పొరబాటుతో అతనిపైన అంతవరకూ వున్న మంచిపేరు, సదభిప్రాయం మట్టిలో కలిసిపోయాయి.

అతని పేరూ కంపెనీ దొంగల్లో చేరిపోయింది. ఆ వార్త కంపెనీ వ్యవసాయాలున్న రంగప్ప కటవకు, కృష్ణమ్మ చెరువు గుమాస్తాకు, కల్లూరు, మంగళంపేట, రొంపిచెర్ల గుమాస్తాలకు అందరికీ తెలియజేయబడింది.

ఎట్టి పరిస్థితుల్లోనూ అతన్ని పనిలో చేర్చుకోరాదన్న ఆజ్ఞలు అన్ని చోట్లకూ జారీ అయ్యాయి.

ఈ విషయం కుశాలన్నకు తెలియలేదు.

ఆ మరునాడు కంపెనీ పనికి పోవడం అవమానంగా భావించి రంగప్ప కటవకు పోయాడు. అక్కడ వద్దన్నారు. అలాగే కృష్ణమ్మ చెరువుకింద వ్యవసాయ పనులకు వెళ్లాలనుకున్నాడు. అక్కడా అతన్ని పనిలో పెట్టుకోలేదు. దాంతో ఇంటికి తిరిగి వచ్చేశాడు.

ఇంకెక్కడయినా పనులున్నాయంటే అదీ లేదు. ఇంకేం చెయ్యాలి అనుకున్నాడు. అతనికి ఏమీ తోచలేదు. ఏదో ఒక పని చేయాలి. లేకుంటే బతుకు గడవడం కష్టం. అనుకొని వారం తర్వాత పనికోసం తిరిగి కంపెనీలో అడుగుపెట్టాడు. నేరుగా మిల్లులోకి పోకుండా బంగళా వెనుకవున్న వ్యవసాయపు గుమాస్తా... రంగసామి దగ్గరకు వెళ్లాడు. అక్కడి వ్యవసాయపు కూలీలను అతనే నిర్ణయిస్తాడు. అందుకే అక్కడికి వెళ్లి నిలబడ్డాడు.

అప్పటికే కొందరు కూలిపని కోసం అక్కడ వచ్చి నిలబడ్డారు. రంగసామి కాపురంవున్న ఇంటిముందర వడ్లు ఎండబోసే కళ్లం వుంది. ఆ కళ్లానికి, ఇంటికి మధ్యన ఒక పందిరి... ఆ పందిరి కింద మంచమేసుకొని ఉదయాన వస్తున్న కూలీలకు పనులు కేటాయిస్తూ, పనులు పురమాయిస్తూ కూర్చొనున్నాడు.

అప్పటికే వచ్చిన కూలీలంతా పనుల్లోకి దిగారు. కానీ కుశాలన్నను చూసిన రంగసామి చూడనట్టే ప్రవర్తిస్తున్నాడు. అందుకే అతని ముందుకు వెళ్లి "అన్నా ఏదయినా పనుంటే సెప్పన్నా సేస్తా!" అన్నాడు.

"నీలాంటివాళ్లకు ఇక్కడ పనిలేదు **వెళ్లు**" నిక్కచ్చిగా అన్నాడు రంగసామి.

"అట్టంటే యట్టన్నా... మీరు కాదంటే ఇంకేడబోవాల" అభ్యర్థనగా అన్నాడు కుశాలన్న.

అదేమీ వినబడనట్లే లేచి వెనుక గడిలో వున్న వ్యవసాయ పనిముట్లను ఒక కూలీకి చూపించి "ఎత్తకపో" అన్నాడు రంగసామి. ఆ కూలీ ఆ మాటతో అందులోని కొన్ని పారలు, గునపాలు, కొడవండ్లు . ఎత్తుకెళ్లి మిగిలిన కూలీలకిచ్చాడు. అక్కడికీ వెళ్లాడు కుశాలన్న.

"అన్నా!" అంటూ నోట్లోనే గొణుక్కున్నట్టుగా అన్నాడు. కానీ అతను ఏమీ చలించలేదు.

అక్కడినుంచీ అక్కడికి కొంత దూరంలో వున్న గొడ్ల చావడికి బయలుదేరాడు రంగసామి.

కుశాలన్న అతని వెంటే నడిచాడు. అక్కడ కొందరికి ఆ పశువుల దొడ్డిని శుభ్రం చేయమని పురమాయించి ఇంటి దగ్గరికి తిరిగొచ్చాడు రంగసామి.

"సంచులు దొంగతనం చేసి ఎంత పొరబాటు చేశానో... నాయాలి ఖర్మ! దినామ్ము చేసెటోడు దొరకడు. లేక లేక చేసినోడే దొరికి పోయేది" అనుకుంటూ అతని వెంటే నడవసాగాడు కుశాలన్న. అతను ఎక్కడ నిలబడితే అక్కడ తానూ నిలబడ్డాడు.

అతనలా తన వెంట ఒక బాడీగార్డులా వస్తుంటే లోలోపలే చిర్రెత్తుకొస్తోంది రంగసామికి.

ఇంట్లోకి వెళ్లి చెప్పులు వేసుకుని ఆ యింటికి పడమరగా మామిడితోటలో వున్న సమాధులవైపు బయలుదేరాడతను.

కుశాలన్న అతని వెంట నడవడంతో వెనక్కి తిరిగి చూశాడు.

"అన్నా... ఏదో వొగ పని చేస్తా!" మళ్లీ అభ్యర్థించాడు కుశాలన్న.

అతనికి పని కల్పించాలని మనసులో వున్నా మేనేజర్ ఆజ్ఞ వుండడంతో కుశాలన్నకు ఏ పనీ ఇవ్వలేకపోతున్నాడు రంగసామి. అయితే పట్టువదలని విక్రమార్కుడిలా కుశాలన్న వెంటబడడంతో కాస్త కోపం వచ్చింది.

"హొరే కుశాలగా! గొడ్డుకొక దెబ్బ! మనిషి కోమాట... నేనప్పుడే చెప్పినాగదా! ఎందుకు నన్ను వెంటబడి వేదిస్తావు" అనునయంగా అన్నాడు.

దాంతో "నువ్వు పనిచ్చిందాకా నేను పోనన్నా" అని మొండిగా అన్నాడు కుశాలన్న.

'ఇంకవీడికి మెల్లిగ చెబితే లాభంలేదు. స్ట్రాంగా చెప్పాల్సిందే' అనుకొని "చెప్తే. వినవుగదా! నీకింకా ఇక్కడ ఏం పని... అడక్కతినే పనీ. పో" అని కసురుకున్నాడు.

ఇక లాభం లేదనుకొని అక్కడినుంచి బయలుదేరి కంపెనీకి తిరిగొచ్చాడు కుశాలన్న.

తన సంసార పరిస్థితి అతనికి తెలుసు. 'కూలిచేస్తేగానీ పొయ్యిలో పిల్లి లేవదు. అందుకే ఎట్టోవొగట్ట మేనేజర్ కాళ్లో కడుపో పట్టుకొని పని సంపాదించుకోకపోతే ఇంక రేపుట్నుంచీ బిడ్డెలు పస్తే...' అనుకున్నాడు. అనుకొని నేరుగా గేటు దాటుకొని లోపలికి వెళ్లాడు.

అక్కడ ఎదురుగా అసిస్టెంట్ మేనేజర్ గుర్రప్ప రైతులు తోలుకు వచ్చిన శనక్కాయల్ని తూకం వేయిస్తున్నాడు. అతనికెదురుగా వెళ్లి నిలబడ్డాడు కుశాలన్న.

అతన్ని చూస్తూనే అగ్గిమీద గుగ్గిలమైపోయాడు గుర్రప్ప.

"హొరే దొంగనాకొడకా! మళ్లా కంపెనీలో నీకేం పనిరా... ఈ ఆయిలు మిల్లో అడక్కతినేపనా నీకు. పోరా బయటకిపో" ఎగిరిపడ్డాడు.

"సామీ యింగెబ్బుడూ తప్పు సెయ్యను. పేదోన్ని. ఏదో కడుపాత్రం.. కనికరించి పని సెప్పు" కాళ్లావేళ్లాపడ్డాడు కుశాలన్న.

ఇన్ని రోజులూ మిల్లులో కష్టపడినవాడు గదాన్న కనీసపు దయకూడా లేకుండా

ఇంకా రెచ్చిపోయాడు గుర్రప్ప.

"ఎవడు రా వీడు.. వోరే ఎవ్వర్రా ఆడా వాచ్‌మేన్.. బుద్ధుందిరా నీకు? ఎందుకురా వీన్ని లోపలికి పంపించింది" అని గట్టిగా కేకేశాడు.

ఆ మాటతో వాచ్‌మేన్ బుడ్డాసాయిబు పరుగెత్తుకుంటూ వచ్చి "ఏమ్యా నీకు... నేను హాడనే వుండానే. హెట్లా వచ్చేసినావ్‌బే! సాబు నీకీ అట్ల తిడతావుంటే హింకా నీకీ హేంపనీ బడాచోర్. ఆయిలుమిల్లో హడక్క తినే పనా నీకీ.... జావ్! జావ్.. బాహర్‌జావ్!" అంటూ బలవంతంగా బయటకు పంపించేశాడు.

చాలా అవమానం వేసింది కుశాలన్నకు.

"అవును నిజమే.. ఇక్కడ నాకింకేం పనీ.. ఆయిలుమిల్లో అడక్కతినే పనీ.. ఏదో ఋణం వుండింది. యిన్ని దినాలు దీనికోసం కండలు పిండుకొని కష్టపడినా ఈ దినంతో ఋణం తీరిపాయ.. ఇంకేం పని ఆయిలుమిల్లో అడక్క తినే పని" అనుకుంటూ దిగాలుగా ఇంటిదారి పట్టాడు.

## సిద్ధమ్మకు కన్నుకుట్టింది



ఆయిలు మిల్లుకి, రైల్వేస్టేషన్‌కీ మధ్యన పెద్ద పెద్ద వేపచెట్లున్నాయి. ఆ చెట్లు మధ్యన... ఓ సన్నని కాలిబాట...

అది అలాగే రైల్వేస్టేషన్‌కు వెళ్లే దారిలో కలుస్తుంది. ఆ దారి కిటువైపు గాజులోళ్ల లచ్చుమక్క, అటువైపు సింగాల సిద్ధమ్మ అప్పచ్చుల గంపలు ముందర పెట్టుకొని కూర్చొని వున్నారు.

వడలు, బోండాలు, మురుకులు, దోసెలు, ఇడ్లీలు, పుల్లింట్లు వంటి అప్పచ్చులు ఆ గంపల్లో వున్నాయి. ఇంకా ఆకువక్కలు, బీడీలు, సిగరెట్లు, పొగాకు, దుగ్గ వంటివి కూడా అందులోనే వున్నాయి. వాటిని అక్కడ పనిచేసే కూలీలకు అమ్మి నాలుగు కాసులు సంపాదించుకుంటున్నారు లచ్చుమక్క, సిద్ధమ్మలు.

లచ్చుమక్కది బండారోళ్ల పల్లె. సిద్ధమ్మది మొరవపల్లె. ఇద్దరూ ఉదయాన ఆరు గంటలకంతా అప్పచ్చుల గంపలెత్తుకొచ్చేసి పగలంతా అక్కడే వాటిని అమ్ముకుంటుంటారు.

మామూలుగా ఆ రెండు గంపలే అక్కడ ఉండేది. అయితే ఆ రోజు ఉదయం అక్కడ కొత్తగా మరో అప్పచ్చుల గంప ప్రత్యక్షమైంది.

గాజులోళ్ల లచ్చుమక్క వడలు, బోండాలంటే అందరికీ ఇష్టం. ఆమె ఎలా చేస్తుందోగానీ ఆమె చేసిన వంటలు చాలా రుచిగా, శుచిగా వుంటాయి. కాబట్టే ఆమెకు ఎక్కువ బేరం జరుగుతుంటుంది. మొట్టమొదట అక్కడ ఆమె ఆ వ్యాపారం ప్రారంభించింది. ఆమెను చూసి ఆ తర్వాత సింగాల సిద్ధమ్మా ఆ వ్యాపారం ప్రారంభించింది. ఈ ఇద్దరికీ పోటీగా మరో గంప వెలసింది.

ఆ గంప తెచ్చింది కుశాలన్న భార్య దేవకి!

మనిషి కొంచెం మోటుగా వున్నా వాళ్లిద్దరికంటే వయసులో వుండి ఆకర్షణీయంగానే వుంటుంది దేవకి. కాబట్టి దేవకికీ బేరం బాగానే జరగసాగింది.

లచ్చుమక్క మొదటినుంచీ అక్కడ వ్యాపారం చేస్తోంది గనుక ఆమె వ్యాపారానికేమీ డోకాలేదు. కానీ మధ్యలో వచ్చిన సింగాల సిద్ధమ్మ బేరం మాత్రం పూర్తిగా దెబ్బతింది. ఆమె చేసిన అప్పచ్చులు అలాగే మిగిలిపోయి నష్టం వస్తోంది. దాన్ని భరించలేకపోయింది సిద్ధమ్మ.

దేవకి బేరం చూసి కళ్లలో నిప్పులు పోసుకుంది. ఎలాగయినాసరే దేవకి గంపను అక్కడినుండీ ఎత్తించేయాలన్న ఆలోచనల్లో మునిగిపోయింది. అదే జరిగితే ఆ ఆధారం కూడాపోయి కుశాలన్న సంసారం పూర్తిగా పతనమైపోయినట్లే. పైగా కూతురు గౌరికి పది సంవత్సరాలు నిండాయి. పాలేటికి ఎనిమిది సంవత్సరాలు. దేవకి తల్లి అరవై ఏళ్ల ఈరమ్మ వారి దగ్గరే వుంది. వారందర్నీ పోషించడానికి ఆ వ్యాపారం ప్రారంభించింది దేవకి. దాన్ని



కూడా భగ్నం చేస్తే ఇక ఆ సంసారం వీధిన పడినట్టే.

బాగా ఆలోచించింది సిద్ధమ్మ. ఆలోచించగా ఆలోచించగా ఆమెకో మంచి



ఉపాయం తట్టింది. తననెత్తిన తనే అక్షింతలు వేసుకుని శతాయుష్షు అని దీవించుకున్నట్లుగా ఆ ఆలోచన వచ్చినందుకు తన నుతానే మనసులోనే మెచ్చుకుంది.

ఆ మరునాడు...

కొంచెం పెందలాడే లేచి అన్నీ సిద్ధం చేసుకుని నెత్తిన గంపపెట్టుకొని వచ్చి ముందే అక్కడ కూర్చొంది సిద్ధమ్మ.

అప్పటికే నైట్ షిఫ్ట్ పూర్తి చేసిన వాళ్లంతా ఒక్కొక్కరే ఇండ్లకు బయలుదేరుతున్నారు.

ఆఫీసుకింకా మేనేజరు రానేలేదు. కానీ గుమాస్తాలు మాత్రం ఒక్కొక్కరే ఆఫీసుకొచ్చేస్తున్నారు. లచ్చుమక్క కూడా వచ్చి గంప దించి పెట్టి కూర్చొనుంది.

దేవకి ఇంకా రాలేదు. ఆ రోజెందుకో ఆమెకు ఆలస్యమైంది. ఇదేమంచి సమయం అనుకుంది సిద్ధమ్మ.

"ఓ లచ్చుమక్కా! నా గంపట్ల సూస్తావుండు. దట్ల బొయ్యొస్తా" అని చెప్పి వక్కాకు తిత్తి బొడ్లో చెక్కుకుని తెరచేవున్న గేటుదాటి లోపలికి వెళ్లింది.

రోజూ చూస్తున్న వ్యక్తే గనుక అప్పుడే డ్యూటీలోకి వచ్చిన వాచ్‌మెన్ బుడ్డా సాయిబు ఆమెకు అడ్డు చెప్పలేదు.

అలా వెళ్లి పది నిముషాల తర్వాత తిరిగొచ్చి ఏమీ ఎరగనట్లే సీరియస్‌గా వచ్చి తన గంపముందు కూర్చుంది.

ఆమె అలా కూర్చున్న మరుక్షణం బుడ్డా సాయిబుకి లోపల్నుంచి పిలుపొచ్చింది. లోపలికి వెళ్లి వచ్చిన బుడ్డా సాయిబు సిద్ధమ్మవైపు చూసి చిద్విలాసంగా నవ్వసాగాడు.

కొంతసేపటికి రానేవచ్చింది దేవకి!

వాళ్లకు కొంతదూరంలో గంపదించి పెట్టింది. పక్కనే వున్న ఒక చిన్న రాయిని కిందవేసుకుని కూర్చుంది. దాంతో సింగాల సిద్ధమ్మ బుడ్డా సాయిబువైపు చూసి నర్మగర్భితంగా ఒక విషపు నవ్వు నవ్వింది. దాంతో బుడ్డాసాయిబు ఏదో అర్థమైనట్లు ఒకసారి తలాడించి తన టోపీ సరిచేసుకుని లాటీ చేతబట్టుకొని దేవకిని సమీపించాడు.

"ఏంగావాలన్నా దోసె... ఇడ్లీ.. వడా?" ఏదో కొనుక్కోవడానికొచ్చాడనుకుంది దేవకి.

"నీకీ గంప హెత్తేయవలా.. హిక్కడా పెట్టకూడదు. మేనేజర్ సాబ్ చెప్పినాడు" చేతిలోని లాటీని గంపకు ఆన్చి సీరియస్‌గా అన్నాడు బుడ్డాసాయిబు.

దేవకి గుండెలో రాయిపడ్డట్టయింది.

"ఎందుకు?" అనుమానంగా ప్రశ్నించింది.

"అదంతే హెత్తతావా హెత్తవా?"

అతని కంఠంలో కాఠిన్యం ధ్వనించింది. అప్పటికే కొందరు గుమికూడి, అక్కడి ఆ వింతను చూస్తూ నిలబడ్డారు.

"ఏం తప్పుచేసినా?"

వారినందర్నీ చూసి అవమానంతో సిగ్గుపడిపోతూ అంది.

"నువ్వు తప్పు చేయాల్సిన పనీలా... మీకీ ఆయనా చేసినా తప్పే"

"ఆయనేం చేశాడు?"

"కంపెనీలో గోతాల్ దొంగలించినాడ్... ఝూటా"

"అయ్యా! ఆయన తప్పు చేస్తే నన్ను బేరం చేసుకోవద్దంటారేందీ?"

ఆ మాటతో రెచ్చిపోయాడు బుడ్డాసాయిబు. పైగా రాత్రి తాగిన సారాయిమత్తు ఇంకా వదిలినట్టులేదు.

"మాదర్‌చోద్! మాకీ సవాల్ మాట్లాడతావ్! హాడదీ అనీ నీకీ ఇంత సెప్పినాం. తీనీయమ్మాకీ"

అంటూ బూటుకాలితో అప్పచ్చుల గంపను ఒక తన్ను తన్నాడు. అప్పచ్చులన్నీ నేలపైన పడిపోయాయి. గంప దొర్లుకుంటూ వెళ్లి బారెడు దూరంలో పడింది.

ఎంతో కష్టపడి చేసుకున్న అప్పచ్చులు నేల పాలయ్యేసరికి దుఃఖం ముంచుకొ

చ్చింది దేవకికి. ఏమ్మాట్లాడాలో తెలీక నిస్సహాయంగా సిద్ధమ్మవైపు చూసింది. సిద్ధమ్మ ఆమెను చూసి వెటకారంగా పెదవి విరిచి మూతి తిప్పుకొని ఆపైన ఒక చిరునవ్వు నవ్వి ఊరుకుంది.

ఆ నవ్వు దేవకి గుండెకు సూదిలా గుచ్చుకుంది. అందరివైపు ఒక్కసారి చూసింది.

ఎవ్వరూ ఏమీ మాట్లాడకుండా మౌనంగా చూస్తున్నారు. తమకెందుకొచ్చిన గొడవలే అనుకొని ఎవరికి వారున్నారు. ఎవ్వరూ కలుగజేసుకోలేదు.

లచ్చుమక్క వైపు చూసింది దేవకి! లచ్చుమక్క గుండె కరిగిపోయింది.

"ఏం బుడ్డాసాయిబూ మెల్లగా సెప్పుండచ్చుగదా! అంతా నేలపాలైపాయనే" అంది.

దాంతో తోకతొక్కిన పాములా కస్సుమని రెచ్చిపోయాడు బుడ్డాసాయిబు.

"ఓ లచ్చుమక్కాజీ. నీకీ ఏం జోలీ! ఊర్కేవుండు. ఫిర్‌భీ నీ గంప కూడా హెత్తేస్తాం... హాఁ" అన్నాడు.

"అయ్యోకర్మా! **అమ్మోయంటే** ఆరు నెలల పాపమనీ అదీ తప్పేనా? నాకెందుకొచ్చిందిలే నాయనా!" మౌనం వహించింది లచ్చుమక్క.

దాన్ని చూసి సిద్ధమ్మ మరోసారి వికారంగా నవ్వింది.

అప్పుడర్థమైంది దేవకికి.. ఇదంతా ఆ సింగాల సిద్ధమ్మ నిర్వాకమేనని. అలా సింగాల సిద్ధమ్మకు కన్నుకుట్టిన ఫలితంగా పరిస్థితి పామై కుశాలన్న సంసారాన్ని మరోసారి కాటేసింది.

## యుద్ధం మొదలయింది

విధి చాలా విచిత్రమైనది!

కొందరికి స్వర్గభోగాలు ప్రసాదించి అందల మెక్కిస్తుంది. అదే కొందర్ని కటిక దారిద్ర్యంలో ముంచేస్తుంది. కొందరికి సమస్యల విషవలయాల్ని సృష్టిస్తుంది. అదే సమస్యల సాలెగూటిలో చిక్కిన మరి కొందరిని రక్షించి గట్టుకు చేరుస్తుంది.

కొందరి హృదయాలకు గాయాలుచేసి అదేతిరిగి ఆ గాయాల్ని మాన్పుతుంటుంది.

మరికొందరికి కష్టాలపైన కష్టాల్ని కలిగించి వారి జీవితాలతో ఆడుకుంటూ క్రూరంగా నవ్వుకుంటుంది.

కుశాలన్న విషయంలోనూ అదే జరిగింది.

ఎన్నివిధాల ప్రయత్నించినా ఎక్కడా కూలి దొరకలేదు. చివరికి ఆ ఊరికి కిలోమీటర్ దూరంలోవున్న దాసపల్లిలో దాసన్నగారింట్లో పెద్ద జీతగాడిగా చేరిపోయాడు. సంవత్సరానికి ఒక మూట వడ్లు, రెండువందల రూపాయలు, ఇంటి బత్యానికిగాను నెలకు ఓ అయిదు శేర్లు బియ్యం జీతం.

దాసన్నగారిది పెద్ద కుటుంబం! పూర్వం దాసన్న అనే ఆయనే వారి కుటుంబానికి మూలపురుషుడనీ ఆయన సహజ ధార్మికుడనీ ప్రతీతి. అందుకే ఇప్పటికీ ఆ కుటుంబాన్ని దాసన్నగారు అంటుంటారు.

ఆయనకిద్దరు కొడుకులు. ఆ ఇద్దరికీ కలిపి తొమ్మిదిమంది కొడుకులూ, నలుగురు కూతుళ్లూ! అందరికీ పెళ్లిళ్లయిపోయాయి. వాళ్లకూ బిడ్డలు పుట్టారు. ఆడపిల్లలు తప్ప కొడుకులు, వాళ్ల పిల్లలు అందరూ ఇప్పటికీ కలిసే సమిష్టిగానే జీవిస్తున్నారు. అందుకే ఆ ఇంట్లో దాదాపు యాభైమంది దాకా ఉంటారు.

అందరికంటే పెద్దవాడు పెద్దిరెడ్డి కమ్యూనిష్టుల్లో తిరిగి, నిస్వార్థ ప్రజాసేవకుడిగా పేరు తెచ్చుకున్నాడు. దానధర్మాలు చేశాడు. పేదలంటే ప్రేమ. ఈ విషయంలో అలనాటి దాసన్నే పెద్దిరెడ్డిగా పుట్టాడనీ వాళ్లింటిల్లపాదీ చెప్పుకుంటుంటారు. పైగా ఆ గ్రామంలో మంచి పేరు ప్రతిష్టలున్నాయతనికి. ఎన్నో సంవత్సరాలుగా ఆ గ్రామానికి ఆయనే ఏకైక సర్పంచ్.

ఈయన తర్వాత ఆ ఇంట్లో మంగరాజు, నరసింహులు, చినస్వామి, అప్పిగాడు, ఇలా

మొత్తం తొమ్మిదిమంది వున్నారు మగాళ్లు. పెద్దిరెడ్డి రాజకీయాల్లో తిరిగితే మంగరాజు ఇంటిపనులు చూస్తుంటాడు. వీళ్లిద్దరూ చెప్పినట్టే మిగిలిన వాళ్లు వింటూ సేద్యం చేస్తూ ఎంతో ఐకమత్యంగా వుంటారు.

అయితే గ్రామంలో పెద్దిరెడ్డికి ఎంత మంచి పేరుందో మంగరాజుకు అంత చెడ్డ పేరుంది. చుట్టుపక్కలున్న కురవపల్లె, దేసిరెడ్డిగారిపల్లె, వడ్డిపల్లె, దిన్నెమాలపల్లెవంటి అయిదారు ఊళ్లను తన చెప్పుచేతుల్లో పెట్టుకున్నాడతను. తన మాట కాదన్న వాళ్లకు ఏడు చెరువుల నీళ్లు తాపించి, పదునాల్గు బావుల్లో ముంచి తేల్చుతాడు. కంటికి నదురుగా కనిపించిన ఆడదాన్ని అనుభవించకుండా వదలడు. ఏ జీతగాడయినా కాస్తంత తప్పు చేసినా చితకతంతాడు. పేద వాళ్లకు అప్పులిచ్చి అది తీర్చలేని అభాగ్యుల్ని తన ఇంట్లో పెట్టి చాకిరీ చేయించుకోవడంలో అతి నేర్పరి.

ఆ గ్రామంలో వాళ్లకున్నంత సేద్యం బావులు ఇంకెవ్వరికీలేవు. వీసమెత్తు వారికిటు అటుగా వారికి సమంగా తూగగలిగేది ఒక్క పాటూరివాళ్లే.

పాటూరివాళ్లకు, దాసన్నవాళ్లకు ఎప్పట్నుంచో వైరం. వీళ్లచేన్లో వాళ్ల గొడ్డూ గోదా పడకూడదు. వాళ్లకయ్యల్లో వీళ్ల పశువులు నడవకూడదు. అలా జరిగిందో రామ రావణ యుద్ధమే.

అయితే ఒక జాతర జరిపించాలన్నా ఒక గుడి కట్టాలన్నా ఇద్దరూ పోటాపోటీగా చందాలిచ్చి కలిసికట్టుగా వుంటారు. ఏం జరిగినా ఎన్నివున్నా తమలోతాము పోట్లాడుకున్నా ఇతరుల విషయాలకొస్తే కలిసికట్టుగా ఒకటైపోతారు.

అందుకేనేమో పెద్దవారిగుట్టు హద్దెల్లదంటారు.

అలాంటి ఆ ఊర్లో ఆ దాసన్నగారి సేద్యం పనిచేస్తున్నాడు కుశాలన్న. ఇప్పుడ తను వాళ్ల పెద్ద జీతగాడు. ముఖ్యజీతగాడు. దేవకి కూడా అక్కడే కూలిపని చేస్తోంది.

అది కానబాయి సేద్యం!

ఆ బావికింద దాసన్న గారికి నాలుగెకరాల సేద్యం సాగుతుంది. అలాంటి సేద్యపుబావులు వారికి ఇంకా ఓ పదిదాకా వున్నాయి. కానబాయి దగ్గరే వారికి ఒక పెద్ద మామిడితోపు కూడా వుంది. ఆ తోపులో చెరకు, జొన్న, వేరుశనగ వేసివున్నారు.

అక్కడ ఒకవైపు ఒక్కొక్క కయ్యిలో నాలుగు మడకలుకట్టి అడుసు దున్నుతున్నాడు కుశాలన్న.

అడుసు దున్నడం అయిపోయిన కయ్యల్లో నారుకట్టలు బారకొక్కటి చొప్పున వరుసలు వరుసలుగా వేసివున్నాయి. పచ్చదనం కుప్పలు పెట్టినట్లు ఆ అడుసుమడిలో వెన్నెలకుప్పల్లా కనిపిస్తున్నాయవి! ఆ నారుకట్టలు కయ్యల్లోని నీటిలో ప్రతిబింబించి వింత సోయగాల్నిస్తున్నాయి.

ఆ అడుసు కయ్యలకు మధ్యలో నారుమడి. నారుమడిలో జానెడెత్తున నీళ్లు నిలిచి వున్నాయి. ఆ నీటిపైన పచ్చటి దుప్పటి పరచినట్లుగా వరినారు. పెరికేసిన నారుతో సగం గొరిగిన గుండు కనిపిస్తోంది.

ఆ కయ్యల కవతలున్న కానబాయిలో కేశవులు, నరసింహులు నాలుగు ఎద్దులతో తిరగడకపిలె తోలుతున్నారు. ఆ కపిల నీటిని చినస్వామి చాడ పెట్టిన మళ్లకు తిప్పుతున్నాడు. నారుమడిలో కొందరు పుట్టగోచీలు పెట్టుకొని కింద నీళ్లు తగలకుండా రాళ్లు వేసుక్కూర్చొని వాటిని జరుపుకుంటూ నారు పీకుతున్నారు. వారిలో మంగరాజు తమ్ముళ్లతోబాటు కొందరు ఆడవాళ్లు, దేవకి కూడా వున్నారు.

తమ చీరల్ని తొడల పైదాకాలాగి పుట్టగోచీలుగా చెక్కి, ఆడవాళ్లు మగాళ్లతోబాటు

నారు పీకుతున్నారు. వారి చేతులు చెకచెక నారుమడిలో కదుల్తున్నాయి. ఆ వేగానికి తగినట్లుగానే వారి చేతి వ్రేళ్లు నారు మొదళ్లు పట్టుకొని లాగుతున్నాయి. నారు కోడిబొచ్చులా మెత్తగా చేతిలోకి వస్తుంటే పిడికిలి నిండగానే నారు వేర్లకు అంటి వచ్చిన మట్టి కరిగిపోయేటట్లు ఆ నీటిలో చెకచెక కదిల్చి, ఎండు వరిగడ్డిపోచల్తో కట్టలు కట్టలుగా కట్టి వరుసగా పెడుతున్నారు.

మరికొందరు ఆడవాళ్లు తమ ఒడులు ఎగచెక్కి వంగి చాడపెట్టిన మడిలో మునాలు పట్టుకొని వరినాట్లు వేస్తున్నారు.

కపిలతోలుతున్న నరసింహులు "బాయి గంగా మేలుకో... బంగారి గంగా మేలుకో... నీటిగంగా మమ్మేలుకో... హయ్యో" అంటూ గొంతెత్తి పాడుతున్న కపిలపాట మధురంగా వినిపిస్తోంది. ఆ పాట విని వరినాట్లు వేస్తున్న ఆడవాళ్లలో ఒకతె "రామా దశరథరామా జాంబూడి పెదనగురుకట్ట వెలసిందీ ॥రామా॥" అంటూ పాటెత్తుకుంది. మిగిలిన వాళ్లు ఆమె పాడిన ప్రతి నుడుగును తిరిగి పాడుతూ వంత పాడుతూ ఆనందంగా నాట్లు వేసుకుపోతుంటే ఆ పాట చాలా దూరం వినిపిస్తోంది.

ఉదయం పది గంటలు!

ఒక పెద్ద అల్యూమినియం డాక్షాలో చద్దెత్తుకొని ఆ పాటలు ఆలకిస్తూ బావివద్దకొచ్చింది మంగరాజు భార్య చిట్టెమ్మ. దాంతో కపిల నిలిపేసి "వరే సద్దెదాగుదూరు రాండ్రారోయ్!" అని నరసింహులు నారు పీకుతున్న తన అన్నదమ్ముల్ని, జీతగాళ్లను కేకేశాడు. ఆ కేకతో వాళ్లు తమ పనిని ఆపేశారు. కూలీలు మాత్రం తమ పనులు తాము చేసుకుంటూనే వున్నారు.

పనులు చాలించిన ఆ ఇంటి మగాళ్లు, జీతగాళ్లు పళ్లుతోముకోవడానికి పక్కనేవున్న మామిడి తోపులోకి వెళ్లారు. కొందరు అడుసుమళ్లకు పక్కనున్న మిరపతోటలోకి జొరబడి పచ్చిమిరపకాయలు, ఎరగడ్డపోచలు తెచ్చుకున్నారు. కొందరు వేపపుల్లతోను, కానగపుల్లలతోను పళ్లు తోముకుంటూ వచ్చారు. కొందరు ఆడవాళ్లు మాత్రం ఆ గెనాలలోవున్న కుంటగింజరాకు నమిలి పళ్లుతోముకుంటూ వచ్చి ఆ కాలువల్లో వున్న నీటితో ముఖాలు కడుక్కున్నారు.

అందరూ వచ్చి బావి గట్టున వరుసగా కూర్చున్నారు. చిట్టెమ్మ తలా ఓ గ్లాసిచ్చింది. ఆ గ్లాసుల్లో డాక్షాలోనుంచి సద్దిపోసింది. మిరప తోటలోనుంచి కోసుకొచ్చిన మిరపకాయల్ని, ఎర్రగడ్డల్ని అనుపానంగా నంజుకుంటూ సద్దితాగారు. కొందరు దోసిళ్లతోనే తాగసాగారు.

రాత్రిపూట మిగిలిన సంగటి అయిదు ముద్దలు వేసి నీళ్లుపోసి ఉప్పేసి పిసికిన సద్దినీళ్లవి. ఆ చద్దినీళ్లే వారి పాలిట పంచభక్ష్యపరమాన్నాలు. లొట్టలు వేస్తూ కసుక్కున అంత పచ్చిమిరపకాయ, అంత ఎర్రగడ్డముక్క నముల్తూనే చద్దితాగి తిరిగి తమ పనుల్లో మునిగిపోయారు. చివర్న కుశాలన్న తన కొడుకు పాలేటిని తీసుకొచ్చాడు.

"అమ్మా.. సద్దేమన్నా మిగిలిందా తల్లీ!" అని అడిగాడు.

"ఏదో రెండు గలాసులుండచ్చు కుశాలన్నా!" డాక్షాలోకి తొంగిచూస్తూ చెప్పింది చిట్టెమ్మ.

"వీడికంత పొయ్యి తల్లీ. వద్దంటే ఇనకండావచ్చేసినాడు" పాలేటిని చూపించి చెప్పాడు.

"సరేలే.. ఇందా!" అంటూ ఒక గ్లాసు అతని చేతికిచ్చి అందులో మిగిలిన చద్దిపోసింది చిట్టెమ్మ. ఆత్రంగా చద్ది తాగుతున్న పన్నెండేళ్ల పాలేటిని చూసి "వీడు నీ కొడుకేనా కుశాలన్నా" అని ప్రశ్నించింది.

"అవునమ్మా" అంటూ తలూపాడతను.

ఇంతలో అక్కడికి పళ్లు తోముకుంటూ

వచ్చాడు అప్పిగాడు. అతనికి ముప్ఫయ్యేళ్లు పైనే వుంటాయి. పనీపాటా మానేసి జులాయిగా తిరుగుతుంటాడు. అతనికి చిన్నప్పటినుంచీ చేతివాటం కూడా వుంది. తమ ఇంట్లోగానీ, లేదా ఇతర చోట్లల్లోగానీ ఏదయినా విలువైన వస్తువు దొరికితే దాన్ని అమ్మేసి సారా తాగేస్తుంటాడు. ఆ ఇంట్లో అతను ఎవరికీ భయపడడు. కానీ ఒక్క మంగరాజుకు, అతని భార్య చిట్టెమ్మకు మాత్రం భయపడతాడు. భయమంటే అది భయంకాదు. అతనికి వారిపట్ల వున్న గౌరవం... ఆ మాటకొస్తే ఆ ఇంట్లో వారిపట్ల అందరికీ అదే గౌరవం.. అభిమానం.

పందుంపుల్ల నములుతూ గెనిమీద నడుస్తూ ఆడవాళ్ల సోయగాల్ని తిలకిస్తూ, ఒక్క క్షణం అక్కడే నిలబడ్డాడు అప్పిగాడు. అక్కడ ఇంకా కాసేపు అలా వుండేవాడేగానీ అటువైపు గెనిమీద కూర్చొని సిగరెట్టు తాగుతూ కనిపించాడు మంగరాజు. అటు చూస్తే వదిన చిట్టెమ్మ. ఇటు చూస్తే అన్న మంగరాజు. అలా ఇద్దర్నీ అక్కడ చూసిన అప్పిగాడు అక్కడినుంచి ఇంటికి వెళ్లిపోయాడు.

తొందరగా నారు పెరకమని పైరు గుంజేవాళ్లను హెచ్చరిస్తున్నాడు మంగరాజు. పెరిగిన నారు కట్టల కొసల్ని పట్టుకొని ఒక్కో చేత్తో నాలుగయిదు కట్టలు హొప్పున తీసుకెళ్లి నాటబోయే బురద కయ్యల్లో వేసి వస్తున్నారు కుశాలన్న, మరో జీతగాడు కదిరప్ప. నారు పెరికే వారి కెదురుగా గెనింపైనే కూర్చొని సిగరెట్టు దమ్ము లాగుతూ వారివైపు చూసి తొందరిస్తున్నాడు మంగరాజు.

"గుంజల్లా నాటే వాళ్లకు పైరందలా... ఊc పెరకండి" అంటూనే దేవకిని చూశాడతను.

తొడల చివరి వరకూ చీర వడిని ఎగచెక్కి కూర్చొని నారు గుంజుతోంది దేవకి. నీటిలోవున్న కీటకాలు, మిడతలు కాళ్లకు ఎగబడుతుంటే అప్పుడప్పుడూ వాటిని చేత్తో తోసుకుంటూ కళ్లకు అడ్డు వస్తున్న వెంట్రుకల్ని మరో చేత్తో పైకి తోసుకుంటూ చెకచెక నారు పీకి పోగులు పెడుతున్న దేవకి అతన్ని బాగా ఆకర్షించింది. కాయకష్టంతో బలిష్టంగా వంపులు తిరిగివున్న ఆమె కండరాల కదలికల్ని చూస్తూ మనసులోనే తన్మయత్వం పొందసాగాడు. అతని అంతరాంతరాల్లోని కోరికలు పురులు విప్పి ఆడసాగాయి. అంతవరకూ అతనిలో దాగివున్న మృగం జూలు దులుపుకొని ఆవులించింది. ఆలోచిస్తూనే ఇంటికెళ్లాడు.

అలా మధ్యాహ్నం వరకూ బాగా ఆలోచించాడు. చివరికి ఒక నిర్ణయానికొచ్చాడు. కోరికలీరికలెత్తే అతని మనసు విరహంతో వేగిపోతోంది.

చిట్టెమ్మ, మరో జీతగాడు కలిసి కూలోళ్లకు పుడకలతో పైటేళన్నం తెచ్చారు. అందరూ కాళ్లూ చేతులూ కడుక్కొని బావి గడ్డన జిల్లేడాకులు, తీంద్రాకులు, ఆముదాకులు పరచుకొని కూర్చున్నారు.

బావిలోకి దిగి కుశాలన్న బిందె నీళ్లు తెచ్చిపెట్టాడు.

రాగి సంగటి, అలసందల పప్పుకూర, చింతకాయ ఊరిమిండి ఆ తట్టలో వుంది. అందులోనుంచీ తలా ఒక ముద్ద వడ్డించింది చిట్టెమ్మ. ఆ ముద్దలమధ్యలో గుంట చేసుకుని అందులోనే కూరవేయించుకుని లొట్టలువేస్తూ భోజనాలు ముగించుకొని తిరిగి తమతమ పనుల్లో మునిగిపోయారు అందరూ. ఖాళీ చేసిన అన్నం పుడకను తీసుకుని తిరిగి ఇంటికి వెళ్లిపోయింది చిట్టెమ్మ.

ఆమె అలా వెళ్లగానే ఇలా తిరిగి వచ్చాడు మంగరాజు. కుశాలన్నను పిలిచి చెప్పాడు.

"హొరే కుశాలా! నీ పెండ్లాన్ని తోపులో బాయికాడికి బొయ్యి జొన్నచొప్ప నాలుగు మోపులు కొయ్యమను. దుక్కిదున్నే గొడ్లకు

రేతిరికి మేతలేదు"

ఆ మామిడి తోటవైపుకు సామాన్యంగా ఎవ్వరూ పోరు. పైగా చుట్టూ చెరకు తోటలే వున్నాయి. వంటరిగా దేవకిని అక్కడికి రప్పించి ఎలాగయినా తన కోరిక తీర్చుకోవాలనుకునే అలా చెప్పాడు మంగరాజు. అది తెలియని కుశాలన్న భార్య దేవకికి గట్టునున్న కొడవళ్లలోనుంచీ ఒక కక్కుల కొడవలి తీసిచ్చి తోపులోకి పంపించాడు.

ఆ పని పూర్తిచేసుకొని తిరిగి రావడానికి కనీసం గంటకాలం పడుతుంది.

దేవకి పోయిన అరగంటకు తనూ బయలుదేరాడు మంగరాజు. ఎవరికీ అనుమానం రానివిధంగా మడులన్నీ చుట్టుకొని తోపులోకి ప్రవేశించాడు.

అక్కడ చుట్టూ నిలువెత్తు చెరకు తోటలు, వాటిమధ్య ఒక పెద్ద కయ్యలో వేసివున్న జొన్నపైరు దట్టంగా మనిషెత్తు పెరిగి పచ్చగా నిగారిస్తోంది. అప్పుడప్పుడు గొడ్లకు కోసివేసివున్న ప్రదేశంలో జానెడెత్తున్న మరదాంకోలె మోసులేస్తోంది. అక్కడ గొంతుక్కూర్చొని ఎడమచేత్తో కర్రలు పట్టుకొని కుడిచేతిలోని కక్కుల కొడవలితో కర్రలు కోస్తోంది దేవకి.

వెనకవైపునుంచి చూసిన మంగరాజుకు ముడివేసివున్న వెంట్రుకలతో చెమటతో తడిసివున్న పచ్చని రవికె, అదేరంగు నూలు చీరతో వనదేవతలా కనిపిస్తోంది. ఆమె కర్రలు కోస్తున్న శబ్దం కర్రుకర్రుమని వినిపిస్తోంది. ఆ శబ్దంలో వెనకనుంచి ఆమెను సమీపించిన మంగరాజు అడుగుల చప్పుడును ఆమె గమనించనేలేదు.

అతను మెల్లగా వంగి ఆమె మెడకు, భుజానికి మధ్య చేయివేశాడు. ఉలిక్కిపడి వెనక్కి చూసింది దేవకి.

ఆర్తిగా ఆమె కళ్లలోకి చూస్తూ లేడిని కబళించబోయే పులిలా నిలబడివున్నాడు మంగరాజు.

అది గమనించిన దేవకి గబుక్కున లేచి నిలబడింది. ఆమె చేతిలోని కక్కుల కొడవలి ముండ్లు వాడిగా మెరుస్తూ కనిపిస్తున్నాయి.

అతని చూపులూ వేడిగా వాడిగా ఉన్నాయి. అవి ఆమె శరీర పొంకాల్ని ఆస్వాదిస్తున్నాయి.

"అయ్యా! తమలాంటి పెద్దోళ్లకిదేంపనీ" అంది తలవంచుకొని.

"ఓమ్మీ! మాంసంకాడా, మందుకాడా, మగువకాడ ఎవ్వురూ పెద్దోళ్లూకాదు, పెద్ద మడుసులూకాదు. నిన్ను సూసినప్పట్నుంచీ నా మనసు కొటకరిస్తావుండాది. నాకోరిక తీర్చెయ్!"

తన్మయత్వాన్ని పొందుతూ ఆమెను గట్టిగా కౌగలించుకున్నాడు మంగరాజు.

"కొండంత రెడ్డొచ్చి కొంగుబట్టుకుంటే కాదనేదెట్టా. ఈయప్ప షావుకారీ.. కొంగుబట్టుకుంటె ఎట్టకాదనేదబ్బా! అట్టకాదంటే ఏం ముంచుకొస్తాదో... వొగేల ఈయప్పా పనులకు రాకుండా చేసేస్తే నోటికాడ కూడుబోతాది. ఆనక బిడ్డెలు పస్తేగదా.. ఈ అగసాట్లు ఏ మడిసికీ రాగూడదురా భగవంతుడా" మౌనంగా ఒక్క క్షణం తనలోతనే ఆలోచించింది దేవకి.

ఆ మౌనాన్ని అంగీకారంగానే భావించాడతను.

ఆపైన ఆలోచించుకునే వ్యవధికూడా ఇవ్వలేదు. ఆమె బుగ్గలపైన పెదాలపైనా కళ్లపైనా ఎక్కడంటే అక్కడ ముద్దుల వర్షం కురిపించేశాడు.

ఆమె అడ్డు చెప్పలేదు.

ఎళ్లాంటి స్పందనా లేకుండా మౌనంగా అలాగే వుండిపోయింది. తరతరాలనుంచీ మగవాడి చేతిలో ఆడది ఎలా బలైపోయి బానిసగా మారిపోతోందో దేవకీ అలాగే అతని చేతికి లొంగిపోయింది.

వారి శరీరాలు రెండూ ఏకమైన ఆక్షణం లోనే...

"వొరే! కుశాల... నీ పెండ్లాం కర్రలుకో

సేసి వుంటుందిగానీ మోపులు కట్టి చెరికొంచెం ఎత్తకొచ్చి ఇంట్లో యేసెయ్యండి. ఇంక నువ్వు పో" అని ఒక కయ్యలో అండ చెక్కుతున్న కుశాలన్నను పురమాయించాడు కేశవులు.

"సరేన్నా... ఈ గెనం ఇంకొంచెం అండ సెక్కాల... కదిరప్పకు చెప్పు..." అని సలం కపారను గట్టున పెట్టి మడిలో నీళ్ళతో కాళ్ళూ చేతులు కడుక్కొని...మామిడితోట వైపు బయలుదేరాడు కుశాలన్న.

ఆ తోపులో... చెరకు తోటలమధ్య, గెనాలమీద, ఆ జొన్న పైరువైపు నడుస్తున్నాడు నింపాదిగా.

అతను నడుస్తుంటే గెనాలమీదున్న గరిక పోచలు, అతని అడుగుల కిందపడి నేల కరుచుకుపోయి... కాలు ఎత్తేసిన మరు క్షణం అవి తిరిగి పైకి లేస్తున్నాయి.

కళ్ళకు అడ్డవస్తున్న చెరకు ఆకుల్ని, చేతులతో పక్కకు తోసుకుంటూ వెడుతున్నాడు. చెరుకు ఆకులు తగిలినచోట గీరుకుపోతున్నా ముందుకు పోతూనే వున్నాడు. అలా వెళ్తూవెళ్తూ ఒకచోట

చెరకు కర్రలు కదుల్తున్నట్లు శబ్దం వినిపించి, టక్కున ఆగిపోయాడు. ఆ శబ్దం వినిపించిన వైపుకు చెవులు రిక్కిస్తే ఏవో గుసగుసలు వినిపించాయి.!

"ఎవురో దొంగతనంగా గొడ్లకు చెరుకు మోసులు, సోగలు కోసుకొని బోతావున్నట్టుండాదే..." అనుకున్నాడు.

అనుకోవడమే ఆలస్యంగా గెనిముదిగి ఓ అడుగు ముందుకువేసి చూసి అవాక్కైపోయాడు. అక్కడ రెండు శరీరాలు ఒకదాని పైన ఒకటి కదుల్తున్నాయి. ఆ దృశ్యం చూసి వెనక్కి వచ్చేద్దామనుకుంటుండగానే అది గమనించినట్టు, పైనున్న ఆకారం భయంతో పైకిలేచి లుంగీ సర్దుకుంది.

కిందనున్న ఆడది గబగబాలేచి, విడిపోయి వున్న బట్టలు సర్దుకొని అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

అతను కేశవులు కొడుకు మధు.

ఆ వెళ్ళిన అమ్మాయి పాటూరివారి అమ్మాయి కళ. ఆరెండు కుటుంబాలకు వైరం.

'ఇద్దరిమధ్య పచ్చగడ్డివేస్తే... భగ్గున మండి భస్మం కాకపోయినా తడిలేకుండా ఎండిపోగలదు క్షణంలో... మరి ఈసంగతి తెలిస్తే... కొంపలంటుకోవూ...' అనుకున్నాడు కుశాలన్న.

"కుశాలన్నా! ఇంట్లో సెప్పొద్దు సంపేస్తారు. మా పెద్దాయన మంగరాజుకు తెలిస్తే... నరికేస్తాడు" ప్రాధేయపడిపోతూ అన్నాడు మధు.

"అది సరేగానీ... ఇదంతా ఏం పనీ, ఎబ్బటినించీయవ్వారం?"

"మాకు శానా దినాలుగా సంబంధం వుండాది. మేమిద్దరం ప్రేమించుకున్నాం. పెండ్లికూడా చేసుకోవాలనుకుంటున్నాం"

"సరే... ఇది మీ తప్పుగాదులేబ్బా! మీ వయసు అట్టాంటిది. ఈ కాలం అట్టాంటిది. సరేగానీ, నేనెవురికీ సెప్పన్లే... ఆడ కూతురికి మాత్రం అన్యాయం జెయ్యబాకబ్బా"

అనేసి ఆపైన ఇంక అక్కడ వుండలేక, అక్కడినుంచి వచ్చేశాడు కుశాలన్న.

ఆవిధంగా ఆ ఫక్కతోటలోనే తనకు తీరని అన్యాయం జరిగిపోతోందని తెలీకుండా పోయింది కుశాలన్నకు.

## పాపం ఊరికే పోదు

కాలం మందకొడిగా మరికొన్ని మాసాల్ని అధిగమించింది. అది వరికోతల కాలం.

సాయంత్రం నాలుగు గంటల సమయం.

అరవయ్యోపడిలో ఉడిగిపోతున్న వృద్ధుడి శక్తి సామర్థ్యాల్లా, పడమట వాలిపోయిన సూర్యుడి ప్రతాపం క్రమంగా తగ్గిపోతూ కనిపిస్తోంది.

కాన బావి దగ్గర దాసన్నగారింటి జనాలు, కూలీలు కలిసిపోయి మడి కోస్తున్నారు.

అప్పుడే అక్కడికి వచ్చిన మంగరాజు "హారే నరిసిమ్మా, కేశవా! కొందరు కోసేది సాలించి మోపులు కట్టండ్రా, ఇంకొందరు వాదెలు (కోసేసి కుప్పగా వేసిన కొన్ని పిడికిళ్ళ వరి కఱ్ఱలు) ఎత్తి మోపులు కట్టేవోళ్ళకు అందివ్వండి. కుప్పేసేదానికి లేటయిపోతాదీ" అని హెచ్చరించాడు తమ్ముళ్ళను.

ఆ మాటతో సగంమంది కూలీలు కోసిన వరిపైరును మూరెడెత్తు మోపులుగా కట్టడం ప్రారంభించారు. కొందరు ఆడవాళ్లు వాదెల్ని చేతులమీదుగా మోసుకొస్తూ మోపులు కట్టేవాళ్లకు అందిస్తున్నారు.

ఇంకా కోతలు కాని వరి మడులు, విరగ పండిన వరి గొలకలతో తలలు వేలాడేసుకుని కనిపిస్తున్నాయి. కొన్ని ఊరపిచ్చుకలు, మరికొన్ని కృష్ణపక్షులు, ఆ వరివెన్నుమీద కూర్చొని వడ్లగింజల్ని నోటితోనే వలుచుకుని తింటున్నాయి.

కోసేసిన వరిమళ్ళలో అక్కడక్కడ వాలిన గుడ్డికొంగలు వయ్యారంగా అడుగులు వేసుకుంటూ... మెడల్ని ముందుకు చాచుకొని ఒంకరటింకరగా నడుచుకుంటూ వెళ్తున్నాయి. అలా వెళ్తూనే కనిపించిన మిడుతల్ని, వడ్లగింజల్ని ఏరుకుంటూ కనిపిస్తున్నాయి. అప్పుడే... వరిమోపులు ఎత్తేసిన కయ్యల్లోకి బాతుకోళ్ళ గుంపును తోలుకొచ్చారు నడివయసులో వున్న ఇద్దరు దంపతులు.

"కో...కో..." అని వింతగా శబ్దంచేస్తూ ఒకదాన్ని మరొకటి తోసుకుంటూ, కనిపించిన చిన్న చిన్న పురుగుల్ని, నేలపైన రాలివున్న వడ్లగింజల్ని తమ వెడల్పాటి ముక్కుతో పట్టుకొని మింగుకుంటూ గుంపుగా హంసల్లా మడి కయ్యల్లో వెళ్తూ కనిపిస్తున్నాయి బాతుకోళ్లు.

నెత్తిన కొప్పులాగా చుట్టిన జుట్టు, అందులో తురిమిన ఎఱ్ఱటి పూలు, నొసటన పెద్ద కుంకుమబొట్టు, నొసటకి, గడ్డం మధ్యన నల్లగా కనిపిస్తున్న పచ్చబొట్టు, చెవిన వేలాడుతున్న వెండి దుద్దులు, ముక్కున ముక్కెర, బుగ్గన ఎప్పుడూ నముల్తూ కనిపిస్తున్న తంబకఱ్ఱ ఉండ, మెడలో పూసలదండ, పచ్చటి రవికె, మోకాళ్ళ కిందివరకు బిగుతుగా బిగగట్టిన చీరగోచీ, చేతులకు వెండి కంకణాలు, కాళ్ళకు వెండికడియాలు అచ్చతెలుగు జనపదురాలి లాగుంది బాతుకోళ్ళ యువతి.

ఆమె పక్కన ఒకచేతిలో సన్నని కానగ బఱ్ఱ చేతబట్టుకొని, బాతుల్ని 'ఉష్ ఉష్' అని అదిలిస్తూ నడుస్తున్నాడు ఆమె భర్త. తలకు చుట్టిన ఎఱ్ఱటి తుండుగుడ్డ, కోడికత్తుల్లా వున్న నల్లటి కోరమీసాలు, మెడలో ఓ రాగికంటె, ఓ చేతి రెట్టకు రాగి కడియం, మరోచేతి రెట్టకు తాయెత్తు కట్టిన ఓ నల్లటి దారం, మోకాళ్ళ వరకు బిగగట్టిన గోచీ, నల్లటి శరీరఛాయ... ఇదీ అతని ఆకారం.

ఆ మళ్ళ కవతలవున్న 'చింతపర్తోనికుంట'లోనే వారి గుడారం. ఆ కుంటలో సగం వరకు నీళ్ళున్నాయి. దానికి ఒకవైపున సన్నని కట్ట. ఆ కట్ట చివర ఓ పెద్ద చింత చెట్టు, ఆ చెట్టుకింద వారి గుడారం... దాని ముందర పదిగజాల వ్యాసార్ధంతో... బారెడెత్తున పలుచగా అల్లిన వెదురు దబ్బల తడికెలు నిలువునా పాతబడివున్నాయి. దానికి ఓ వైపున తడికెల తలుపులో ద్వారం కూడా ఏర్పాటుచేయబడి వుంది... అది రాత్రిపూట బాతుకోళ్ళు ఉండడానికి ఏర్పాటు చేసిన 'దొడ్డి'.

గుంపుగా అటువైపుకు నడుచుకుంటూ పోతున్నాయి బాతుకోళ్ళు. బడి వదలగానే పుస్తకాలను ఇంట్లోవేసేసి... పరిగెత్తుకొంటూ కానబాయి దగ్గరకు వచ్చిన మంగరాజు కొడుకు ఎనిమిదేళ్ళ చిన్రాజు ఆ బాతుకోళ్ళను చూడనేచూశాడు. అక్కడే అతనికి జతయ్యాడు అదేవయసులో వున్న

కుశాలన్న కొడుకు పాలేటి.

వారి చిట్టి బుర్రలకవి వింతగా కనిపించాయి.

మెల్లగా వాటివెంటే నడక ప్రారంభించారిద్దరూ...

"హొరే పాలేటీ... ఎంతబాగుండాయో సూడ్రా బాతులు... బలే తమాసాగా నడిసిపోతావుండాయి సూడు... ఎడల్పుగా వుండే ముక్కుల్తో పురుగుల్ని లటక్కున పట్టుకోని మింగేస్తావుండాయి **సూడు**" ఆనందంతో కేరింతలు కొడుతూ చెప్పాడు చిన్రాజు.

"అవును సిన్రాజూ! నాక్కూడా బాతుకోళ్ళంటే శానా ఇష్టం. వాటి గుడ్లంటే నాకు ఇంకా కుశాల (ఆనందం) తెలుసా?" ఆనందపడిపోతూ అన్నాడు పాలేటి.

"అవున్రోయ్! ఇవి పోతాపోతానే గడ్డిలో యాడంటే ఆడ... పుసుక్కన గుడ్లు బెట్టేసి కుశాలగా ఎల్లిపోతాయంట... మా యవ్వ సెప్పిందిలే..."

"సిన్రాజూ! అయితే మనమూ వీటి ఎనికింటినే బోతామా? వోళ్ళకు తెలీకుండా ఆ గుడ్లను ఎత్తుకునేద్దామా?" అతని చెవిలో రహస్యంగా చెప్పాడు పాలేటి. ఆ మాటకు ఎగిరి గంతేసినంత పనిచేశాడు సిన్రాజు

అది సరే పాలేటీ... ఈ బాతుకోళ్ళను, కాళ్ళు పట్టుకొని పైకి లేపితే ఊరికేనే సచ్చిపోతాయంట. అందుకని రెక్కలు పట్టుకొనిగానీ, మెడ పట్టుకొనిగాని వాటిని పైకి లేపతారంట తెలుసునా?"

"అట్టనా... ఏమోబ్బా? నాకు తెల్దు. ఇదెవరు సెప్పింది నీకు!"

"అది గూడా మాయవ్వే సెప్పిందిలే... ఇంకో సంగతి తెలుసునా నీకు?"

"యేంది?"

"ఈ బాతుకోళ్ళోళ్ళు... అన్నం తక్కువ తింటారంట. ఎప్పుడూ బాతు గుడ్లు ఉడకబెట్టుకొని తింటారంట. రోజుకో బాతుకోన్ని కోసుకొని తింటారంట తెలుసునా?"

"యెబ్బే! పొలుసు వాసన గదా... ఎట్టతింటారబ్బా!"

"వాళ్ళకదేగదా బతుకు అందుకని వాళ్ళకేమీ అనిపించదంట. మన రైతులు గూడా బాతుగుడ్లు తింటార్లే... నిన్న ఈ బాతుకోళ్ళా యప్ప మా ఊర్లో, వీటి గుడ్లు దెచ్చి అమ్మినాడు"

"అవున్లే... మా ఊర్లో గూడా అమ్మినారు. మాయమ్మ గూడా రెండు దీసుకొని రేతిరి వేయించింది నాకిష్టమే. కానీ పొలుసువాసనొచ్చింది. నేను తిన్లా?"

"ఆ... మనం తినే శాపలు, పొలుసు వాసన గాదా ఏందీ... వాటిని తింటా వుండ్లా, అట్టే ఇవీ!"

"ఓహో... అయితే బాతుకోళ్ళ గుడ్లు నీకు బలే ఇష్టమన్నమాట. నాక్కూడా మనసేలే'

"ఇద్దరికీ ఇష్టమేగదా. అయితే జాగర్తగా చూస్తాపోదాం... ఏదయినా బాతు గుడ్డు పెట్టిందా టక్కునెత్తేసుకుందాం... సరేనా?"

"సరే కానీ!"

ఇలా మాట్లాడుకుంటూ బాతుకోళ్ళు పెట్టే గుడ్లకోసం జాగ్రత్తగా గమనిస్తూ వాటి వెంటనే నడవసాగారు పాలేటి, సిన్రాజు.

అలా కొంతదూరం వెళ్ళిన తర్వాత ఆ గుంపులోనుంచి ఓ బాతు కోడి గెనికింద పెరిగిన గడ్డిలోకి 'కోవ్‌కోవ్' అంటూ కువకు వలాడుతూ పరుగెత్తికెళ్ళి కొంతసేపు పొదుగుతున్న కోడిలా ఆ గడ్డిపైన కూర్చొని తిరిగి వెళ్ళిపోయింది. పాలేటి అది గమనించి ఆ గడ్డి దగ్గరికి వెళ్లి చూశాడు.

అందులో తెల్లగా కోడిగుడ్డులా నిగనిగలాడుతూ కనిపించింది బాతుగుడ్డు...

అలా ఇలా ఒక్కసారి చూసి బాతుకోళ్ల దంపతులు గమనించని విధంగా వంగి గభాలున ఏదో నిధిని జవురుకుంటున్న వ్యక్తిలా ఆ గుడ్డును ఎత్తుకొని, "సిన్రాజూ... ఇలా వచ్చెయ్. గుడ్డు దొరికింది" మెల్లగా పిలిచాడు పాలేటి.

బాతుకోళ్ళు ముందుకు సాగిపోయాయి.

సిన్రాజు అతన్ని సమీపించి అతని చేతి లోని గుడ్డును చూసి ఆనందపడిపోయాడు.

"వరే వరే... ఆ గుడ్డు నాకియ్యరా!" అడుక్కున్నాడు సిన్రాజు.

"అమ్మా... నేను కనుక్కోని ఎత్తుకు నింది. ఇది నాది. ఇవ్వను" అన్నాడు పాలేటి.

"వరే పాలేటిగా! నువ్వు మా జీతగాడి కొడుకువి. మా నాయన చెప్పినట్టు మీ నాయన ఇనుకుంటాడు. అదే మాదిరి నేను చెప్పినట్టు నువ్వినుకోవాల కాబట్టి నువ్వు ఆ బాతుగుడ్డు నాకిచ్చెయ్ అంతే!"

గుడ్డును లాక్కోబోయాడు సిన్రాజు

"ఏమైనా... ఈ గుడ్డు నాదే... నేనివ్వను?"

చేతుల్తో గుడ్డుని వెనక్కి దాచుకుంటూ అన్నాడు పాలేటి.

"వరే దొంగనాకొడుకా... ఇవ్వరా"

ఆ గుడ్డును లాక్కోవడానికి, అతని చేతులు పట్టుకొని ముందుకు లాగాడు.

"పోరా... నేనివ్వను"

పాలేటి విదిలించుకోబోయాడు.

అలా చిన్రాజూ పాలేటి ఆ గుడ్డుకోసం పెనుగులాడారు.

ఆ పెనుగులాటలో ఆ గుడ్డు పగిలిపోయింది.

దాంతో "నా గుడ్డును పగలగొడతావా?" అంటూ పాలేటి చిన్రాజును ఒక దెబ్బకొట్టాడు.

అందుకు రెచ్చిపోయిన చిన్రాజు పాలేటి జుట్టు పట్టుకొని బూతులు తిడుతూ కొట్ట సాగాడు.

ఆ దెబ్బలకు "ఈ ముండకొడుకు సంపేశాడు తల్లో అమ్మో!" అని ఏడుస్తూ కేకలెయ్యసాగాడు పాలేటి.

ఆ కేకలు విని అక్కడికి దగ్గర్లోనే వున్న దేవకి "బిడ్డెను సంపేసేట్టుండాడు గదమ్మో పిల్లోడు" అంటూ పరుగెత్తుకుంటూ వచ్చి విడిపించింది.

కొడుకును అలా బాదేసరికి కోపం ముంచుకొచ్చినా ఏమీ అనలేక "ఏం బిడ్డయ్యా నువ్వు... పిల్లోన్ని కొడితివే పో" అంటూ పాలేటిని అక్కడినుంచి తీసుకొచ్చేసింది దేవకి.

ఆ మరునాటినుంచీ... బడి వదిలేయగానే చిన్రాజు పరుగెత్తుకుంటూ కానబాయి దగ్గరకు వచ్చేయడం... బాతు కోళ్ళ వెంట తిరగడం ప్రారంభించాడు.

అవి మడిలో గింజల్ని, పురుగుల్ని ఏరుకుతింటుంటే... చిన్రాజు మడి గెనిం పై కూర్చొని, గడ్డం కింద చేయి ఆన్చి, కళ్ళు పెద్దవిచేసుకుని గంటల తరబడి బాతుకోళ్లనే చూస్తూ వుండిపోయేవాడు. రోజూ సాయంత్రం అందరూ పనులు చాలించి ఇళ్ళకు చేరునేటప్పుడు లేచి వాళ్లవెంట తిరిగి ఇంటికి చేరుకునేవాడు.

ఇలా రోజూ బాతుకోళ్ళను చూడ్డానికి వస్తుండడంతో ఆ దంపతులతో అతనికి పరిచయం పెరిగింది. వాళ్ళు అతన్ని మురిపెంగా చూడసాగారు.

వాళ్ళకు పిల్లలు లేకపోవడంతో సిన్రాజును ప్రేమగా పలుకరించేవాళ్ళు. అతన్ని మచ్చిక చేసుకుని తమతోబాటు తీసుకుపోయి పెంచుకోవాలనుకున్నారు. దాంతో ఉదయాన తమ గుడారంలో రుచిగా ఉడకబెట్టుకుని తెచ్చుకున్న బాతుగుడ్లను, తాము తినే మాంసపు ముక్కల్ని అతనికిచ్చి మచ్చిక చేసుకుంటూ వచ్చారు. అలా చేయడంతో చిన్రాజుకు వాళ్లతో బాగా చనువేర్పడింది. వాళ్ళపైన ఒకవిధమైన నమ్మకం, అభిమానం కూడా ఏర్పడింది.

అలా ఒక వారం గడిచింది!

ఒకరోజు సాయంత్రం అలవాటు ప్రకారం... బాతుకోళ్ళను చూడడానికి చింతపర్తోనికుంటకు వెళ్ళాడు చిన్రాజు.

కానబాయి దగ్గర మడి కోతలు అయిపో

వచ్చాయి. ఇంకొక్కరోజుతో ఆ పని 'ముగిసి పోతుంది.

కూలీలు ఎవరి పనిలో వాళ్ళున్నారు.

ఆ కుంటకు, ఆ మళ్ళకు అరఫర్లాంగు దూరం వుంటుంది అంతే! అక్కడికి వెళ్ళి కట్టమీద కూర్చొన్నాడు చిన్రాజు.

బాతుకోళ్ళు... ఆ కుంట నీటిలో ఒకవైపు రెక్కలు అల్లార్చుకుంటూ, తమ ముక్కుల్ని నీటిలో ముంచి, నీటి పురుగుల్ని, చిన్నచిన్న చేపపిల్లల్ని పట్టుకుంటూ తింటూవుంటే వాటినే చూస్తున్నాడు చిన్రాజు.

గుడారానికి వెలుపల మూడు రాళ్ళు పొదిగించి ఏర్పాటుచేసిన పొయ్యిమీద ఓ సత్తుగిన్నె పెట్టి అందులో అన్ని బియ్యపు నూకలువేసి ఉడకపెడుతోంది బాతుకోళ్ళ యువతి.

"ఏమే... ఈరోజు గుడ్లన్నీ ఆ పక్క దిన్నె మాలపల్లెలో, బాలిరెడ్డిగారి పల్లెలో రైతులు కొనుక్కున్నారు. డబ్బులూ, బియ్యమూ ఇచ్చారు. ఆ సంచిలో పొయ్" అంటూ బియ్యం వున్న సంచిని అందిస్తూ అన్నాడు అప్పుడే అక్కడికి వచ్చిన బాతుకోళ్ళాయన.

ఆ సంచి తీసుకుని గుడారంలో పెడుతూ "ఏమయ్యా! రేపు పల్లెలకు గుడ్లెత్తుకొని పొయ్‌నప్పుడు ఎవుర్నన్నా అడిగి అంత ఉప్పు, అంత సింతపండు తీసుకరా!" అంది.

ఇంతలో పొయ్యిమీద బియ్యం పొంగింది.

బాతుకోళ్ళ యువతి గుడారంలోనుంచి ఓ చిప్పకట్టెను చేతబట్టుకొని వచ్చి, ఆ చిప్పక ట్టెను ఆ పాత్రలో వేసి ఒక్కసారి కలియబె ట్టింది.

"ఈ పిలగోడేంది. పొద్దుపోతావున్నా ఈన్నే వుండాడు" అన్నాడు కట్టమీద కూర్చొని బాతుకోళ్ళను చూస్తున్న చిన్రా జును చూసి అతను.

"నేను గమనించలేదు. ఇంకా ఈన్నే ఉండాడే" అని ఆ యువతి చుట్టూ చూసింది.

అప్పటికే పొద్దు గుంకిపోయింది.

కానబాయి దగ్గర మనుషులెవ్వరూ లేరు. అప్పటికే ఇళ్ళకు వెళ్ళిపోయి వున్నారు.

అలా చూస్తుండగానే చీకటి కమ్ముకొచ్చే సింది.

కానీ ఎవ్వరూ అతనికోసం రాలేదు.

అతన్ని దగ్గరకు పిలిచారు.

వచ్చాడు....

"ఏమబ్బా... ఇంటికిపోలా? " అంది అతని భార్య.

"మబ్బయిపోయింది. ఇంక నేనెట్ల బోవాల? " అన్నాడు దిగాలుగా.

ఇప్పుడేం చేయాలి అని ఒక్క క్షణం ఆలో చించారు వాళ్ళు.

ఇద్దరూ ఒక్క నిర్ణయానికి వచ్చారు.

ఆరాత్రి అతనికి బాగా వేయించిన గుడ్లు పెట్టారు. కాల్చిన మాంసపు ముక్కలు పెట్టారు.

"ఈ తిండి బాగుందా? " అన్నాడతను.

"ఓ బాగుంది" అన్నాడు చిన్రాజు అమా యకంగా.

గుడారంలో బుడ్డీ వెలుతురు తప్ప ఏ వెలుగూ లేదు.

అక్కడ బాతుకోళ్ళ కోల్ కోల్ శబ్దాలు తప్ప మరే అలికిడీలేదు.

"మాతో వచ్చేస్తావా? నీకు దినామ్మూ ఇదే మాదిరితో తునకలు (మాంసం), బాతు గుడ్లు పెడతాం... బాగా సూసుకుంటాం" ప్రేమగా అంది ఆ యువతి.

"ఓ..." అనేశాడు చిన్రాజు.

వారి ఆంతర్యం తెలియని పసితనం అత నిది.

"నీకేం దిగులుండదు. మీయమ్మా నాయ నకంటే బాగా సూసుకుంటాం... సరేనా? " అన్నాడతను.

"ఆ సరే.." అన్నాడు చిన్రాజు.

ఆ తెల్లవారి పొద్దుపుట్టేసరికి చింతపర్తోని కుంటలో బాతుకోళ్ళ దొడ్డితో బాటు, వారి గుడారమూ మాయమైపోయింది.

ఆ తర్వాత మంగరాజు మాయమైపోయిన తన కొడుకు కోసం ఎక్కడెక్కడో వెతికించాడు. కానీ అతని ఆచూకీ తెలియలేదు. బావుల్లో ఏమైనా పడిపోయాడేమోనని చుట్టుపక్కలున్న బావులు వెతికించాడు. చెరువులు, కుంటలు వెతికించాడు.

ఎన్నో జ్యోతిష్యాలు చూపించాడు.

చివరికి గంటావారి పల్లెనుంచీ గొప్ప మాంత్రికుడుగా పేరు పొందిన 'గొల్లతిమ్మయ్య'ను పిలిపించి 'అంజనం' కూడా వేయించాడు.

కానీ ఎలాంటి ప్రయోజనమూ లేకపోయింది.

అతని ఆచూకీ చెప్పేవాళ్ళే లేకపోయారు.

## నాంచారి నల్లావు



దాసన్నగారి ఆవులంటే అందరికీ భయమే! కొత్తవాళ్ళను చూస్తేచాలు. వెంబడించి తరుముతాయని ప్రతీతి.

రోజూ చూసే వాళ్ళను తప్ప ఇతరులనందరినీ అవి శత్రువులుగానే భావిస్తాయి.

వారి ఆవులగుంపులో ఒక నల్లావు వుంది.

అది మరీ భయంకరమైన గొడ్డు.

అందంగా పొడవుగా వున్న కొమ్ములు, ముఖం మధ్యన ఒక చిన్న తెల్లచుక్క, నల్లని సోగకళ్ళు, నల్లని శరీరంతో కామధేనువులా కనిపిస్తుంది. అది చాలా హుషారయిన పసరం.

కొత్తగా మందలోకొచ్చిన ఆవుల్ని పొడిచి పొడిచి తరమడంలో అది దిట్ట. దొంగతనంగా పొలాలలో జొరబడి పైరు మేయడంలో అగ్రగామి. అంతకుమించి కొత్తవాళ్ళెవరయినా అదిలించినా, రాయితో వేసినా ఇక వాళ్ళసంగతి అంతే! వెంటబడి తరిమి మరీ కసి ·తీర్చుకుంటుంది. చెట్టెక్కినా సరే వదిలిపెట్టేరకం కాదు. అది రాక్షసి గొడ్డు.

కాటమరాజు కథలో బొల్లావును తలపింపచేసే ఆ ఆవు దగ్గర మేత వేసేవాళ్ళు సైతం జాగ్రత్తగా ఉంటారు. అందుకే దానికి ముక్కుతాడు కూడా కట్టారు.

అది గయ్యాళి గోవు!

అందుకే దాన్ని 'నాంచారి నల్లావు' అని ముద్దుగా పిలుస్తారు. అక్కడ జీతగాడుగా చేరినప్పట్నుంచీ, వాటికి మేతవేసేది కుశాలన్నే. కాబట్టి కుశాలన్నని మాత్రం అది ఏమీ చేయదు. అతను అక్కడ చేరిన కొద్ది రోజుల్లోనే అది అతనికి బాగా మచ్చికయింది.

ఆ ఆవుల్ని రోజూ కల్లూరు అడవితోటకు తోలుకువెళ్ళి మేపుకొచ్చేది దిన్నె మాలపల్లె కదిరప్ప.

ఆ రోజు కదిరప్ప రాలేదు. దాంతో ఆరోజు ఆవులమేపే డ్యూటీ కుశాలన్నమీద పడింది. "ఈ దినం ఆవులకాడికి నువ్వే బో... వాడు కదిరప్పగోడు ఈ దినం రాలేదురా కుశాలగా..." అని ఉదయాన ఆరోజు అతను చేయాల్సిన పనిని పురమాయించాడు మంగరాజు.

ఉదయం తొమ్మిదికంతా... ఒకకర్ర చేతబట్టుకొని, చిక్కెం సంకన బెట్టి, ఆవులదొడ్డి తెరచి, ఆవుల్ని బయటకు తోలసాగాడు కుశాలన్న.

నల్లావు ఒక్కసారి అతన్ని ఉరిమి చూసింది. కుశాలన్న చేతిలో వున్న కర్రను

ముందుకు సాచి, మరో చేత్తో దానివీపుని
నిమిరి గిరికవేసి బయటకు తోలాడు.

అన్నింటినీ గుంపుగా చేర్చి కల్లూరు అడ
విదారి పట్టాడు. చీనీతోపు పక్కగా 'కంసలో
నికుంట' లో కొంతసేపు ఆవుల్ని ఆపి,
మేపాడు. అక్కడినుంచి 'ధనుందీసిన'బండ
మీద కాసింత సేపు కూర్చొని 'నూర్రాళ్ళు'
దాటుకొని, ఆపైన 'ఊట్లోని వంక'లో
గొడ్లను తోలాడు. అక్కడే అన్నం చిక్కెం
విప్పి, అన్నం తిని ఆ ఏట్లోనే నీళ్ళు
తాగాడు. అలాగే యింకొంచెం దిగువనుండే
'చిగరమాకులదడి'లోకి దిగి, దానికవత
లున్న 'చింతలొంక'లో నీళ్ళు దాపుకొని
మూడు గంటలకంతా ఆవుల్ని ఇంటిముఖం
పట్టించాడు. సాయంత్రం అయిదు గంటల
కంతా తిరిగి కంసలోని కుంటకు చేరుకు
న్నాడు.

అక్కడ పాటూరు పాపయ్య సేద్యం
వుంది. అడవి మొగదాల వున్న పాపయ్య
ఉలవచేను పక్కగా... ఆవుల్ని మేపుకుంటూ
వస్తున్నాడు కుశాలన్న.

ఆ చేన్లో ఉలవతీగెలు పంటపైన
వున్నాయి. ఏ చేలో చూసినా అర్ధచంద్రాకా
రపు ఉలవకాయలు విరగకాసి వున్నాయి.
ఆ చెట్లనిండా కాయలేగానీ ఆకులు కనిపిం
చలేదు. ఆ చేలోనే మరోవైపున పాటూరు
పాపయ్య వంగుని ఏదో పని చేసుకుంటు
న్నాడు. అతని కవతల అల్లంత దూరంలో
ఒక పెద్ద కానగ చెట్టు కనిపిస్తోంది.

భుజాలపైగా చేతికర్రను పట్టుకొని కాళ్ళు
యింటూ ఆకారంలో వుంచి నిలబడి ఈల
వేసుకుంటూ ఆవుల్ని కాస్తున్నాడు కుశా
లన్న. ఇంతలో అతని కన్నుగప్పి నాంచారి
నల్లావు ఆవలనున్న చేలో పడ్డది.

ఆ విషయాన్ని అతను గమనించలేదు.

నోటికి అందింది అందినట్లే ఆబగా, గబ
గబా ఉలవతండును మింగేస్తోంది నల్లావు.
ఆ చెట్ల నిండా వట్టి కాయలే. అర్ధచంద్రాకా
రంగా, పచ్చగా కనిపిస్తున్న కాయలు. ఆ
కాయల్ని అలాగే చప్పరించేసి మిగేస్తోం
దది.

కుశాలన్న యింకోవైపు ఎక్కడో వున్నాడు.

నిలువెత్తు కంచెదాటి అది చేన్లోకి ఎలా
పోయిందో పోయింది. ఇంతలో దాన్నిచూ
డనే చూశాడు పాపయ్య.

"ఎవుడ్రా? ఆ పక్కన గొడ్ల మేపతావుండే
నా కొడుకు. అన్నీకారిగొడ్డు ఎట్ల మేస్తావుం
డాదో సూడో... వారే... నీయాలీ ముండ
మొయ్యా! వోరగా తోల్రా గొడ్డును"

అశ్లీలంగా తిడుతూ కేకలేస్తూ, చేన్లోకి
వంగివంగి చేత్తో రాళ్ళు తీసుకుని నల్లావు
పైన విసురుతూ వచ్చాడు.

"ఏం కొంప మునుగుతోందో సామీ..."
అనుకుంటూ అటువైపుకు పరిగెత్తాడు ఆ
మాటలువిన్న కుశాలన్న.

ఇంతలో నల్లావు సంగతి తెలియని
పాపయ్య దానిదగ్గరకు వెళ్ళి ఒకరాయి విసి
రాడు.

ఆరాయి వెళ్ళి పట్టుమని దాని నుదుట
నున్న తెల్లచుక్క మధ్యలో తగిలింది.

అంతే!

ఆ దెబ్బకు రోషం ముంచుకొచ్చేసింది
నల్లావుకు.

తలవంచి కొమ్ములు ముందుకుసాచి నల్ల
నాగులా బుసలు కొడుతూ అతనిపైకి
దూకింది.

ఈ హఠాత్సంఘటనకు బిత్తరపోయిన
పాపయ్య వెనక్కి పరుగు లంఘించాడు.

అయినా అది అతన్ని వదలలేదు. వెంట
బడి తరుముతోంది. "ఓర్నాయనో...
యిదేం గొడ్డురా దేవుడా... సంపేట్టుగా
వుండాదే ముండగొడ్డు... ఎవుడ్రా ఆవ
లోడు... కాపాడ్రా నాయనా" అంటూ గావు
కేకలు వేస్తూ పరుగెత్తసాగాడు.

ఆ పరుగెత్తడంలో అతనిగోచీ పూర్తిగా
ఊడిపోయి ఒక కొసమాత్రం మొలతాడుకు
తగులుకొని, మిగతా పంచి తోకలా నేల
పైన జీరాడుతోంది. అయినా అతను ప్రాణ

భయంతో అదేదీ గమనించే స్థితిలో లేడు. పరుగెడుతూనే ఉన్నాడు. అది గమనించిన కుశాలన్న "వసే దొంగలంజా... కర్రి ముండా నాంచారిదానా.... ఉండే...నీ యబ్బడాలా... నిన్ను నక్కలకియ్య. నిను కోసి నాయకురాలు బండన ఆరెయ్య.. కొంపమిందికి తేవద్దు. ఉండే లమ్మిడీ.." అని పచ్చిగా తిడుతూ కర్రగాలిలోకి ఎత్తి పట్టుకొని దానివెంట పడ్డాడు.

చుట్టుపక్కల పొలాల్లో పనిచేసుకుంటున్న రైతులంతా ఆ దృశ్యం చూసి బెంబేలెత్తి పోయి నిలబడిపోయారు.

ప్రాణభయంతో పాపయ్య కొంతదూరంలో కనిపిస్తున్న కానగ చెట్టువైపు పరుగెత్తసాగాడు.

ముందు పాపయ్య.

అతన్ని తరుముకుంటూ... వెనక నల్లావు!

దానివెంట కర్రగాలిలో ఎత్తిపట్టుకొని కుశాలన్న.

ఇంతలో ఎలాగో పాపయ్య వెళ్ళి ఆ కానగ చెట్టెక్కేసి దాని పైకొమ్మల్లోకి పాకి వణుకుతూ కూర్చున్నాడు.

అయినా కర్రావు కోపం ఆగలేదు.



తన్నుకొట్టిన వాడిపైన పగ సాధించలేక పోయానే అన్న భావంతో దాని కోపం రెట్టింపయింది. వేగంగా ఆ చెట్టును రెండుచుట్లు వేసింది. ఇంతలో కుశాలన్న దాని దగ్గరకు వెళ్ళాడు.

అంతే... అది కుశాలన్నపైకి దూకింది.

దాన్నుంచి తప్పించుకోవాలని పక్కకు గెంతిన కుశాలన్న కిందపడిపోయాడు. ఆ దెబ్బకు అతని చేతవున్న కర్ర ఎప్పుడో కింద పడిపోయింది. అయినా అది వదల్లేదు. అత్తమీద కోపం దుత్తమీద చూపినట్టు పాపయ్య మీదున్న కోపం కుశాలన్న మీద చూపింది.

అర్రువంచి కొమ్ముల్తో పొడవడానికి ప్రయత్నిస్తూ దాని ప్రతాపమంతా చూపుతోంది.

అయినా కుశాలన్న భయపడలేదు.

"పగోడెవుడో, తనోడెవుడో తెలీని గుడ్డి ముండా నీ యబ్బడాలా... కర్రిముండా..." అంటూ దాని కొమ్ముల వేటుల్ని తప్పించుకుంటూ దాని ముగుతాడు పట్టుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు.

అలా కొంతసేపు ప్రయత్నించిన తర్వాత ఎలాగయితేనేం... దాని ముగుతాడు పట్టుకున్నాడు. ఒక్క గుంజు గుంజాడు. ముక్కు నొప్పికి కాస్త తగ్గింది కర్రావు.

యుద్ధంలో కిందపడి లేస్తున్న మహామల్లుడిలా పైకి లేచాడు కుశాలన్న.

తన రెండు చేతుల్తో ముక్కుతాడు పట్టుకొని కోపంతో దాని తలని మెళి తిప్పాడు.

ముక్కునొప్పికి, అర్రునొప్పికి నాలుక బయటకు చాపి 'అంబా' అంటూ అరిచింది.

"పొడస్తావా...నీయమ్మ... అరగాసు (పనికిరాని) గొడ్డా! కనిపించినోళ్ళనంతా తరుముకుంటావా... నిన్ను నడీది గంగమ్మ కాడ నరకా! నీ శరమం దీసి కపిలబాన కుట్టా!"

అలా తిడుతూ దాని మెడను గట్టిగా మెలి తిప్పాడు.

దాంతో కిందపడిపోయింది కర్రావు. అలాగే ఒకచేత్తో ముగుదాడు పట్టుకొని, మరోచేత్తో కిందపడివున్న దుడ్డుకర్రను చేతిలోకి తీసుకుని దాని డొక్కలో పొడిచాడు.

ఆ దెబ్బకు నాలుక బయటకు చాపి 'అంబా' అంటూ బాధగా మూలిగి మెలితిరిగి పోయింది నల్లావు.

అలా చాలా సార్లు దాన్ని హింసించడంతో చంపేస్తాడన్న భయంతో వణికిపోయిందది.

కొంతసేపటికి ముగుదాడు వదలి, రెండు చేతుల్తో, కర్ర తీసుకుని అందినచోటల్లా బాదసాగాడు కుశాలన్న.

దుడ్డుకర్ర దెబ్బలు తగిలినచోట, చర్మం పైకి లేచిపోయి దాని శరీరంపైన వాతలు స్పష్టంగా కనిపించసాగాయి. దాంతో బిత్తరపోయిన నాంచారి నల్లావు పైకిలేచి పరుగెత్తుకుంటూ వెళ్లి ఆవులగుంపులో కలిసిపోయింది.

అప్పుడు చూసుకున్నాడు తన శరీరాన్ని కుశాలన్న.

వేసుకున్న బాడీగుడ్డ తుంపర తుంపరై పోయివుంది. వళ్ళంతా అక్కడక్కడా గీరుకుపోయి నొప్పి పెడుతోంది. అక్కడక్కడా బాడీగుడ్డకు రక్తపు మరకలు కూడా కనిపిస్తున్నాయి.

శరీరానికంటిన దుమ్ము దులుపుకుంటూ, ఆవును తిట్టుకుంటూ మంద దగ్గరకు చేరుకున్నాడు అతను.

చెట్టుదిగిన పాపయ్యమాత్రం.... "ఈ కొడుకులకు ఇట్టగాదు. యింటికి బోయినాక చెబుతా..." అనుకుంటూ బతుకుజీవుడా అని ఇంటిముఖం పట్టాడు.

ఆ రోజు సాయంత్రం ఊర్లో పెద్ద రాద్ధాంతం జరిగింది. దాసన్నగారు, పాటూరోళ్ళు కొట్లాడుకుని కొట్టుకునే పరిస్థితి ఏర్పడింది.

ఆ ఊరి పెద్దల ప్రమేయంతో వారి రగడ ఆగిపోయింది. కానీ ఆవుల్ని సరిగా మల్లేసు కొని రాలేదని మంగరాజు కుశాలన్నని నానా మాటలు అన్నాడు. యింకెప్పుడయినా ఇలాంటి పొరబాటు జరిగితే చర్మం వలిచేస్తానని కూడా హెచ్చరించాడు. కానీ ఆ ఆవు దెబ్బకు....కాస్త ఏమారివుంటే అతని ప్రాణాలే పోయుండేవన్న నిజాన్ని మాత్రం ఎవ్వరూ గుర్తించలేదు. అందరూ అతన్నే తిట్టారు.

అయితే ఆ సంఘటన అతని జీవితంపైన అంతకన్నా పెద్ద దెబ్బ కొట్టింది.

తన్ను పొడవడానికి వచ్చిన నల్లావును ఆ కోపంలో ఎక్కడంటే అక్కడ దుడ్డుకర్రతో కొట్టిన ఫలితంగా అది అనారోగ్యం పాలయింది. దానికి ఏ సున్నితావయవం మీద దెబ్బ తగిలిందో గానీ రానురాను అది క్షీణించిపోయింది.

ఎన్నెన్నో ఆకుమందులు పెట్టారు. లాభంలేకపోయింది. చివరికి కొద్ది రోజులకది చనిపోయింది.

పాటూరు పాపయ్య అది చచ్చినందుకు ఆనందించాడు.

అది కుశాలన్న దెబ్బలకే చచ్చిందని కొందరు భావిస్తే, తన్ను పొడవడానికి వచ్చినందుకు పాపయ్యే ఏమో చేసుంటాడని మరికొందరు అనుకున్నారు. కానీ మంగరాజుమాత్రం కుశాలన్ననే పట్టుకున్నాడు.

"నువ్వు నష్టపరిహారం కట్టియ్యాల్సిందే" అన్నాడు.

'ఎట్టా'? అన్నాడు కుశాలన్న.

"వెయ్యి రూపాయలు చెల్లించు" అన్నాడు మంగరాజు.

"నేను కట్టలేను సామీ? "

ప్రాధేయపడ్డాడు కుశాలన్న.

"అయితే నీకిక్కడ పనిలేదుపో"

బెదిరించాడు మంగరాజు.

మౌనం వహించాడు కుశాలన్న.

అదే అవకాశంగా తీసుకున్నాడతను. వేయిరూపాయలకు బాండు రాయించుకుని అది రెండు సంవత్సరాలలోపు తీర్చేయాలని నియమంకూడా పెట్టాడు.

దాంతో సగం ప్రాణం పోయినట్లనిపించింది కుశాలన్నకు.

### సేన్లో నడేమియా



"ఏమయ్యా! పాప పెద్దమడిసయింది" గౌరి సంగతి గుంభనంగా చెప్పింది దేవకి.

"నిండా పదమూడులేదే. అప్పుడే అయిందా? " ఆశ్చర్యంగా అన్నాడు కుశాలన్న.

"ఈ కాలం పిలకాయలు అంతేలే"

ఓ మూల గొంతుక్కూర్చొని అన్నం గిన్నెలో తన కుడిచేతివ్రేళ్ళు తిప్పి తిప్పి నాకుతూ అంది దేవకి అమ్మ ఈరమ్మ.

ఆ వాలకం చూస్తుంటే కుశాలన్నకు వళ్ళు మండిపోయింది.

"దరిద్రప్ముండా! అరిగిపోయేట్టుగా అట్టెందుకే నాకుతావు బోకీ" అసహ్యించుకుంటూ ముఖం చిట్లించి అన్నాడు.

ఆ గుడిసె ముందరున్న పందిరికింద ఓమూల క్షీరసాగరంలో అప్పుడే పుట్టుకొచ్చిన లక్ష్మీదేవిలా కూర్చొని వుంది గౌరి. ఆమెకవతల రాతికూసానికి కట్టివేయబడి వున్న ఆవు రాత్రి మేసిన గడ్డిలో మిగిలి

వున్న చొప్పుదంటుకోసం మోరతో ఆ గడ్డిని కెలుకుతోంది. ఒకప్పుడు పేయదూడగా వున్న ఆ పశువే ఇప్పుడు ఒక దూడను కని ఆవయింది. దానిపక్కనే ఓ బుడుగుదూడ కట్టివేయబడివుంది. గుడిసెలో పొయ్యిమీదున్న సంగటిని మూరెడు పొడవున్న సంగటి కట్టెతో కదుపుతోంది దేవకి.

ఆ పొయ్యికి కుడివైపున ఒక నీటికుండ, రెండు మట్టిమూకుళ్ళు, కొన్ని సత్తు పాత్రలు వున్నాయి. ఓ మూల రెండు పాతగోనెసంచులు, ఒకపాత ఈతచాప, సగం చిరిగిన మరో తుంగచాప, బాగా మురికి పట్టి నల్లగా, అసహ్యంగా కనిపిస్తున్న రెండు తలగడలు... వాటికానుకొని అరంగుళం మందంతో వలయాకారంగా, మూరెడెత్తుగా వున్న ఒక పలుచటి 'సంగటిబండ' గోడకు ఆనించివుంది.

తలుపు పక్కన సందులో గోడకు ఆన్చి నిలబెట్టివున్న ఒక రోకలి, మరో కారంనూరే 'బడరోకలి' కనిపిస్తున్నాయి. కప్పునుంచి వేలాడదీసిన దండెం కొయ్యకు రెండు మూడు పాతచీరలు, దానిపక్కన కొయ్యకు తగిలించిన ఒక పాత గొడుగు...ఆ దండెం కింద నేలపైన ఓ పాతకాలంనాటి 'ట్రంకు పెట్టె'... ఇవే ఆ సంసారానికి ఆస్తులు.

"పాలేటి యాడబోయ? "

తుండుగుడ్డ కిందవేసుకుని నట్టింట కూర్చుంటూ అడిగాడు కుశాలన్న.

"ఆడయాడనో గోళీలు ఆడను బోయినట్టుంటాడు. అది సరేగానీ ముందు ఆయమ్మికి గుడిసేసేటట్టుసూడు"

కర్తవ్యాన్ని గుర్తుచేసింది దేవకి.

"నిజమే...నేరేడు మండలు, టెంకాయ కీతుల్తో... ఇంటిముందర బిడ్డెకు గుడిసెయ్యాల. అది చేస్తామనుకో, కానీ అయిదో రోజు ఇంట్లోకి చేర్చుకోవాలగదా... ఆ దినం నలుగుబెట్టించి, కొత్త గుడ్డలు కట్టించి, మెడలోనూ నగ వేయించాల. ఆ దినం లవుడు స్పీకరు పెట్టించాల. ఊర్లో కొందరికయినా భోజనాలు పెట్టించాల. శానా ఖర్చవుతుందే ఎట్టాని? "

"ఆడ బిడ్డన్నాక తప్పుతుందా... ఊర్లో అన్నాలు యేసే సంగతి యాడన్నా బోనీలే... కనీసం బిడ్డెకొక కొత్త... పైటన్నా తేవాల... దానికి తగిన రయిక తప్పదు. ఇంక నగంటావా, నా చెవులో వుండే తెల్ల రాళ్ళ కమ్మలు బిడ్డెకేసేస్తాలే...నేను చెవులో పొరక పుల్లల బెండ్లు పెట్టుకుంటాను గానీ... బిడ్డెకంటే ఎక్కువా ఏందీ"

ఉన్నంతలో సర్దుకోవాలన్న ఉద్దేశంలో అంది దేవకి.

"సరే, అట్టేకానీలే... అదే పాణానికి సుఖువు. పైటకు, రవిక్కి దుడ్డు గావాల గదా... అది దాసన్నోళ్ళనే అడగదాం. ఇంతో అంతో దుడ్డు ఇయ్యకపోరు. మనింట్లో తొలి శుభకార్యమనిచెప్పి అప్పయినా పుట్టించుకోని వస్తా. ఇంక మైకు సెట్టూ అదీ" సాలోచనగా అన్నాడు కుశాలన్న.

"అన్నాలెయ్యడం లేదుగదా... ఇంక మైకు సెట్టు మనకెందుకులే..."

"అట్టనిగాదు, ఊర్లోవాళ్ళేమైనా అనుకుంటారుగదా!"

"అనుకుంటే అనుకోనీలే... అనేవోళ్ళంతా వొగపూట భోజనం. ఏమైనా పెడతారా ఏందీ? "

"అంతేనంటావా? "

"అంతగాకలేయ్యి"

ఇలా కూతురు, అల్లుడూ సంసార విషయాలు చర్చించుకోవడంలో మునిగిపోగానే, ఇంకా అణగారని ఆకల్ని తీర్చుకోవడానికి దేకుతూ వీధిలోకి బయలుదేరింది ఈరమ్మ.

ఏమి విచిత్రమో ఏమోగానీ... ఈరమ్మది అంతులేని ఆకలి. ఎంత తిన్నా అది తీరదు. దరిద్రులకు ఆకలెక్కువంటారు. ఇదే కాబోలు. పెడుతుంటే ఎంతయినా సరే... తింటూనే వుంటుంది. మళ్ళీ అరు

స్తూనే వుంటుంది. పైగా నడవలేదు. నడుములు పడిపోయి నాలుగు సంవత్సరాలయింది. గుడ్డిది కూడా.

"అమ్మా! అక్కా! అంత అన్నమెయ్యి తల్లీ" అని దేక్కుంటూపోతోంది వీధిలోకి.

ఇంట్లో వండిన సంగటిలో తనొక ముద్దే సుకొని ఒక ముద్ద కూతురికేసింది. మరో ముద్దను కుశాలన్న గిన్నెలో వేసింది. మిగిలిన నాలుగు ముద్దల సంగటిని, చట్లోవేసి మూకటితో మూత పెట్టింది దేవకి.

ఆ తర్వాత అప్పటికే చేసిపెట్టిన అలసంద గింజల పులుసున్న పాత్రను ముందరపెట్టి, భోజనం చేయడం ప్రారంభించారు దేవకీ కుశాలన్నలు. గౌరీ అదే కూరతో అన్నం తినడం ముగించింది.

కుశాలన్న గబగబా మింగేసి, చేయి కడుక్కొని "అమ్మీదేవా... నేనట్టబోయొస్తా, ఎవ్వరయినా వరసయిన పిల్లగోన్ని నేరేడు మండలకు పంపిస్తా... ఇంట్లో భద్రం..." అని చెప్పేసి, తుండుగుడ్డ భుజానేసుకొని వీధిలోకి అడుగు పెట్టాడు.

అతనలా వెళ్ళగానే పాత్రలన్నీ కడిగి, ఎత్తిపెట్టి ఒక వెదురు తట్టను సంకన పెట్టుకొని "అమ్మణ్ణేగౌరే పాలేటొస్తే, సట్లో అన్నం పెట్టుకొని తినమను తల్లీ. కొంతేగాలం నా కొడుకు. ఎక్కడ బొయినాడో ఏమొ. నేను దట్టబొయ్యి ఆవుకంత కసువు పెరక్కొస్తా..." అని గడ్డికి బయలుదేరింది దేవకి.

అక్కడికి ఉత్తరాన కిలోమీటర్ దూరంలో కసిరెడ్డిగారిపల్లె' అనే చింతలతోపు వుంది. అక్కడ గెల్లపల్లోళ్ళ మర్రిమాను, సేద్యం, దోనోళ్ళబావి, ఇంకా చాలామంది వ్యవసాయ భూములున్నాయి. అక్కడ సగం పొలాలలో వేరుశనగ చెట్లున్నాయి. అవి మంచి పూతపైన వుండి నేలతల్లి, శనగ పూల రవికె తొడుక్కున్నట్లు పచ్చగా వుంది. మిగిలిన సగం పొలాలు ఏపుగా పెరిగివున్న సద్ద, జొన్న చేన్లు 'సుంకు'పట్టి గింజ దిగే స్థితిలో వున్నాయి. కొన్ని చేలల్లో పాలకంకి కూడా దిగి వుంది. ఆ పాలగింజలకాసించే గువ్వల్ని తోలుతూ రైతుల పిల్లలు కేకలేస్తూ, టపాకాయలు కాలుస్తూ పాత రేకు డబ్బాలు వాయిస్తూ, బెదిరిస్తున్నారు.

అక్కడక్కడా వేసున్న నిలువెత్తు మంచెల పైన నిలబడి కొందరు ఆడపిల్లలు వడిసెళ్ళతో రాళ్ళు విసురుతూ గువ్వల్ని తోలుతున్నారు.

ఆ సద్ద చేన్లలోకి గడ్డికోసం ప్రవేశించింది దేవకి. సద్ద కర్రల మధ్యలోవున్న గరిక, ఉట్లా ఉట్లా గడ్డి, గురుగ, బదనిక వంటి గడ్డి కోసి ఒకచోట కుప్పపెట్టింది. కుప్పపెట్టిన కసువునంతా తట్టకు మట్టసంగా పేర్చుకుంది.

'ఉస్సుబ్బ' అని ఒక నిట్టూర్పు విడిచి సంతృప్తిగా పైకి లేచి ఒక్కసారి చుట్టూ చూసింది.

ప్రపంచం కనిపించనంత ఎత్తుగా కర్రలు. పైన ఆకాశం మాత్రమే కనిపిస్తోంది.

ఆవేళ... ఆకర్రలమధ్య తనొక మరుగుజ్జునన్న విచిత్రమైన భావం కలిగింది ఆమెకు.

పైటకొసనే చుట్టలా చుట్టి, నెత్తిన పెట్టుకొని, రెండు కాళ్ళు బారసాచి గొంతుక్కూర్చుంది. ఆ తర్వాత రెండు చేతుల్తో తట్టను తలపైకి ఎత్తుకోవడానికి ప్రయత్నించింది.

ఆ పచ్చగడ్డి తట్ట చాలా భారంగా వుంది. శక్తినంతా కూడదీసుకుని, శరీరాన్ని ఉగ్గబట్టి, ముక్కుతూ మెల్లగా కాళ్ళపైకి తట్టనెత్తి, కాళ్ళుముడిచి ఆ తర్వాత రెండు చేతుల మీదుగా వున్నట్టుండి ఒక్క ఊపున తట్టను తలపైకి ఎత్తింది. కానీ ఆమె ప్రయత్నం ఫలించలేదు. పైటచుట్ట కిందపడిపోయింది. దాంతో గడ్డంతా కిందపడిపోయింది. మళ్ళీ తట్టను నేలకు దించి కింద పడిన గడ్డినంతా తట్టకు పేర్చింది. తనొకర్తే

దాన్నెత్తుకోలేనని గ్రహించింది. సహాయంకోసం చుట్టూ చూసింది. ఇంతలో ఆ పక్కనే ఒకచోట కర్రలు కదులుతు న్నాయి. ఎవరో గడ్డికోస్తున్న చప్పుడు, విని పిస్తోంది. వాళ్ళని పిలిస్తే తట్టెత్తిపోతారని 'ఎవురమ్మా ఆడ' అని పిలిచింది.

ఆ మాటతో ఆ కర్రల్ని తోసుకుంటూ ముందుకొచ్చాడు మొగరాల ముద్దయ్య.

అతన్ని చూసి ఒక్కక్షణం విస్తుపోయింది దేవకి.

"ఓ మామా నువ్వా! ఈ తట్టట్ట ఎత్తు మామ" అంది అతన్ని చూసి. మొగరాల ముద్దయ్యదీ ఆమె ఊరే. గొడ్లకు కావాల్సిన కసువుకోసం అతనూ వచ్చాడు. అతనికి నలభై ఏండ్లుండవచ్చు.

"తట్టకు పెట్టుకున్నావా? "

కోరగా ఆమె కళ్లలోకి చూసి అన్నాడు.

ఆ చూపులో ఏదో ఆశ ఏదో కోరిక. తపన!

అంతకుమించి వయసు ఆడది వంటరిగా ఈ సద్దచేన్లో దొరికింది కదాన్న ఆనందం!

క్షణంసేపు ఆమె మనసు గుభిల్లుమన్నది.

మళ్ళీ పైటకు చుట్టి తలపైన పెట్టుకొని రెండు చేతుల్తో తన వైపుకు తట్ట అంచును పట్టుకుంది.

ఆమెకభిముఖంగా నిలబడ్డ ముద్దయ్య అటువైపు ఒకచేత్తో తట్టను పట్టుకొని ఎత్తి ఆమె తలపైన పెట్టాడు. మళ్లీ పైట చుట్ట కిందపడి తలమంట పుట్టింది.

"అబ్బబ్బ దించు మామ దించు. మంట. పైట చెరుగు కిందపడి పోయింది. దించు దించు" అంది.

ఆమె పైట జారి కిందపడిపోయివుండడంతో, ఆమె స్తనద్వయం, రవికెలో నుంచీ అర్ధనగ్నంగా కనిపించింది.

అది చూసిన ముద్దయ్య కోరిక బుసలు కొట్టింది. అంతే వెంటనే ఆమెను గట్టిగా పట్టుకొని కౌగలించుకున్నాడు.

"ఏంది మామిది వదులు" అతని కౌగిలి నుంచీ గింజుకుంటూ అంది.

"ఎవురూ చూడర్లేమ్మీ. మనిద్దరమే ఉండాం. సుట్టుపక్కల ఎవురూ లేరు. కాద నొద్దు. ఈ శాన్సు మళ్ళా దొరకదు"

తన్మయత్వంతో ఆమె ఎత్తుపల్లాల్ని ముద్దు పెట్టుకున్నాడు. అతని ఆవేశం చూసి దేవకి ఆపైన అడ్డు చెప్పలేకపోయింది. అంతే... ఆ మరుక్షణం అక్కడున్న గడ్డే వాళ్ళకు పరుపుగా మారిపోయింది.

## పోయినోడు తిరిగొచ్చాడు



అది వేసవికాలం.

వర్షంపడి మూడు సంవత్సరాలయింది!

గొడ్డూ గోదా గడ్డికోసం నకనకలాడిపోతు న్నాయి.

ఎక్కడ చూసినా ఎర్రటి దుమ్ము నేలలే

మందుకయినా గరికపోచ కనిపించనంతగా నేల ఎండిపోయింది.

తాగడానికే నీళ్ళు లేవు.

మనుషులకే తాగేనీరు దొరక్కుండా వుంటే, ఇక పశువులకెక్కడినుంచి దొరుకుతాయి?

ఇలాంటి పరిస్థితిలో రైతులు తమ పశువుల్ని తోలుకొని గడ్డి, నీళ్ళు వున్న ప్రదేశాలకు, దారిబత్తేలెత్తుకొని వలసలు పోతు

న్నారు.

ఆ ఊర్లో అందరితోబాటు దాసన్నోళ్లు... తమ పశువుల్ని, గొర్రెల్ని తోలుకొని వలస పోవడానికే నిశ్చయించుకున్నారు.

వలసపోయే సమయంలో సామాన్యంగా పశువులు, గొర్రెలు వున్నవాళ్ళు అందరూ కలిసి మొదట ఏ ప్రాంతంలో వర్షాలుపడ్డాయో, జీవాలకు ఏ ఊరివైపు గడ్డీగాదం సులభంగా దొరుకుతుందో చూసి రమ్మని ఒక వ్యక్తిని పంపిస్తారు.

ఆ వ్యక్తి సూచనమేరకు ఎటువైపుకు పోవాలో నిర్ణయించుకుంటారు. అలా దాసన్నగారు కదిరప్పను బాకరాపేట అడవికి పంపించారు. అతను తిరిగివచ్చి "అన్నా! ధనికొండ, నెమిలిగుండ్లు, బాకరాపేట దిగువపక్క రాజ్జెం పుంజిగా వుందన్నా..." అని మంగరాజుకు విన్నవించుకున్నాడు. "సరే ఆ పక్కకే పదండి... దారిబత్తెం సిద్ధం చేసుకోండి" అని ఆర్డరేశాడు అతను.

ఆ మరునాడే కొంత బియ్యం, అంత పప్పు, ఉప్పు, మిరపకాయలు రెండు పాత్రలు ఒక చిన్న సంచిలో వేసుకొని, ఆవుల్ని కదిరప్ప, గొర్రెల్ని కుశాలన్న తోలుకొని బాకరాపేట అడవికి బయలుదేరారు.

మరికొందరు వారితోబాటు, ఆ ఊరినుంచీ చుట్టుపక్కల ఊర్లనుంచీ కూడా పశువుల్ని, గొర్రెల్ని తోలుకొని బయలుదేరారు.

చిన్నగొట్టిఘల్లు దాటుకోగానే ఆవులవాళ్ళంతా ఒక మందగా చేరి ఒకవైపుకు పశువుల్ని తోలుకొని వెళ్ళిపోయారు. గొర్రెల కాపర్లు మాత్రం మరో మందగా చేర్చి గొర్రెల్ని తోలుకొని చుట్టుపక్కల చెరువులు, బీడునేలల్లో గొర్రెల్ని మేపుకుంటూ అడవి మార్గం బట్టి బయలుదేరారు.

బాకరాపేట ఉత్తరంగా కొన్ని మైళ్ళదూరంలో అడవి మొగదల వున్న 'మట్టేవారి పాలెం' ప్రాంతంలో రైతులకు 'మంద' తోలుతున్నారు గొర్రెలవాళ్ళు.

పగలంతా గొర్రెల్ని ఆ ప్రాంతంలో మేపుకుని రాత్రిళ్ళు రైతుల పొలాలలో గుంపుగా మంద తోలడంవల్లా, ఆ రాత్రిళ్ళు గొర్రెలు వేసిన పిసికలువల్లా పొలాలకు మంచి ఎరువు లభిస్తుంది. ధానికి ప్రతిఫలంగా మంద తోలించుకున్న రైతులు రాత్రిపూట గొర్రెలకాపర్లకు కడుపునిండా భోజనం పెడుతుంటారు.

దాసన్నగారి గొర్రెల్ని తోలుకువచ్చిన కుశాలన్న ఆ మందలోనే వున్నాడు.

ఆరోజు ఉదయాన అందరిలాగే కుశాలన్న తన గొర్రెల్ని మందలోనుంచి విడిగా తోలుకొని, వాటిని మేపుకుంటూ 'నెమలిగుండ్ల'వైపు దిగాడు.

ఆ పక్కనే 'బండకొండ', 'ధనికొండ' ఉన్నాయి. ఆ రెండు కొండల మధ్యన ఒక పెద్ద చెరువు. అందులో సగానికి నీళ్ళు ఆ చుట్టుపక్కల పచ్చని పొలాల్తో ఎంతో రమణీయంగా ఉంది అక్కడి ప్రకృతి.

అక్కడ బీళ్ళలో గొర్రెల్ని మేపుకుంటూ వచ్చి మధ్యాహ్నం ఆ చెరువులోనే గొర్రెలకు నీళ్ళు తాపాడు. నీళ్ళు తాగిన గొర్రెలు, ఎండకు ఆ చెరువుకు అవతలవున్న చెట్ల కింద నెమరువేస్తూ పడుకొనివున్నాయి.

అక్కడే ఓ చెట్టుకింద హాయిగా పడుకున్నాడు కుశాలన్న. మరికొందరు తమ గొర్రెల్ని మేపుకుంటూ మరోవైపున చెరువులోకి దిగుతున్నారు.

అక్కడ మడికయ్యల్లో వరిపంట కొద్దిరోజుల ముందే కోసినట్లుంది. అందుకే 'కోలె' సగం ఎండి, సగం చిగురిస్తూ కనిపిస్తోంది. మరికొన్ని కయ్యల్లో అక్కడక్కడా వడ్లు రాల్చేసిన 'వరిగడ్డితాలు' కుప్పలు కనిపిస్తున్నాయి. అలాంటి కొన్ని కుప్పల దగ్గర కొందరు రైతులు ఆ 'తాలు'ను కట్టలుగా కడుతున్నారు. అలాంటి ఒక 'వరితాలు' కుప్ప దగ్గర రైతులు కొందరు తమ రెండు చేతులతో వడ్లు రాల్చేసిన ఆ తాలును ఒక చోట 'కళ్ళం'లో విదిలిస్తున్నారు. మరికొందరు అలా విదిల్చిన వరి తాలును పశువులచేత తొక్కిస్తున్నారు.

ఆ మడికయ్యల్లోకి ఓ బాతు కోళ్ళగుంపు అప్పుడే ప్రవేశించింది.

వాటి శబ్దం విని లేచికూర్చొని ఆ గుంపునే చూస్తున్నాడు కుశాలన్న.

'కోఁవ్ క్కోఁవ్' అంటూ బాతులు హంసల్లా నడుస్తున్నాయి. ఆ మళ్ళలోని వడ్లగింజల్ని, పురుగుల్ని అవి ఏరుకుతింటున్నాయి. వాటివెనక ఒక సన్నటి బర్రెతో వాటిని తోలుకుంటూ ఒక నడివయస్సు స్త్రీ, అదే వయసులో వున్న ఒక మగాడు నడుచుకుంటూ వెళ్తున్నారు.

వారివైపే చూస్తూ ఏదో ఆలోచించుకుంటూ వున్నాడు కుశాలన్న.

అతని కళ్ళముందు ఆ బాతుకోళ్ళు నెమకుతూ రొద చేసుకుంటూ వెడుతున్నా వాటి ధ్యాస మాత్రం అతనికి లేదు. తన బతుకు గురించీ, భార్యా పిల్లల గురించీ, మంగరాజు దగ్గర తీరని అప్పుల గురించీ తీవ్రంగా ఆలోచించుకుంటూ వున్నాడు. పరిస్థితుల ప్రభావంవల్ల మధ్య తరగతినుంచి ఇంకా దిగజారి, తన జీవితం ఎలా జీతగాడి స్థాయికి పడిపోయిందీ తలచుకొని నిర్వేదాన్ని పొందుతున్నాడు.

సమయం చిక్కినప్పుడంతా అదే ఆలోచిస్తుంటాడు. అతనిలో గతం నేర్పిన అనుభవాల మధ్య, భవిష్యత్తును గురించిన ఆందోళనల మధ్య సంఘర్షణ.

పరిష్కారమార్గాల కోసం అంతర్మథనం!

అతని హృదయంలో ఎక్కడో ఏ మూలో దాగివున్న కసి, కోపం...

ఇలా తన పరిస్థితిని గురించి తలుచుకున్నప్పుడంతా అతనికేదో ఆవేశం తన్నుకొస్తుంది. ఆ మరుక్షణమే మళ్లీ నిర్వేదం, నిరాశ, నిస్పృహలు పెల్లుబికి నిర్వీర్యంగా మారిపోతాడు. ఆ తర్వాత ఇది నా కర్మనుకుంటూవుంటాడు కుశాలన్న.

"ఇంట్లో బత్తెమైపోయినాయేమో. గౌరిని దేవకి సక్రమంగా సూసుకుంటావుందో లేదో... ఆ ఈరమ్మ ఆకలి తీరేది కాదు. జెష్టముండ. దానికెవురన్నా అంత కడియేసినారో లేదో? వోడు కొంతేగాలం నా కొడుకు. తల గెరివోడు (తలతిమిరోడు) పాలేటిగాడు సెప్పిన మాటినే రకంగాదు. పిల్లోళ్ళతో గోళీలు, బొంగరాలు ఆడుకుంటా ఉండిపూడిసి యాడ కొంపమీదికి దెచ్చినాడో?"

ఇలా తీవ్రంగా ఆలోచిస్తున్న అతని ఆలోచన్లకు అంతరాయం కలిగిస్తూ ఎవరో పిలిచినట్లనిపిస్తే అటు చూశాడు. ఎదురుగా ఒక కాకీ నిక్కరు మాత్రమే వేసుకుని చేతిలో బాతుకోళ్ళ గుడ్లతో పదేళ్ళ పిల్లవాడు నిలబడివున్నాడు.

అతన్ని చూడగానే ఎప్పుడో చూసినట్లనిపించిందతనికి. ఎక్కడ చూశానా అనుకుంటూ గతాన్ని తోడుకోసాగాడు.

"కుశాలన్నా! నేను?" అన్నాడు ఆ అబ్బాయే మళ్ళీ.

"తనను ఈ పరస్థలంలో పేరు పెట్టి పిలిచేది ఎవురబ్బా" అని ఒక్కక్షణం ఆలోచించాడు కుశాలన్న. అలా ఆలోచించినకొద్దీ సేపటికి చప్పున గుర్తుకొచ్చేసింది.

అతను ఆరునెలల క్రితం తప్పిపోయిన మంగరాజు కొడుకు చిన్రాజు.

చాలారోజులు కావడంతో టక్కున గుర్తు రాలేదు అతనికి.

'వీడు ఇక్కడెందుకున్నాడబ్బా!'

ఒక్కక్షణం అనుమానం, ఆశ్చర్యం రెండూ ఒకేసారి కలిగాయి కుశాలన్నకు. మళ్ళీ అతన్ని చూసి సరిగా పోల్చుకున్నాడు.

"ఏమిరాబ్బా ఈడుండావు? ఏందీ అవతారం?" ఆశ్చర్యంగా అడిగాడు.

"కుశాలన్నా! ఈ బాతుకోళ్ళోళ్లు సన్ను పిల్చుకొచ్చేసినారు"

తను ఎలా ఇల్లు వదలివచ్చిందీ గుర్తుకు తెచ్చుకుంటూ దిగాలుగా చెప్పాడతను.

ఆ మాటతో సరిగ్గా ఆరు నెలల క్రితం దాసన్నగారి సేద్యాలవైపు బాతుకోళ్ళు

తోలుకొచ్చి, వాళ్ళు పదిరోజులపాటు అక్కడే మేపుకున్నదీ, చింతపర్తోని కుంటలో వాళ్ళు గుడారమేసుకున్నదీ అన్నీ గుర్తుకొచ్చాయి కుశాలన్నకు.

"ఏందిరా మెడలో తాయెత్తు. కొప్పుమాదిరితో ఆ జుట్టూ..."

నఖశిఖ పర్యంతం అతన్ని పరిశీలిస్తూ అన్నాడు కుశాలన్న.

"వాళ్ళే నన్ను ఆ మాదిరితో మార్చేసినారు. మీ అమ్మానాయన ఎవురని అడిగితే మాపేర్లేచెప్పు అని కూడా సెప్పినారు"

అమాయకంగా అన్నాడు చిన్రాజు

నాలుగో తరగతిలో అదేపనిగా బట్టీ పెట్టి నేర్చుకున్న తెలుగు పద్యంలా గతమంతా చప్పున గుర్తుకువచ్చి "కుశాలన్నా! నన్నెట్టయినా ఇంటికి తీసకపో... అమ్మను సూడాలనుంది" అంటూ ఏడ్చేశాడు.

బాతుకోళ్ళ దంపతులు ఇదేదీ గమనించడంలేదు.

అందుకే అలా ఏడుస్తున్న చిన్రాజును దగ్గరికి పిలిచి అక్కున చేర్చుకుని "అట్టే తీసకపోతాలే... యాడొద్దు నేనుండాగదా..." అని ఏడుపు మాన్పించి "అసలు వీళ్ళు నిన్ను ఎట్ట ఎత్తుకొచ్చేసినారు? " అని అడిగాడు కుశాలన్న.

జరిగిందంతా పూస గుచ్చినట్టుగా చెప్పాడు చిన్రాజు.

అదంతా విని ఆశ్చర్యపోయాడు కుశాలన్న.

"మీ యమ్మా మీ నాయన నీకోసం ఎంత ఇదయిపోయినారోలే... మీయమ్మయితే ఏడ్చిపడ్చీ సగమైపోయుండాది..." అన్నాడు. ఆమాటవినేసరికి ఇంకా దుఃఖం ముంచుకొచ్చింది చిన్రాజుకు.

"సరే యాడొద్దులే" అంటూ అతన్ని అనునయించి చెర్లో గొర్రెలకు నీళ్ళు తాపుతున్న గంగెద్దలాయనదగ్గరకు అతన్ని తీసుకువచ్చి విషయంచెప్పి గొర్రెల్ని ఆయనకప్పచెప్పాడు

"సరే మల్లెబ్బుడొస్తావయ్యా? " అడిగాడు గంగెద్దులాయన.

"మళ్ళా రేపీయాళకంతా వచ్చేయనా... మీ యింట్లో యేమన్నా సెప్పాల్నా!" అన్నాడు కుశాలన్న.

"సెప్పేదేముందిలే... బాగుండానని సెప్పు... వచ్చేటప్పుడు ఉతికిన గుడ్డలు వొగ జత తీసుకరా చాలు" అన్నాడు గంగెద్దులాయన.

"సరేన్నా! వస్తా!"

అలా అతనిదగ్గర శెలవుతీసుకుని, చిన్రాజును వెంటబెట్టుకుని తిరుపతి రోడ్లోకొచ్చి నిలబడ్డాడు కుశాలన్న పులిచెర్ల బస్సుకోసం ఎదురుచూస్తూ....

## కరువు సీమలో కన్నీటిచార



సెకనుతో ప్రారంభమైన కాలం గంటలు, రోజులు, మాసాల రూపంలో అనంతమైన తన గర్భంలోకి, మరికొన్ని సంవత్సరాలని విలీనం చేసుకుంటూ, మరికొన్ని వసంతాల్ని దాటుకొని వెళ్ళింది.

ఈ మధ్యకాలంలో ఆ ఊర్లో చాలా మార్పు వచ్చింది. సంవత్సరాలు గడుస్తున్నా వర్షపు చినుకే రాలడంలేదు. చెరువులు, గుంటలు ఎండిపోయి నేలతల్లి నెర్రెలు బారింది. ఊటబావుల్లో సైతం జిల్లేళ్ళు మొలిచిపోయాయి.

వ్యవసాయం పూర్తిగా దెబ్బతింది.

అసలిక్కడ కరువురాని సంవత్సరమంటూ చాలా అరుదు. పొరబాటున ఒక సంవత్సరం పంటలు పండితే ఆపైన పదేళ్ళవరకు నీటి చుక్క పడదు.

పిలవకనే వచ్చే అతి ముఖ్య అతిథి ఈనేలకు కరువొక్కటే. ప్రజలకు అతి ముఖ్యమైన శత్రువు కూడా కరువే!

ప్రజలు తిండికోసం నకనకలాడిపోతున్నారు.

పేదలంతా అన్నమో రామచంద్రా అంటూ అలమటించిపోతున్నారు.

తాగడానికి మంచినీళ్ళే కరువైపోయాయి. ఇక వాళ్ళకు పిడికెడు మెతుకులెలా దొరుకుతాయి?

ఈ పరిస్థితిని తట్టుకోలేక చాలామంది రైతులు తమ పశువుల్ని కసాయి కమ్మేసుకుంటున్నారు.

చాలామంది దూరప్రదేశాలకు వలసలు వెళ్ళిపోతున్నారు. కాస్తో కూస్తో డబ్బున్నవాళ్ళు మాత్రం ఏదో ఒక వ్యాపారం చేసుకుందామని తిరుపతి, చిత్తూరువంటి పట్టణాలకు వెళ్ళిపోతున్నారు.

దాసన్నగార్లాంటి భూస్వాములుమాత్రం నిల్వవున్న ధాన్యంతోను, కొనుక్కొచ్చిన ధాన్యంతోను కాలం వెళ్ళబుచ్చుతున్నారు.

గరువులెండిపోయాయి. దొరువులెండిపోయాయి. వాగులు, వంకలు నీరు పారక మూగపోయాయి. చెట్లు, చేమలు ఎండిపోయాయి. మహా వృక్షాలే మోడుబారిపోతున్నాయి. వర్షంకోసం ప్రజలు కడవసాంగేలు, కప్పదేవర్లు, వలసదేవర్లూ ఎన్నోచేశారు. గిరిగెత్తించారు. అయినా వర్షంపడలేదు. వరుణదేవుడికి కరుణే కరువైపోయింది. ఈ రాళ్ళసీమంటే అతనికీ అలుసే. మగవాళ్ళు వలసలు వెళ్ళి తిరిగి రాకపోవడంతోను, వారు పంపే డబ్బులు చాలకపోవడంతోను, సంసారాన్ని ఈదలేక మార్గాంతరంలేని కొందరాడవాళ్ళు వ్యభిచార వృత్తిలోకి దిగిపోయారు. దీన్ని ఆసరాగా తీసుకుని కొందరు ధనవంతులు పేద స్త్రీల జీవితాలతో ఆడుకుంటున్నారు.

స్త్రీ వ్యామోహంవున్న మంగరాజుకు ఇది మంచి అవకాశంగా తోచింది.

దాంతో మామిడితోటలోకి ఆడవాళ్ళను రప్పించుకొని, వారిని వాడుకుని, ఎంతో కొంత డబ్బు, తిండిగింజలు ఇప్పించి పంపిస్తున్నాడు.

ఆ గ్రామంలో మంగరాజుకు తార్పుడుగాళ్ళు కూడా ఏర్పడ్డారు. అతనికి ఆడవాళ్ళను పంపిస్తూ అటు అతనిదగ్గరా, ఇటు ఆడవాళ్ళ దగ్గరా కమీషన్లు దండుకునేవారూ తయారయ్యారు.

ఇలాంటి పరిస్థితిలో కుశాలన్న పరిస్థితి మరీ దారుణంగా తయారయింది.

దాసన్నగారిస్తున్న తిండిగింజలు చాలడంలేదు. ఎక్కువ ధాన్యం, డబ్బులు అడిగితే నీ అప్పుకే దిక్కులేదు. పైగా యిదొకటా' అంటూ మంగరాజు ఎలాంటి సాయమూ చేయడంలేదు. దాంతో ఇంట్లో భార్యాపిల్లలు పస్తులుండాల్సి వస్తోంది.

కుశాలన్నకు ఏం చేయాలో పాలుపోలేదు.

ఆ పని వదిలేయాలని ఎన్నోసార్లు అనుకున్నాడు కూడా. కానీ బాకీ తీర్చేసి వెళ్లమంటాడు మంగరాజు. ఆ బాకీ ఈ జన్మకు తీరేటట్లులేదు.

అలాగే వుంటే సంసారం గడవదు.

ఒకవేళ మానుకున్నా ఎక్కడా పనులు లేవు. ఏం చేయాలి? అందుకే మౌనంగా భరిస్తున్నాడు.

పైగా దాసన్నగారు కరువుకు పశువుల్ని చాలావాటిని అమ్మేశారు. కుశాలన్నకిచ్చే బత్యంకూడా తగ్గించేశాడు.

రానురాను ఇల్లు గడవడం కష్టమైపోతోంది కుశాలన్నకు.

ఒకరోజు దాసన్నగారింట్లో పనిముగించుకొని అక్కడే భోంచేసి రాత్రి ఎనిమిది గంటలకు ఇల్లు చేరిన కుశాలన్నకు ఓ మంచి

సలహా ఇచ్చింది దేవకి.

"ఏమయ్యా! ఈ కరువుల కాలానికి పాలేటిని ఎవురింట్లోనన్నా జీతానికి నిలిపితే బాగుండు... కనీసం వాడయినా కడుపు నిండా అంత తింటే చాలు" అంది.

తనలాగే తన కొడుకును జీతగాడిగా మార్చడానికి కుశాలన్న మనసు విలవిలలాడింది. కానీ గత్యంతరం లేదు.

ఆ రోజు ఉదయాన చిట్టెమ్మ వంటింట్లో ఏదో పనిచేసుకుంటూ వుంది. కుశాలన్న వంటింటి ముందరకి వెళ్లి నిల్చుని 'అమ్మా' అన్నాడు.

వెనక్కి తిరిగి చూసి 'ఏమిటి కుశాలన్నా' అంది సౌమ్యంగా.

"వొగమాటమ్మా"

వినయంగా అడిగాడు. ఉడుకుతున్న వంటపాత్రపైన మూత ఉంచి వచ్చి 'ఏందో చెప్పన్నా' అని అడిగింది.

"కరువుకాలం గదా తల్లీ... మా పిల్లగోన్ని ఎవురింట్లోనన్న పనికి నిలపదామని...."

"చిన్నవయసుగదా"

"అందుకు తగిందేదయినాసరే"

"యాడ బెట్టాలనీ..."

"నీకు తెలిసనోళ్ళెవురయినా వుంటే సూడు తల్లీ..."

"ఆ... సరే... వంటపనివచ్చా? "

"రాదమ్మా... నేర్పిస్తే ఏ పనయినా అట్టే నేర్చుకుంటాడమ్మా..."

"ఇక్కడే కావాలంటే ఎవురూ చేర్చుకోరు. దూరమైతే పరవాలేదా..."

"యాడయినా పరవాలేదమ్మా... నాబిడ్డకు లోటు లేకుండా వుంటేసాలు..."

"బెంగుళూరులో మావాళ్ళ హోటలొకటుంది. అడ్రస్ ఇస్తాను. తెలిసినోళ్ళ నెవ్వర్నయినా తోడంపించి, నామింద చెప్పి పంపు. చేర్చుకుంటారు."

ఆ మాటలకు దేవత దగ్గర వరం పొందిన భక్తుడిలా పొంగిపోయాడు కుశాలన్న.

"సంతోషం తల్లీ... నీమేలు మరవనమ్మా.."

"దాందేముందిలేన్నా"

పక్కగదిలోకి వెళ్ళి ఓ కాగితంలో అడ్రస్ రాసుకొని వచ్చి ఇచ్చింది.

దాన్ని భద్రంగా, వేసుకున్న ఫుల్‌బనీను జేబులో దాచుకున్నాడు. ఆ మరునాడే పాలేటికి రెండు మంచిబట్టలు కుట్టించి, బెంగుళూరు పరిచయమున్న నాగులయ్యను తోడిచ్చి పంపించి కొడుకును అక్కడే చేర్పించేశాడు కుశాలన్న.

ఇది జరిగిన కొద్ది రోజులకే గోరుచుట్టుపైన రోకటి పోటులా మరో సంఘటన జరిగిపోయింది.

ఒకరోజు ఉన్నట్టుండి దాసన్నగారింట్లో దొంగతనం జరిగిపోయింది. చిట్టెమ్మ బొట్టుగొలుసునెవరో దొంగిలించారు!

ఎవరు దొంగిలించారో ఎవరికీ అర్థంకాలేదు.

ఆ సాయంత్రం హాల్లో మధ్యన ఈజీ ఛైర్‌లో వెనక్కి వాలిపోయి ఆలోచిస్తున్నాడు మంగరాజు.

"ఇంతవరకూ ఈ ఇంట్లో దొంగతనం జరిగిందిలేదు. కనీసం మా సేద్యంలో ఒక చిన్న పచ్చి మిరపకాయలాంటిది దొంగతనంగా పోయిందిలేదు. ఆమాటకొస్తే మామిడి తోటల్లో రాలిపోయిన ఒక చిన్న రాలిన పిందెను ఏరుకోవాలన్నా భయపడి చస్తారు జనం. అట్టాంటిది ఈ దినం... అదీ ఈ మంగరాజు భార్య బొట్టుగొలుసే తీసినాడంటే ఇంక వాడెంత గుండెలు దీసిన బంటో వాన్ని ఊరికే వదలగూడదు. వాడి అంతు చూడాల్సిందే. దీన్నిట్లే పోనిస్తే ఈ జీతగాళ్ళే ఏదో ఒకదినం ఇంట్లో వుండే ఇనప్పెట్టెకే ఎసురు బెడతారు" అనుకొని

ఇక్కడ హాజరుకమ్మని అందరికీ కబురంపాడు.

ఆరోజే పెద్దిరెడ్డి ఏదో పనిమీద చిత్తూరుకు వెళ్ళాడు. క్షణంలో అక్కడ ఆ యింటి సభ్యులు, జీతగాళ్ళు అందరూ హాజరైపోయారు.

ఏం జరిగిందో, ఎందుకు పిలిపించాడోనని అందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు.

శూన్యంలోకి చూస్తూ... ఈజీ ఛైర్‌లో వెనక్కీ, ముందుకీ ఊగుతూ దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు మంగరాజు.

"ఏమబ్బా రమ్మన్నావంట? "

అతని ఆలోచనలకు బ్రేక్ వేశాడు కేశవులు.

"ఏంలేదు పనుండే పిల్చినా... అందురూ వచ్చినారా..." అలాగే సమాధానం చెప్పాడు.

"ఏం పనీ? "

అనుమానంగా అడిగాడు నరసింహులు.

"చూస్తావుండండి... తెలస్తాది!"

ఊగడం ఆపి నిశ్చలంగా కూర్చుంటూ అన్నాడు మంగరాజు.

అతని కళ్ళు తీక్షణంగా వున్నాయి.

అతని మెదడు తీవ్రంగా ఆలోచిస్తోంది.

జీతగాళ్ళందరూ అతని ఎదురుగా ఒకవరుసలో నిలబడివున్నారు. వాళ్ళవైపు ఒకసారి సీరియస్‌గా చూశాడు.

జీతగాళ్ళే ఎవరో ఆపని చేసి వుంటారని అతని నమ్మకం.

ఆచూపులు చూసి ఎవరికి మూడిందోననుకుని వారిగుండెలు ఝల్లుమన్నాయి.

"హొరే.. మరేదగా సెప్పండి. పొద్దన్న నా గదిలోకి ఎవురు పోయినారు? " జీతగాళ్ళను చూస్తూ ప్రశ్నించాడు.

అందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు.

భయంభయంగా చూస్తున్నారు.

"మీరే వప్పుకుంటే ఏమీ అనను. ఎవుడు చేసుండేది నాకు బాగా తెలుసు. అది నా నోటితో చెప్పించకండి. ఎవురయిందీ ముందే మరేదగా చెప్పేయండి. బాగుంటుంది"

చేతిలో వున్న చింతబరగల్ని తిప్పుతూ క్రూరంగా చూస్తూ అన్నాడు. ఆ చింత బరగల్ని చూస్తుంటే జీతగాళ్ళ గుండెల్లో తుపాకుల తూటాలు పేలుతున్నట్టుంది.

ఈరోజు ఎవుడి నెత్తిన శనివుందోననుకుంటూ వణికిపోతున్నారు జీతగాళ్ళు. మంగరాజు వెనకాముందూ చూడడు. తప్పు చేసినవాడిని చితగ్గొడతాడు.

అతనిమాటకు ఎవ్వరూ సమాధానం చెప్పలేదు.

అతని కోపం ఎరుపెక్కిన కళ్ళలో ప్రతిబింబిస్తోంది.

"వరే కదిరప్పా! నీకు తెలిసుంటే సెప్పు" గద్దించి అడిగాడు.

"నాకు నాకు తెలీదు సావే"

భయంతో అతని మాటలు తడబడ్డాయి.

"హొరే సాదేవుడూ... నువ్వు చెప్పరా" అన్నాడు.

అతను మౌనంగా తలవంచాడు.

అక్కడే ఒకవైపున్న ఆడవాళ్ళకుగానీ, వారికెదురుగా నిలబడివున్న వారి మగవాళ్ళకు గానీ, పిల్లలకుగానీ, ఏం జరిగిందో, మంగరాజు ఎందుకలా వాళ్ళను అడుగుతున్నాడో ఎవరికీ తెలీడంలేదు. ఒక్క చిట్టెమ్మకు తప్ప.

"ఏం జరిగిందబ్బా? "

ఆత్రుత భరించలేక అన్నాడు కేశవులు.

"మీ వదిన బొట్టు చైను పోయింది."

అసలు విషయం చెప్పాడు.

ఆమాటకు అక్కడున్న వారందరూ ఒకరిముఖాలు ఒకరు చూసుకోసాగారు.

చివరగా మంగరాజు కుశాలన్ననూ అడిగాడు.

"హొరే కుశాలగా! నువ్వు చెప్పు బొట్టు గొలుసు ఎవురు తీసినారు? "

"నాకు తెలీదు"

హృదయంలోని భయాన్ని అణుచుకుంటూ చెప్పాడు కుశాలన్న.

"ఈ ఇంటికి పెద్ద జీతగాడివి... నువ్వే

చెప్పు"

తన రెండు చేతుల్లో చింతబరగల్ని మెలి తిప్పుతూ పైకి లేచాడు మంగరాజు.

"ఈ దెబ్బతో కుశాలన్నగోడు అయిపాయ" అనుకున్నారందరూ.

"మరేదగా సెప్పరా దొంగనా కొడకా?"

అతని కంఠంలో క్రూరత్వం ధ్వనించింది.

"నంగనాచి మాదిరుండి ఎంతపని చేసినాడు. నమ్మించి మోసం జేయడమంటే ఇదేనేమో"

ఆయింటి ఆడంగులు చెవులు కొరుక్కున్నారు.

"సెప్పరా?"

అతని మౌనాన్ని చూసి రెట్టించి అడిగాడు మంగరాజు.

"నేను తియ్యలేదన్నా... నాకేం తెలీదు" భయంతో లోలోపలే వణికిపోతూ అన్నాడు కుశాలన్న.

"ఆ గదిలోకి పోయేది మామూలుగా నువ్వే... ఆ మాటకొస్తే ఈ యింట్లో చనువుగా తిరిగేది నువ్వొక్కడే... యింకెవ్వరూ పోరు. నువ్వే తీసుంటావు. సెప్పు... ఎక్కడ బెట్నావు నగ?"

నిలదీసినట్లు అడిగాడు.

భరించరానంత అవమానం వేసింది కుశాలన్నకు.

'ఎంత దారిద్ర్యాన్నయినా అనుభవించాడు గానీ... మిల్లులో సంచులు తప్ప ఏనాడూ దొంగతనం చేసి ఎరుగడు తను. పస్తులయినా వున్నాడుగ్గానీ దొంగతనం చేయాలన్న తలంపుకూడా కలగలేదు తనకి. అలాంటిది ఈనాడు తనకు దొంగతనం అంటగట్టారుగదా! యిప్పుడేం చేయాలి. తను నిర్దోషినని ఎట్లా నిరూపించుకోవాలి?'

కుమిలిపోతూ ఆలోచించాడు. కానీ అతనికి ఏ మార్గమూ కనిపించలేదు. అందుకే మౌనంగా తల దించేసుకుని వుండిపోయాడు.

క్రమంగా అతని కళ్ళు నీళ్ళని నింపుకుంటున్నాయి.

"చెప్పరా... నువ్వే ఎత్తేసినావా? లేదా యింగెవురయినా తీసినారా? అదయినా చెప్పు"

రెట్టించిన కోపంతో అన్నాడు మంగరాజు.

"నాకేమీ తెలీదన్నా!"

తల వంచుకునే సమాధానం చెప్పాడు.

తనపైన పడ్డ ఈ అపనిందకు అతని కడుపులో కత్తులు కవాతు చేస్తున్నట్లు బాధ.

అలా తల దించుకుని సమాధానం చెబుతున్నందుకు భరించలేకపోయాడు మంగరాజు.

"సెప్పరా?"

పళ్ళు పటపటలాడించాడు.

"తెలీదు"

స్థిరంగా చెప్పాడతను.

దాంతో పేట్రేగిపోయాడు మంగరాజు. అంతే ఛెళ్ళున ఒక్కదెబ్బ కొట్టాడు. అతని చేతిలోని చింతబరగ క్షణంలో కుశాలన్న శరీరాన్ని చుట్టి వచ్చేసింది. ఆ దెబ్బకు 'అబ్బా' అంటూ కిందపడ్డాడు కుశాలన్న.

అందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు.

"దొంగముండా కొడుక్కి అదే తగినశాస్తి"

"నమ్మకంగా వుండి ఎంతపని చేసినాడో సూడు"

"కాలం అట్టయిపోయుండాది. ఎవుర్ని నమ్మాలో ఎవుర్ని నమ్మకూడదో తెలీల"

"వయసుకొచ్చిన కూతురుండాదిగదా... దానికోసం చేసినట్టుండాదిలే" అని కొందరనుకున్నారు.

"అయ్యో పాపం. కుశాలగాడు. అలాంటోడు గాదే"

"ఎంతో కుశాలగా వోడిపని వోడు చేసుకోనిపోతుండె... అట్టాటివోడి కెంత కష్టమొచ్చా"

"అబమూ సుబమూ ఏమీ తెలుసు కోలా... ఆయప్పకొట్టింది కొట్టిందే"

"నిజం తెలుసుకోకనే కొడతాడా ఏందీ... అట్ట గుమాని (అనుమానంతో) పట్టి కొట్టే దానికి ఆయప్ప సామాన్యుడా ఏమీ" అని మరికొందరనుకున్నారు.

ఆ సంఘటనకు కొందరు మనసులోనే ఆనందపడిపోతే మరికొందరు లోలోపలే మధనపడ్డారు.

మంగరాజు ఇవేవీ గమనించడంలేదు.

మేకపోతుపైన పడ్డ రేసుకుక్కలా విజృంభించాడు. చింతబరగలతో జాడిస్తున్నాడు.

"అయ్యో సాఁవీ... నేతియ్యలేదయ్య. నన్ను సంపొద్దు. బిడ్లోన్ని సాఁవీ... నాకేమీ తెలీదు"

గింజుకుంటున్నాడు కుశాలన్న.

దెబ్బదెబ్బకు నేలపైన దొర్లుతున్నాడు.

ఆయాసపడిపోతున్నాడు.

గిలగిలలాడిపోతున్నాడు.

అయినా అతను వదల్లేదు. కొడుతూనే వున్నాడు.

"నీయమ్మా దొంగలంజకొడకా... నా బిడ్డను తిరిగి తీసుకొచ్చినావని నీకు చనువిస్తే నగ దొంగతనం చేస్తావా... ఇంకయినా సెప్పరా. నగ తీసినావా లేదా? "

ఆకలిగొన్నవ్యాఘ్రంలా ఆవేశపడిపోయాడు.

ఆ దెబ్బలకు కుశాలన్న వేసుకున్న గాడా బాడీగుడ్డ తునాతునకలై వేలాడుతోంది. ఆ పీలికల్లోనుంచీ వాతలు రక్తం వోడుతూ పచ్చిగా కనిపిస్తున్నాయి.

దెబ్బ దెబ్బకు అతను మెలికలు తిరిగిపోతున్నాడు. అయినా పైకి లేచాడు.

"సాఁవీ... నేను తప్పు సేయలేదు. నన్ను సంపినా నిజమంతే. నేను తప్పు సేయలేదు. నన్నొదిలేయండి" అందరివైపు నడుస్తూ చేతులు జోడించి వేడుకుంటున్నాడు. అయినా మంగరాజు అతన్ని వదలలేదు.

"నేనెప్పుడయినా తప్పు సేసినానా సెప్పండన్నా అమ్మా సెప్పండి తల్లీ"

అతిదీనంగా అర్థిస్తున్నాడు.

ఎవ్వరూ అతని మాటలకు సమాధానం చెప్పలేదు. ఎవ్వరూ ఆ ఘోరకలిని ఆపే యత్నమూ చేయలేదు. కానీ అతని దుస్థితికి చలించిపోయింది ఒక్క చిట్టెమ్మే. అతను అలాంటి పని చేయలేడని తెలిసిందీ, గుర్తించిందీ ఆమె ఒకర్తే. ఆమెలో అంతవరకూ అంతర్గతంగా వున్న కరుణ, జాలి, కొడుకుని తిరిగి తెచ్చినాడన్న కృతజ్ఞతా ఒక్కసారిగా పెల్లుబికాయి. అదే స్థాయిలో మరోవైపు మొదటిసారిగా భర్తపైన కోపమూ, అసహ్యమూ తన్నుకొచ్చాయి.

"అమ్మా... చిట్టెమ్మ తల్లీ! నువ్వయినా చెప్పమ్మా. నేను నిప్పులాంటోన్నమ్మా. నీ నగ నేను తియ్యలేదు తల్లీ"

చేతులెత్తి ప్రార్థించాడు.

మళ్ళీ కొట్టడానికి చింతబరగలు పైకెత్తాడు మంగరాజు.

అదే సమయంలో "ఆపండి" అంటూ ఆవేశంతో ఊగిపోయింది చిట్టెమ్మ.

అందరూ ఆమెనే చూస్తున్నారు.

"ఆయన్నెందుకట్ల సంపుతారు. మీరు మనుషులా రాక్షసులా? అంతగా సంపాలనివుంటే ఒక్కసారిగా గొంతు పిసికి సంపేయండి. ఇట్ల గొడ్డును బాదినట్లు బాదకండి. మేం చూళ్ళేం. పైగా ఆయన దొంగతనం చేసినాడో లేదో తెలీదు. చేసినట్లు ఏ ఆధారమూ లేదు. పైగా మనం పోయినాడనుకున్న బిడ్డనె తెచ్చిచ్చినోడు. అది గూడా గమనించకుండా అట్లా సంపుతారెందుకు? నగ పోయిందని మీతో చెప్పడం బుద్ధి తక్కువైంది. అంతగా పోతే పోయిందిలే. మా అమ్మగారిచ్చిందేలే. నాకేం బాధలేదు"

అతని చేతిలోని చింతబరగల్ని లాగేసుకుంది. అప్పటికే అవి కొట్టి కొట్టి తుంపర తుంపరగా మారివున్నాయి.

"ఏమయ్యా. మీరంతా మనుషులేగదా...

చూస్తూ ఊరికే ఉండారే"అందర్నీ ఉద్దేశించి అంది.

అందరూ తలలు వంచుకున్నారు.

ఆమె కళ్ళు కోపంతో నిప్పులు కక్కుతు న్నాయి. ఎప్పుడూ గంభీరంగా, నిర్మలంగా కనిపించే ఆమె వదనం ఆవేళ మండుతున్న అగ్నిగోళంలా జేవురించుకొని వుంది. ఆ స్థితిలో ఆమె ముఖంలోకి ఎవ్వరూ చూడలేకపోయారు. ఎదురుమాట అనలేకపో



యారు. చివరికి మంగరాజు కూడా ఆమె చూపులకి తట్టుకోలేకపోయాడు.

"య్యోవ్! కుశాలన్నా నువ్వు పోయ్యా ఇక్కన్నుంచీ"

ఆవేశంగా అరిచినట్టంది. మహాతల్లీ నూరేళ్లు బతుకు అనుకుంటూ కళ్ళ నీళ్ళతో కాళ్ళీడ్చు కుంటూ రెండడుగులు వేశాడు. అంతే మళ్ళీ ఆగిపోయాడు.

"తాగినోడు మొగుడు గాదు. తాటిచెట్టు నెలవు గాదు- ఓ రెరికిలీ తగులుకున్నోడు దేవుడుగాదురో..." అన్న పాట వినిపించింది.

అందరూ ఆ పాట వినిపించినవైపే చూస్తున్నారు.



"హయ్. యాడే యానాది. యాడమ్మి నీ మొగుడు.

తాడి చెట్లల్లోనా తగులుకున్నాడా... ఈత చెట్లుల్లోనా ఇరుక్కున్నాడా. యాడే యానాది యాడమ్మి నీ మొగుడు"

పీకలదాకా తాగి పాట పాడుకుంటూ గుమ్మంలో అప్పుడే అడుగుపెట్టాడు అప్పిగాడు.

అక్కడ అందర్నీ చూసి ఖంగుతిని మళ్ళీ వెనక్కి ఒకడుగువేసి అటుతిరిగి "అక్కడే... అక్కడే ఉండండి" అన్నాడు చేతులతో సంజ్ఞచేస్తూ.

గుమ్మానికవతల ఇంకా ఎవ్వరో వున్నట్లు అతని చేష్టలబట్టే తెలుస్తోంది.

ఆ స్థితిలో అతన్ని చూసిన చిట్టెమ్మకు వళ్లు మండింది.

"ఏమి అప్పీ! తాగేసొచ్చినావా? యాడిది నీకు దుడ్డు. నిజం సెప్పు" నిలదీసింది.

చిట్టెమ్మంటే అందరికీ గౌరవమే. అదేవిధంగా అప్పిగాడికీ ఆమంటే అభిమానం గౌరవం. అతని దృష్టిలో ఆమె ఇంటిని చక్కదిద్దే దేవత. పైగా ఏ పనీపాటా చేయకుండా ఏ సమయానికి పోయినా అతనికి విసుక్కోకుండా ప్రేమతో భోజనం పెడుతుంది. అందుకే ఎవరిముందర అబద్ధం చెప్పినా ఆమెకు మాత్రం నిజమే చెబుతుంటాడు.

"అయ్యో వదినా. తప్పయిపోయింది. సెమించెయ్"

ఆమె కాళ్ళపైన పడ్డాడు.

ఆమె పక్కకు తప్పుకుంది.

"అతను తూలుతూ పైకి లేచాడు.

"నిజం సెప్పేస్తను. ఏమీ అనుకోవద్దు" అని ఒక్కసారి వెనక్కి తిరిగి గుమ్మంలో నుంచి వీధివైపుకు తొంగిచూసి మళ్ళీ సైగ చేశాడు.

"ఎవరక్కడ... రమ్మను"

గద్దించినట్లంది చిట్టెమ్మ.

"ఊc సరే...." అని మళ్ళీ అటుతిరిగి "హారే... ఇంక రండీ" అని కేకేశాడు. ఆ మాటలతో పూలమాలల్తో మధు, పాటూరి పాపయ్య కూతురు గుమ్మంలోకి అడుగుపెట్టారు.

అందరూ ఆశ్చర్యంగా వారినే చూస్తున్నారు.

"హొదినా... ఈడు మన మధుగోడు. ఇద్దో... సిన్నాయనా! ఈ పాటూరోళ్ళాయమ్మిని ప్రేమించినాను. పెద్దోళ్లు వప్పుకోరు. మాకు నువ్వున్నా ముందుండి పెండ్లి సెయ్యవా అని యేడిసినాడు. నిజ్జంగా సెప్తాండా. నాకు బలేయిదయి పూడిసింది. నా మొనుసు కరిగిపోయింది. రాయి కరిగిపోయినట్లు కరిగిపోయిందనుకో. సత్తె పెమాణకంగా నాకు జాలేసింది. ఏదో వయసుపిల్లకాయలుగదా ఒగిట్లైపోయినారు. పోనీలే పెండ్లి చేసేద్దాం. వోళ్ళ ముచ్చటా, మునాస తీరిపోతుంది. నాకెట్టా పెండ్లీ పెటాకులు లేవుగదా. వోళ్ళిద్దరికయినా చేసేద్దాం అనుకున్నా... చత్! నా బిడ్డయితే హొగటా. అన్న బిడ్డయితే హొగిటా అనుకోని పెండ్లి చేస్తానని మాటిచ్చేసినా. మరి డబ్బులు గావాలగదా... అందుకనీ"

మధ్యలో ఆగి ఆమె ముఖంలోకి చూశాడు.

"అందుకనీ..."

ఆమె రెట్టించింది.

"నీ బొట్టు గొలుసు ఎత్తకపొయ్యి... కుదవబెట్టి దుడ్డు తీసుకోని వీళ్ళకుగుళ్ళో పెండ్లి జేసినా... నిజం సెప్పొద్దా... మిగిలిందాంతో తా...గొ...చ్చి...నా"

నత్తినత్తిగా నీళ్ళు నములుతూ నిజం నింపాదిగా చెప్పాడు, చావుకబురు చల్లగా చెప్పినట్టు.

ఆ నవదంపతులు అప్పటికే ఆమె పాదాలపైకి వంగివున్నారు. అప్పిగాడి మాటతో అందరి తలలు మరోసారి అవమానంతో నేలకు వంగాయి.

ఆ నవదంపతుల్ని ఆశీర్వదించి గుండెకు హత్తుకుంది చిట్టెమ్మ.

"ఎంతపని జేస్తివిరా ముండాకొడకా. నలుగుర్లో తల దించుకునేట్టు చేస్తివే. మన పగోడి బిడ్డెను తొడక్కొస్తివిగదరా" ఆవేశప డిపోయాడు కేశవులు.

"పగలుంటే పెద్దోళ్లు పెద్దోళ్లు చూసు కోండి. మేం ప్రేమించుకున్నాం పెండ్లి చేసు కున్నాం అంతే!"

ధైర్యంగా తండ్రికి సమాధానం చెప్పాడు మధు.

ఆ మాటతో ఇంకా రెచ్చిపోయాడు కేశ వులు.

"లమ్డీకొడకా నలుగుర్లో నగుబాటు చేసింది సాలక ఇంకా బొక్క తెరుస్తావా? నరికేస్తాన్‌రా ముదాలినాకొడకా" చేయి చాచి ముందుకొచ్చాడు.

"అన్నా! నువ్వుండు. వాళ్ళేం కాని పనిచె య్‌లా... మంచిపనే చేసినారు. ఏ కారనం లేకుండానే ఎన్నో తరాలనుంచీ వస్తావుండే ఇరువర్గాల పగలు, కక్షలు దీనితోనైనా మాసిపోతాయి. వొరే నాయనా. మీరు లోపల పోండ్రా..." అంది చిట్టెమ్మ.

"చిట్టీ! మరి" అంటూ భర్త ఇంకా ఏదో చెప్పబోయాడు.

"మీరూరుకోండి. ఇందాకా చేసిన నిర్వాకం సాలుగానీ" అతనికి అడ్డు చెప్పింది చిట్టెమ్మ.

అటు భార్యకు ఎదురు చెప్పలేక, ఇటు అనవసరంగా కుశాలన్నను చితక బాదినం దుకు అవమానంతో తలెత్తుకోలేక తలవం చుకొని గబగబ తన గదిలోకి వెళ్ళిపో యాడు మంగరాజు.

మధు తన భార్యను తీసుకుని వారి గది వైపు వెళ్ళిపోయాడు. ఆ తర్వాత ఒక్కరొ క్కరే ఎవరి గదుల్లోకి వారు వెళ్ళిపోయారు.

చివర తన రెండు చేతులూ జోడించి చిట్టెమ్మకు నమస్కారం చేసి అక్కడినుంచి వచ్చేశాడు కుశాలన్న.

వచ్చేశాడేగానీ అతని మనసు మనసులో లేదు.

చేయని దొంగతనానికి దొంగ అనిపించు కుని దెబ్బతిన్నాడు. ఆ తర్వాత దొంగ కాదని నిరూపించబడ్డా అవమానభారం అతన్ని నిలువునా దహించివేస్తోంది. ఇన్ని రోజులూ ఇంట్లో మనిషిలా వున్నా తనను నమ్మలేదే అన్న భావం అతన్ని మరింత కుంగదీసింది.

ఇంటికి వెళ్ళాడు. ఇంట్లో కూర్చున్నా నిల బడినా ఆ సంఘటనే గుర్తుకువస్తోంది. పడుకున్నా కంటికి కునుకు రావడంలేదు. బుర్రను కుమ్మరి పురుగులా తొలిచేస్తోంది. ఒకటే తపన.

"ఈ బాధ తగ్గాలంటే ఏం చేయాలి. ఏదో చేయాలి. చేసెయ్యాలి. లేకుంటే తట్టుకో వడం కష్టం. ఏం చేయాలి? " తనను తాను ప్రశ్నించుకున్నాడు.

"ఇలాంటి తట్టుకోలేని బాధ కలిగినప్పుడు చాలామంది అనుసరించే మార్గం ఒక్కటే. ఆ మార్గమే తనకూ శరణ్యం అనుకున్నాడు. అనుకోవడమే ఆలస్యం. పైకి లేచి ఇంట్లో మూలవున్న ట్రంకుపెట్టె తెరిచాడు. అందులో ఓ డబ్బాలో భద్రంగా దాచుకున్న డబ్బుల్ని తీసుకున్నాడు.

గుమ్మంలో కూర్చొని బియ్యపునూకల్లో రాళ్ళేరుకుంటున్న దేవకి "ఎందుకయ్యా డబ్బాలో చిల్లరంతా ఎత్తుకున్నావ్" అంది.

కానీ కుశాలన్న ఏమీ సమాధానం చెప్ప లేదు.

మౌనంగా తుండుగుడ్డను భుజానేసుకుని పులిచెర్ల బాట పట్టాడు. అలా నడుచు కుంటూ వెళ్ళి బొజ్జన్న సారా అంగట్లో కూర్చున్నాడు. అక్కడికి రావడం జీవితంలో అదే మొదటిసారి. అయినా అతను సిగ్గుప డలేదు. తన బాధ తగ్గాలంటే తాగక తప్ప దనుకున్నాడు. బొజ్జన్న గ్లాసందించాడు.

కుశాలన్న డబ్బిచ్చి పీకల్దాకా తాగాడు. ఆ తర్వాత మెల్లగా ఇల్లు చేరుకున్నాడు.

ఆ స్థితిలో ఇంటికి చేరిన కుశాలన్నను చూసి, గౌరి, దేవకి కుళ్ళి కుళ్ళి ఏడ్చారు.

## కవ్వించే "కంపెనీ"



"ఏం కనకమ్మత్తా! యట్టుండాది యాపారం? "

నడుమలెత్తు తిన్నెపైన మండుతున్న పొయ్యిమీద దోసెలు కాల్చుతూ నిలబడి వున్న వెంకటలచ్చి అందాల్ని చూస్తూ అన్నాడు లారీ డ్రైవర్ మల్లేశు.

ఆ పక్కనే ఓ బెంచీ చివర్న కూచుని వుంది తాంబూలం నములుస్తూ యాభై ఏళ్ళ కనకమ్మ.

"మీలాంటోళ్ళు ఇక్కడికి వచ్చేంతవరకూ నా యాపారం బాగుంటుంది లేరా అల్లుడా!

వయ్యారంగా చెప్పింది.

"ఒసే ఎంకటలచ్చిమీ... రెండు పుల్లింట్లు, రెండు దోసిలు పెట్టమ్మీ..."

అప్పుడే అక్కడికి వచ్చిన సైదులు, పుర మాయిస్తూ ఆ బెంచీపైనే కూర్చున్నాడు.

అప్పటికే మరోవైపున్న అరుగుమీద కూర్చొని ఎవరో టిఫిన్ చేస్తున్నారు. మరో కతను వారికి కొంతదూరంలో కూచొని రెడ్డమ్మకు తాంబూలం అందిస్తూ ఆమె వేలికున్న సున్నం తను అందుకుంటూ సరసంగా గుసగుసగా ఆమె చెవిలో ఏదో చెబుతున్నాడు.

"ఏందత్తా! కొత్త సరుకేదయినా దిగిందా!"

వెంకటలచ్చిమి అందిచ్చిన టిఫిన్ అందుకుంటూ అడిగాడు మల్లేశు.

"నువ్వు కావాలంటే దింపుతా!"

బయటిదా? ఊర్లోటిదా? "

నర్మగర్భితంగా అడిగాడు సైదులు.

"బయటిదయినా సరే. ఊర్లోటిదయినా సరే... కావాలంటే దించుతా"

"ఎంతో? "

"ఎంతయితే ఏముందల్లుడా... కొత్తసరుకు దొరకడం గొప్పగానీ"

"ఇప్పుడు రెడీనా... లేదా సందేళనా"

"సందేళ సందికి రప్పిస్తా"

"ఊర్లోటిదో బయటిదో నాకు తెలీదత్తా. రేపు డ్యూటీ ఎక్కాల. టైములా... రేతిరికే సూడు... అన్నంతినేసి వచ్చేస్తా"

ఆశగా అన్నాడు మల్లేశు.

"ఇందాయ్యాసామీ నాస్తా" అంటూ ప్లేటులో రెండు పుల్లింట్లు, రెండు దోసెలు, కాసింత చట్నీవేసి సైదులుకు అందిస్తూ అంది వెంకటలచ్చి

"ఎంత ప్రేమగా ఇస్తుండావే వెంకటలచ్చి!"

అంటూ ఆమె ఎత్తుపల్లాలను చూస్తూజోకువేసి అందుకున్నాడు సైదులు.

ఆమాటకు గుమ్మనంగా సిగ్గుపడింది వెంకటలచ్చి

"వొరే మల్లేశా! లెక్కదండిగా తీసకరారా నాబట్టా!" అంది కనకమ్మ.

"దండిగా అంటే ఎంత? " సందేహంగా అడిగాడు మల్లేశు.

"మామూలుకన్నా కొంచెం జాస్తి. అంతే"

"సరేలే అత్తా! మంచి సరుకును నువ్వు జూడు. నీలెక్క నేను గమనించుకుంటా"

టిఫిన్ ఖాళీచేసి చేయికడుక్కుంటూ అన్నాడు మల్లేశు. అది కనకమ్మ కంపెనీ!

ఆ ఊర్లోనే కాదు. చుట్టుపక్కల ఆమడ దూరం వరకూ కనకమ్మన్నా, 'కనకమ్మ

కంపెనీ' అన్నా తెలియని వాళ్ళుండరు."

ఏదిక్కూలేని వయసులోవున్న ఆడపిల్లలకు కనకమ్మ ఆత్మబంధువు. ముఖ్యంగా వళ్ళమ్ముకుని జీవించే యువతులకు కనకమ్మ అమ్మలాంటిది. తన నీడన చేరిన ఆడవాళ్ళకు విటుల్ని సమకూరుస్తూ ఆ డబ్బుతో వారిని పోషిస్తూ తన పోషణను చూసుకుంటుంది కనకమ్మ. రైల్వే స్టేషన్‌కు పోయేదారిలో ఎడమపక్కనే కనకమ్మ ఇల్లు. అది బోదతో కప్పిన పొడుగాటి కొట్టం. అది రెండు భాగాలుగా వుంటుంది. రోడ్డువైపుకున్న భాగంలో ఒకవైపున ఎప్పుడూ దోసెలు కాలుతుంటాయి. ఇడ్లీలు, పుల్లింట్లు దిగుతుంటాయి. మరోవైపున అమ్మాయిలకోసం వచ్చే మగరాయుళ్ళు బెంచీపైన కూర్చొని అక్కడే టిఫిన్ చేస్తుంటారు. వాళ్ళకు నాస్టాలు సమకూర్చడం, వారి శరీరాలకు బేరసారాలు కుదరడం అన్నీ అక్కడే జరుగుతుంటాయి. మరోవైపున ఒక అరుగు.

అది పేరుకు హోటల్ అయినా దాని ఉపయోగం మాత్రం అదికాదు. విటుల్ని ఆకర్షించడానికి అదొక మిష. యాభై సంవత్సరాల కనకమ్మ తాంబూలం నములుతూ, దాని ముందరే కూర్చొని వుంటుంది. వెనకవైపునున్న రెండో భాగంలో నులకమంచం, దానిపక్కనే నీళ్లకుండా, దానిపైనున్న మూకుటిమీద ఒక గ్లాసు అందులోనే తలుపు మూల ఒకపాత తుంగచాప, దుప్పటి, ఒక దిండు, అక్కడే విటులు తమ కోరికల్ని తీర్చేసుకుంటూ వుంటారు. అలాంటివారికదే ఫైవ్‌స్టార్ హోటల్‌గది.

అక్కడ ఎన్నిమల్లెపూలు సుతిమెత్తగా నలిగిపోయాయో, ఎందరి అభాగ్యుల జీవితాలు ఎన్నిసార్లు తాకట్టు పడ్డాయో, ఎందరి ఆడవాళ్ళ శీలాలు హత్య చేయబడ్డాయో అన్నింటికీ ఆ నులకమంచం, మూలనున్న ఆ తుంగ చాపే సాక్షులు.

కొత్త రుచులకు అలవాటుపడ్డ పల్లెల్లోని ఫామిలీ లేడీస్, బతుకు గడవక, తమ శీలాన్నే తూకం వేసి అమ్ముకుని తమ ఆర్థిక ఇబ్బందులు తీర్చుకోవాలనుకునే సంసారవతులు అక్కడే... చీకటి తప్పు చేస్తుంటారు.

మగడి చాటున తప్పు చేసే పతివ్రతలకు, బతుకుపోరాటం సలిపి, పతితలుగా ముద్ర పడ్డ అభాగ్యులకు అందరికీ అదే నెలవు.

ఈ మధ్య కరువు పుణ్యమా అని కనకమ్మ కంపెనీ మూడుపువ్వులు ఆరుకాయలుగా, పన్నెండు రోగాలు ఇరవై నాలుగు ఇంజక్షన్లుగా విలసిల్లుతోంది.

ఆ చుట్టుపక్కల వ్యభిచారులంతా అక్కడ చేరిపోతుంటారు. వారందరూ కూటికి కరువైన వాళ్ళే వారిదో ప్రపంచం.

తమకు ధరకట్టే షరాబుల్ని తప్ప లోకుల్ని వాళ్ళు పట్టించుకోరు. తమ కడుపు మంటల్ని తప్ప మరిదేన్నీ ఖాతరు చేయరు.

స్టేషన్‌కు, రోడ్డుకు మధ్యన ఆ యిల్లు తప్ప వేరే ఇండ్లు ఏవీ లేకపోవడంతో వారి వ్యాపారం సజావుగా సాగిపోతోంది.

ఎక్కడ తిరునాళ్ళు జరిగినా, ఉత్సవాలు జరిగినా వాళ్ళు అక్కడికే వెళ్ళి విటుల్ని ఆకర్షిస్తుంటారు.

ఆదివారం సంతరోజునయితే నిత్యశ్రమతో అలసి కొత్తసుఖాన్ని కోరుకునే శ్రమజీవులు, చిల్లర మల్లరజులాయి వెధవలు, చిన్నపాటి వీధి రౌడీలు, తాగుబోతులు అక్కడ చేరిపోతుంటారు.

పదినిముషాల పడక సుఖంకోసం ఎగబడే యువకుల ఈలసైగలు, దొరచూపులు, ఆ కంపెనీ అమ్మాయిల కిలకిలలు, కవ్వింపులతో ఆ యిల్లు కళకళలాడుతుంటుంది.

ఇదంతా ఇంత విచ్చలవిడిగా జరుగుతున్నా ఎవ్వరూ పట్టించుకోరు. అందుకే అడ్డూ ఆపూలేకుండా అక్కడ వ్యభిచారం సాగిపోతూనే వుంటుంది.

అక్కడ కూర్చొని బాతాఖానీ కొడుతూ అప్పుడే టిఫెన్ చేయడం ముగించిన

మల్లేశు, వెనకదారిగుండా, గోడవారగా ఓ మనిషి రావడం చూశాడు.

"ఆ వీడెవుడో ఎనకదారిగుండా వస్తావుం డాడే... అంటే ఇందాక లోపల... ఆ అర్థ మైపోయింది. లోపల ఎవురో కొత్తమడిసి దిగిందన్నమాట"

ఆ ఆలోచన రాగానే మల్లేశు మనసు కొటకరించింది. ఇంతలో వెనుకవైపు భాగం లోని గుమ్మంలో చప్పుడయితే అటు చూశాడు మల్లేశు.

సగం తెరచిన తలుపుకానుకొని ముఖం మాత్రం కనిపించేటట్లు చూస్తూ కనిపిం చిందో స్త్రీ.

"అత్తా! ఎవురదీ... వసే నీ యిత్తగిల్లా... ఇంతసేపూ సెప్పనేలేదే" ఆమెవైపు ఆశగా చూస్తూ అడిగాడు.

"యాడనో జూసినట్టుండాదే ఈ ముఖాన్ని" అనుమానంగా తనలో తనే గొణుక్కున్నాడు సైదులు.

"కొత్త సరుకురా కొడకా! మంచి బేర మొస్తే చెబుదామనీ" సాగదీస్తూ అంది కన కమ్మ.

"వాసే నీ యబ్బడాలా... అబ్బుడికి మేము అల్లాటప్పా అనుకుంటివా ఏందే ముసిల్దానా..." కోపంగా అన్నాడు మల్లేశు.

"వారే మిడిమేళపోడా... అంత మాటనా ద్దువాయ్.. పురుగులు పడిపోతావ్? "

"లేకుంటే మాకుగదే ఇట్టాంటివి ముందు జెప్పాల... ఏమత్తవే నీవు? " నిలదీసినట్టు అడిగాడు సైదులు.

"సర్లేవాయ్. యీడ అట్ట కూసుంటానే రారా ముండనా బట్టా... అల్లుడా... అని వక్కాకుపెట్టి పిలవాల్సిందా నిన్ను..."

వెటకారంగా అంది కనకమ్మ.

ఎదుటి యువకుల్ని అలా తిడుతూ పల కరించడం కనకమ్మ అలవాటు... అలాగే యువకులు ఆమెను అలాంటి మాటల్తోనే పలుకరిస్తుంటారు. నిజానికి అవి తిట్లు కాదు.

అలాంటిచోట అలాంటి మాటలతో సంభాషించుకోవడం సహజం.

దోసెలు వేస్తున్న వెంకటలచ్చి ఆపక్కనే వున్న చిన్నీ ఆ మాటకు ముసిముసిగా నవ్వుకుంటున్నారు.

ఇంతలో సైదులు టిఫెన్ చేయడం ముగించాడు.

"సర్లే జెప్పూ... పొమ్మంటావా? "

ఆశగా అడిగాడు మల్లేశు.

"అబ్బ. ఈనా బట్టకు ఎప్పుడూ తొందరే. బేవార్సు నాయాల ఉండు"

"అత్తా! ఎంతే..."

"యాభై!"

"అందులో నీకెంత? "

"అందులో నాకులేదు. నాకు సపరేటుగా పదిచ్చుకోవాల్సా... ముదాలే"

"అంతెందుకే నీకు? "

"ఈ ముసిలిముండా బతకొద్దంట్రా నీ పదీ యాడికవుతాది. ఇద్దో దీ వక్కాకు ఖర్చుకు సాల్దు"

"నేనింకా డ్యూటీ ఎక్కలేదే"

తనదగ్గర సమయానికి అంత డబ్బు లేక పోవడంతో నిరాశగా అన్నాడు మల్లేశు.

"అట్టాంటోడివి నోరు మూసుకోనుండక బేరాలెందుకు నాయాల" పొగాకు ముక్కను నోట్లో వేసుకుని నములుతూ అంది కనకమ్మ.

"అట్ట బెట్టుగెడ్డి"

సీరియస్‌గా అన్నాడు సైదులు.

"ఏం సైదూ... నీ దగ్గరుంటే సూడరాదం టవాయ్" సైదుల్ని హెచ్చరించింది.

"పోమ్మోవ్... ఏదో పదో పాతికో అంటే పరవాలేదుగానీ... అంత నావల్లగాదు. అంతబెట్టే దానకదేమన్నా బంగారమా" నిక్కచ్చిగా చెప్పేశాడు.

ఎవరయినా కొత్తగా అక్కడికి వస్తే ముందు తనే వెళ్ళే వాడు మల్లేశు. అలా వెళ్ళకుంటే తన మగతనానికే అవమానంగా తలుస్తాడతను. అందుకే మళ్ళీ తలుపువైపు చూశాడు.

కవ్విస్తూ నవ్విందా ముఖం!

ఇక తట్టుకోలేక పోయాడు మల్లేశు.

తనదగ్గర ఇరవయ్యే వుంది. మిగతా డబ్బు ఎలా. ఒక్కక్షణం ఆలోచించాడు.

"అప్పుపెడితే? ముండల్దగ్గిర అప్పుపెట్టే ముండా కొడుకు బతుకూ ఒక బతుకేనా..."

మనసులోనే అనుకున్నాడు.

సరే... సాయంత్రమేళకు ఎవుర్నో ఒకర్ని అప్పడిగి, డ్యూటీ దిగగానే యిచ్చేస్తానని చెప్పి... మిగతా కొదవడబ్బులు సర్దుకోవాల. లేకంటే కంటికి కునుకురాదు అనుకుని ఒక నిర్ణయానికొచ్చేశాడు.

"రాత్రికుంటుందాత్తా?"

అనుమానంగా అడిగాడు.

"నువ్వు సరేనంటే ఎనిమిది వరకూ బెడతా" అంది కనకమ్మ.

"సరే ఇంతకీ ఎక్కడి పిట్టా? ఇక్కడిదా? బయటిదా?" అతనిలో ఎవరయిందీ తెలుసుకోవాలన్న ఉబలాటం.

"పక్కూరిదే..."

"పక్కూరిదంటే... ఫామిలీనా..."

"ఆ...."

"ఎవురబ్బా!"

"ఎవురయితేనేమిటి. 'ఏ' కలాసు తెలుసునా?"

" 'ఏ' క్లాసా... పేరు?"

"పేరుదేముందిలేరా బేవార్సు నాబట్టా"

"పేరు కూడా సెప్పవా?"

"దేవకి!!"

"దేవకా... అదేంపేరే బలే తమాసగా వుందే"

"ఇన్నడిగినావు. ఇంతకీ ఏమంటావురా నాబట్టా"

"సరేత్తా... ఆరుగంట్లకే వచ్చేస్తాలేయే"

టిఫెన్‌కు డబ్బులిచ్చి అక్కడినుంచి వెళ్ళిపోయాడు మల్లేశు.

అతనివెంట తనూ వెళ్ళాడు సైదులు.

★ ★ ★

మంగరాజు ఏలగ్నాన ఆమె కొంగు పట్టుకున్నాడో, ఏ క్షణాన మొగరాల ముద్దయ్య ఆమె చేయిపట్టాడో ఇక అప్పటినుంచీ దేవకి నైతికంగా పతనమైపోయింది. కష్టపడకుండగా కరువుకాలంలో సంపాదించే సరికొత్త మార్గం దొరికిందామెకు.

కరువుకాలం. ఎక్కడా పన్లేదు. మొగుడు చూస్తే రోజూ తాగేసి రావడం అలవాటు చేసుకున్నాడు. ఏమీ పట్టించుకోడు. ఇంకేం చేయాలి.... రానురాను బట్టకే కాదు తిండికే కరవైపోసాగింది. ఎన్నో రాత్రిళ్ళు తల్లీ కూతుళ్ళు పస్తులతో పడుకోవాల్సి వచ్చింది. వయసుకొచ్చిన కూతురి మానం కోసం, ఆమెకు కడుపునిండే అంత కబళం కోసం... దేవకికి తోచిన ఏకైకమార్గం అది. డబ్బుకు ఇబ్బంది వచ్చి సంసారం గడవని పరిస్థితి ఎదురయినప్పుడల్లా ఎవర్నో ఒకర్ని ఆకర్షించి, వాళ్ళు కోరుకున్న పడకసుఖం వాళ్లకందించి, తనకు కావాల్సిన డబ్బుల్ని తను తీసేసుకునేది. దారిద్ర్యం మనిషిని ఎంత నీచానికయినా దిగజార్చుతుంది. ఆ దారిద్ర్యమే దేవకిని కనకమ్మ కంపెనీకి నడిపించింది. ఏ ఆడదయినా తప్పు చేయనంతవరకే... శీలమనీ, సంఘమనీ, కట్టుబాటనీ భయపడుతుంది. తప్పుచేసేకొద్దీ ఆ భావం, భయం దూరమైపోతాయి. సిగ్గు, లజ్జా అన్నీ మాయమైపోతాయి.

అలా ఆ వృత్తిలోకి కూరుకుపోయిన ఏ ఆడదీ ఆ తర్వాత ఎంత ప్రయత్నించినా ఆ ఊబిలోనుంచి బయటపడలేదు. అదోరకం మత్తుమందులాంటిది.

ఒకవేళ అందులోనుంచి బయటకు రావాలన్నా సమాజం రానివ్వదు. ఆదరించదు.

అలా ఆ వృత్తిలోకి అలవాటుపడ్డ దేవకికి, కనకమ్మ కంపెనీయే దిక్కయింది.

### దరిద్రం విరగడయింది

"అమ్మీ దేవా! అంత గంజుంటే పొయ్యే

తల్లీ. కడుపుమంట నోరు ఆరకపోతా వుంది"

ఇంటి ముందరున్న పందిరికింద ఓ పక్కన కూర్చొని అరుస్తోంది ఈరమ్మ.

ఆమెచేతిలో ఓ సత్తుగిన్నె ఆపక్కనే ఓ సత్తుగ్లాసు, దేవకి గుమ్మంలో అరుగుపైన కూర్చొని గోడకు చేరగిలబడి శూన్యంలోకి చూస్తోంది. ఈరమ్మ మాటలు వినబడనట్లే వుంది.

మళ్ళీ అరిచింది ఈరమ్మ.

"అమ్మణ్ణీ గౌరా! నువ్వయినా అన్ని సద్ది నీళ్ళు పొయ్యి తల్లీ!"

ఆమాటకు కూడా సమాధానం లేదు.

గౌరికూడా గుడిసెలోపలే కూర్చొని తల్లి లాగే మౌనంగా రోదిస్తోంది.

ఆ ముగ్గురిదీ ఒకటే బాధ!

ఆకలిబాధ!!

బియ్యం అయిపోయి వారం అయింది. అడుగూబొడుగూ ఊడ్చి దొరికిన నూకల్నే గంజి కాచుకుని ఇన్ని రోజులూ గడిపారు. ఇప్పుడు అవికూడా అయిపోయాయి. పొద్దున పిడికెడు నూకలదుమ్ముతో ఎలాగో కాలం గడిపింది గౌరి.

ఆ గంజి వారి ఆకల్ని తీర్చలేకపోయింది.

వారి శరీరాల్లో ఎక్కడలేని నీరసం!

అటు కూతురినుంచిగానీ, ఇటు మనవరాలినుంచి గానీ ఏ సమాధానమూ రాకపోవడంతో ఆకలికి తట్టుకోలేని ఈరమ్మ వెదుకుతూ గ్లాసును చేతిలోకి తీసుకుంది. గ్లాసుని సత్తుగిన్నెవున్న చేతిలోకి చేర్చుకుని, కుడిచేతితో నేలపైన తడిమి పక్కనేవున్న ఊతకర్రను చేతిలోకి తీసుకుంది. ఆ కట్టెను ముందువైపున అటుఇటు తిప్పుకుంటూ దారి క్లియర్‌చేసుకుంటూ అలాగే దేకుతూ వీధిలోకి బయలుదేరింది.

"అక్కా! గెల్లపల్లోళ్ళ తిమ్మక్కా! నాలుగు దినాలయిందమ్మా అన్నందినీ. అంత కడెయ్యి తల్లీ!"

వీధిలో అన్నంకోసం అరుస్తోంది. ఈరమ్మ.

"అమ్మా యల్లమ్మా. గురంకొండోళ్ళ రాజమ్మా, యతానోళ్ళ నాగమ్మత్తా! అమ్మా అన్ని సద్దినీళ్ళుంటే పొయ్యండి తల్లీ! కడుపులో వొగిటే బాధమ్మా... ఆకల్తో కడుపంతా నొప్పిగా వడుస్తావుంది. వొగపిడస... అంత శారూ యెయ్యిసామీ... మా దేవకి గంజినీళ్ళు కూడా పోయలేదు తల్లీ... పాణం పోయేట్టుందక్కా... తల్లో"

అతిదీనంగా అరుచుకుంటూ కదుల్తోంది.

ఆరోజు ఆమె దారిద్ర్యం మరీ విజృంభించినట్టుంది. ఎన్ని చద్దినీళ్ళు పోసినా తాగేస్తోంది. ఎంత అన్నమేసినా మింగేస్తోంది. కానీ మళ్ళీ అరుస్తూనే వుంది. దరిద్ర దేవత, ఆపెద్దమ్మ జేష్టాదేవి ఈరమ్మ రూపంలో అక్కడ విశ్వరూపం దాల్చినట్టుంది. వంటికి చుట్టుకున్న పాతచీర తొలగిపోతున్నా చూసుకోవడంలేదు. అసలది తొలగిపోతున్న స్పృహకూడా ఆమెకు లేనట్టుంది. ఆమె స్నానం చేసి ఎన్నో నెలలయినట్టుంది. ఏ పండుగ రోజోగానీ ఆమె స్నానం చేయదు. అందుకే ఆమె శరీరం మురికి వాసన వస్తోంది. తలకి నూనె పెట్టడం దాదాపుగా ఆమె మరచిపోయినట్టుంది. ఆమెజుట్టు తెల్లగా నెరిసిపోయి జడలు కట్టి వేలాడుతోంది.

ముసురుతున్న ఈగలతో, కళ్ళు కనిపించని కారణంగా గిన్నెలో పడ్డ ఈగల్ని సైతం అలాగే మింగేస్తోంది.

గిన్నెలో తిప్పితిప్పి తీస్తున్న కుడిచేతి వేళ్ళను, అరచేతిని జానెడు పొడవుతో నాలుక చాపిచాపి మరీ నాకుతూ జుగుప్సాకరంగా కనిపిస్తోంది.

అలా సాయంత్రం వరకూ అన్నం తింటూనే వుంది. పోసిన చద్ది తాగుతూనే వుంది. చూసిన వాళ్ళంతా ఈ ముండది కడుపా చెరువా అని ఆశ్చర్యపోతున్నారు.

చివరికి అర్ధరాత్రి గెల్లపల్లోళ్ళింటి పక్క నున్న రాతికూసాల పందిరికింద అలాగే పడుకుంది.

ఆ పందిరికింద ఉంచబడివున్న ఎద్దుల బండే ఆమెకు ఆవేళ అద్దాల భవంతిగా వుంది. అక్కడే ఆ రాత్రి పడుకుని నిద్రపో యింది.

మామూలుగానే ఆ రాత్రీ తెల్లవారింది. దాంతోబాటు ఈరమ్మ బతుకూ తెల్లవారి పోయింది.

జీవితాంతం దరిద్రంతోను, ఆకలితోను పోరాటం చేసిన ఈరమ్మ బతుకు ముగిసి పోయింది.

ఆమె బతుకు యుద్ధం చాలించింది.

ఆకలితీరా ఆ రాత్రి అన్నంతిన్న ఈర మ్మది ఆకలి చావుకాదని ఎవరనగలరు?

## దేవకి దేవలోకం చేరిపోయింది



**కు**శాలన్నకి ఇంట్లో వున్న ఒకేఒక చరాస్థి ఒక ఆవుదూడ. వాటిని తెగనమ్మి ఈర మ్మకు శవసంస్కారం చేయించాడు. మిగి లిన డబ్బుతో కొద్దిరోజులు సంసారాన్ని లాక్కొచ్చాడు. అయినా అతని తాగుడు మాత్రం ఆగలేదు.

ఒకరోజు ఉదయాన...

దేవకి ఇంటిముందర కూర్చొని గౌరికి పేలు చూస్తోంది.

గౌరిది పొడుగాటి రింగురింగుల నల్లటి జుట్టు. ఆ జుట్టును పాయలు పాయలుగా తీస్తూ, తన రెండు చేతుల్తో పేలు చూస్తోంది. అంతవరకూ ఇంట్లో వున్న కుశాలన్న ఏదో ఒకపనికి పోవాలని పైకి లేచాడు.

"అమ్మీ దేవకీ... నేనట్ట కూలిపని దొరు కుతుందేమో పోయొస్తా" తుండుగుడ్డ భుజాన వేసుకుని బయలుదేరాడు.

దాసన్నగారింట్లోనుంచి వచ్చేసిన నాటి నుంచీ అతను ఆ ఊరివైపుకు పనులకు పోడు. అందుకే ఈసారి కమ్మపల్లివైపు వెళ్ళాలనుకున్నాడు. అలా అనుకుంటున్నం తలోనే అక్కడికొచ్చాడు దాసన్నగారి జీత గాడు కదిరప్ప.

"ఏందబ్బా కదిరప్పా! యిటొచ్చినావు పొద్దున్నే" అతన్ని తనే పలుకరించాడు కుశాలన్న.

"నీ కోసరమే వస్తి"

మొహమాటపడుతూ చెప్పాడు కదిరప్ప.

"నా కోసరమా! ఎందుకు?"

"అదే. మంగరాజన్న పంపించినాడు"

"ఈసారేదయినా ఇంకో దొంగతనం... అంటకట్టాడా ఏమి?" కాస్త వెటకారంగా అన్నాడు కుశాలన్న.

"అదేమీ లేదబ్బా!"

"ఇంక దేనికి?"

"నువ్వు ఆయనకు తీర్చాల్సిన అప్పు తీర్చా లంట. అది అడిగిరమ్మనే నన్ను పంపాడు"

"ఇంకా ఏమప్పంట. అన్నిరోజులు చేసిన పనికి అది ఎప్పుడో తీరిపోయుంటుంది. మళ్ళా అప్పంటాడెందుకు?" అని ఒక్క క్షణం ఆలోచించి "ఏం చెప్పినాడేమి?" అని అడిగాడు.

"నువ్వు ఆడనే పంజేస్తావుంటే మెల్లిగా జమేసుకుందామనుకున్నాడంట. నువ్వొచ్చేసి నావు కాబట్టి అది తీరేమార్గం లేదుగదా!"

"అందుకనీ..."

"నన్ను వడ్డీతోసహా వసూలు చేసుకురమ్మన్నాడు"

ఆ మాట వినేసరికి కుశాలన్న గుండెలో గునపం గుచ్చినట్టనిపించింది.

"తిండికే జరగలా ఇంకేడ దెచ్చేది నేను" బాధగా అన్నాడు.

"సరే ఎప్పుడిస్తావు? " తిరిగి అడిగాడు కదిరప్ప.

"ఇస్తాలే. ఇవ్వకుండా ఎక్కడ బోతా... ఎబ్బుడో వొగబ్బుడు ఇచ్చేస్తాలే"

"ఏమోబ్బా... బాకీనూ ఇవ్వలేదు. పనికీ రాలేదు. అని యీడెగిరి ఆడబడతా వుండా డబ్బా ఆయన"

"ఏంజేసేది కదిరప్పా జరగలా"

"కుశాలన్నా యిది పెద్దోళ్లతో మాట. ఇప్పుడేం జెప్పమంటావు? "

"ఇబ్బుడు ఇవ్వలేనని జెప్పు"

"సరే వస్తానబ్బా"

అక్కడినుంచి వెళ్ళిపోయాడు కదిరప్ప.

పనికోసం కమ్మపల్లె దారిపట్టాడు కుశాలన్న.

అక్కడ ఏదోపని దొరికినట్టుంది. అందుకే సాయంత్రం ఏడు గంటలవుతున్నా అతను ఇంటి తిరిగిరాలేదు. దేవకి, గౌరి ఇంట్లోనే వున్నారు. అందరి ఇండ్లలోను అప్పటికే నూనె దీపాలు వెలుగుతున్నాయి. వీధిలో మనుషులు వస్తూ పోతూనే వున్నారు. కొందరిండ్లలో సేద్యం చేసే పశువుల అరుపులు వినిపిస్తున్నాయి. కొక్కరకో అని ఎక్కడో దొంగకోడి కూసిన శబ్దం. నడి వీధిలో కుక్కలు దేనికోసమో పోట్లాడుకుంటూ, అరుచుకుంటూ వుంటే అసెంబ్లీ గుర్తుకొస్తోంది.

కుశాలన్న ఇంట్లో అంతవరకు వెలుగుతున్న బుడ్డీదీపం పుటుక్కున ఆరిపోయింది.

గౌరి గెల్లపల్లోళ్ల ఇంట్లో రాగులు విసురుకోడానికి వెళ్ళింది. ఇంట్లో దేవకి ఒక్కతే వుంది.

ఆమె కావాలనే గౌరిని ఇంట్లో వుండకుండా పంపించేసింది. దీపం ఆర్పేసి ఎవరికోసమో ఎదురుచూస్తూ గడపలోనే కూర్చోనుంది దేవకి.

ఆమె తన జీవితాన్ని పంచుకున్న భర్త కోసం చూడడంలేదు. అరగంటముందు వడ్డీల బుడ్డయ్యకు మాటిచ్చింది.

ఎలాగో ఓలాగు వెంటనే తనింటికి వచ్చేయమంది.

ఎదురుచూస్తుంటానని చెప్పింది.

భర్త రాకను తెలియపరచడానికి ఇంద్రమ్మను ఇంటికి కొంత దూరంలో వుంచింది.

ఇంద్రమ్మ దేవకికంటే పదేళ్ళు పెద్దది.

అక్రమ సంబంధాలు పెట్టుకునే యువతీ యువకులు కలుసుకునేటట్లు చూడడం, వారి కలయికకు చోటు ఏర్పాటు చేయడం వంటివన్నీ ఆమె చేస్తుంటుంది. ఆమెకదొక ఆనందం.

దానికి ప్రతిఫలంగా వారిచ్చే కానుకల్ని గ్రహిస్తూ సంబరపడిపోతుంటుంది ఇంద్రమ్మ.

అందుకే ఇంద్రమ్మనక్కడ వుంచింది దేవకి.

కొంతసేపటికి రానేవచ్చాడు బుడ్డయ్య.

వచ్చీరాగానే దేవకి ఇంటి తలుపు తెరచి, అతన్ని లోపలికి తీసుకుపోయి తలుపు గొళ్ళెం పెట్టింది.

కొద్దినిముషాలు చకచకా ముందుకు నడిచాయి. ఇంతలో ఇంటి వెనక దారిగుండా ఎప్పుడొచ్చాడో వచ్చాడు కుశాలన్న. ఆరోజు లభించిన కూలిడబ్బుల్తో తాగేసి వచ్చాడు. ఇంటికి ముందువైపునున్న ఇంద్రమ్మ అతని రాకను గమనించనేలేదు.

"గౌరమ్మా తల్లీ! అమ్మా!"

తూలుతూ తలుపు తట్టాడు.

ఆ మాటల్ని విన్న ఇంద్రమ్మ ఏం కొంప మునుగుతుందోనని ఉలిక్కిపడి చూసింది. ఇప్పుడే రాడనుకుంది. వచ్చేశాడు. చాలా రోజులుగా వడ్డీల బుడ్డయ్య తన కోరిక

తీర్చమని ఇంద్రమ్మ దగ్గర రాయబారాలం పాడు. చివరికి ఎలాగో పప్పేసుకుంది. ఇంటికి రమ్మంది. ఇప్పుడిక చేయి దాటిపోయింది.

ఈ స్థితిలో కలుగజేసుకోవడం అవివేకమనుకొని అక్కడినుంచి తిన్నగా జారుకుంది ఇంద్రమ్మ.

"అమ్మా... గౌరీ!"

తలుపు తడుతూనే వున్నాడు కుశాలన్న.

దేవకి గుండెలు గుభిల్లుమన్నాయి.

"అయ్యయ్యో. అన్నేకారిముండ కొంప ముంచెనే ఇంద్రమ్మ. ఆ నాసవుతి మోసం జేసెనే"

ఇంద్రమ్మను మనసులోనే తిట్టుకుంది.

బుడ్డయ్య పట్టుబడిపోయినందుకు వణికిపోతున్నాడు.

"అప్పుడే ఏమినిద్దరే దేవకీ, ఏయ్ తలుపు తలుపు తియ్"

ఇంకాస్త స్వరం పెంచాడు కుశాలన్న. సారామత్తులో అతని మాటలు నత్తినత్తిగా వస్తున్నాయి.

అయినా సమాధానం లేదు.

క్రమంగా అనుమానం అతని మనస్సును జయించింది. అతని మనస్సు కోపంతో కత్తిలా పదునెక్కుతోంది.

"ఎవరు లోపల మరేదగా తలుపుతియ్"

"దేవకి గురించి శానా చెబుతారు. అది చెడిపోతావుందని. అది నిజమో అబద్ధమో తెలీదు. మరి అదే నిజమైతే ఇప్పుడు ఎవరితోనైనా" ఆపైన ఆలోచించలేకపోయాడు.

"అలాంటప్పుడు గౌరేమయిందీ. వాగేళ గౌరే ఏదయినా తప్పు జేస్తావుందా... అట్టయితే దేవకేమైనట్టు" అన్నీ అనుమానాలే.

మళ్ళీ తలుపు తట్టాడు.

తిన్నగా తలుపు తెరచుకుంది.

ఇంట్లోకి ఒక్క అడుగువేసి అంతా కలయ చూశాడు. ఊహుఁ... ఆ చీకట్లో అతనికేమీ కనిపించలేదు. దేవకి మాత్రం తలపంచుకుని నిలబడి వుండడం మాత్రం స్పష్టంగానే కనిపిస్తోంది.

ఇంకొక అడుగు ముందుకేశాడు.

దేవకి గుండెల్లో గుండె లేదు.

భయంతో ఆమె వెన్నులోంచి వణుకు పుట్టుకొచ్చింది. "ఈ ముండాకొడుకు తలుపు సందునే వుండిపోయేనే తప్పించుకొని పోరాదా? "

ఇంకా అక్కడే దాక్కొని వున్న బుడ్డయ్యను మనసులోనే తిట్టుకుంది.

"అరే బెస్టు (చెడిపోయిన) ముండా! ఇంట్లో ఎవురులేరు. వచ్చెయ్. అని చెప్పి సరిగ్గా ఇరికించేసెనే" అనుకోసాగాడు బుడ్డయ్య.

"ఇంతసేపూ లోపల ఏం చేస్తావుంటివే. దీపం ముట్టిచ్చు"

అతని కళ్ళు తీక్షణంగా చీకటిని చీల్చే యత్నం చేస్తున్నాయి.

"అగ్గి అగ్గిపెట్టె పెట్టె... క... క... కనిపించలా" తడబడిపోతూ అంది.

అంత మత్తులోనూ, ఆ మాటలతీరు బట్టీ ఇంట్లో ఇంతసేపూ ఏదో జరిగిందని గ్రహించాడు.

అతనికి బీడీలు కాల్చే అలవాటుంది. అందుకే అతని జేబులో ఎప్పుడూ అగ్గిపెట్టె వుంటుంది.

"నీయమ్మ ఏమి రాసకార్యం ఎలగబెడతా వుంటివే ఇంతసేపూ ఇంట్లో" గుమ్మంలో అలాగే నిలబడి గొణుక్కుంటూ, జేబులో వున్న అగ్గిపెట్టె తీసి అగ్గిపుల్ల గీసి వెలిగించాడు.

అది చుర్రుమంటూ వెలిగింది.

అంతసేపూ తలుపు సందున నక్కివున్న బుడ్డయ్య ఇంకా అక్కడే వుంటే చావుదెబ్బలు తప్పవనుకున్నాడు.

ఉన్నట్టుండి అతన్ని తోసుకుంటూ వెలుపలికి వచ్చేసి పరుగెత్తి వెళ్ళిపోయాడు.

ఈ హఠాత్సంఘటనకు విస్తుపోయాడు. ఆ ఊపుకు అతని చేతిలోని అగ్గిపుల్ల కింద

పడి ఆరిపోయింది.

"ఎవుడ్రా వాడు?" అంటూ ఒక అంగ అటువేసేలోపు అతను చీకట్లో కలిసిపో యాడు.

తాగిన మైకం ఒక్కసారిగా దిగిపోయినట్ట పించింది కుశాలన్నకు.

"నీయమ్మ యభిశారి లం... నేను ఇంట్లో లేనప్పుడు నువ్వు చేస్తావుండేదిదా... తుచ... సిగ్గులేని లం..."

అశ్లీలంగా తిడుతూ ఆమె జుట్టు పట్టు కొని ఈడ్చి తన్నుకుంటూ ఇంటి వెలుపలికి వచ్చాడు.

"పోయే... బసివిముండా... నీ అమ్మా అమ్మమ్మ... యభిశారిదానా... ఇంక నా ఇంట్లో అడుగుపెట్నావా నరికేస్తా. నీయక్కా పోయే నీయబ్బడాలా పో"

తిడుతూనే అందిన చోటల్లా కొట్టసా గాడు. మత్తులో ముందూ వెనకా తెలీ కుండా కొడుతున్నాడు.

దెబ్బదెబ్బకూ మెలికలు తిరిగిపోతూ... "సచ్చానో దేవుడో" అంటూ నేలపైనే అరు స్తోంది దేవకి.

అతని మాటలు, దేవకి అరుపులు విన్న ఇరుగు పొరుగు వాళ్ళంతా ఒక్కొక్కరే అక్కడ చేరిపోయి ఆ వింతను చూడసా గారు.

"ఇన్ని దినాలు మొగునికి తెలీకుండా చేసింది. ఇప్పుడు దొరికిపోయింది లం..."

"ఆ... ఇట్టాంటివి ఎంతకాలమని సాగతా యిలే"

"దాని పాపం పడింది. దాన్ని చూస్తే ఊర్లో వుండే ఆడోళ్ళంతా చెడిపోతారు. ఊరెళ్ళగొట్టండి"

"బంగారంలాంటి బిడ్డెలుండారు. అందునా పెండ్లి కాదగిన కూతురుండి పాయ. ఈ వయసులో దీనికి మిండగాళ్ళు గావాల్సి వచ్చింది మిండగాళ్ల తుచ... ఎగ్గూ సిగ్గూలేని నా సవుతి"

"ఇంక దీన్ని జూసి కూతురు కూడా నేర్చు కుంటుందిలే"

"కన్నా కష్టంబడి గొడ్డుమాదిరి పంజేసి మొగుడు తెచ్చి యాస్తావుంటే ఊరికే కూసోని తిని కొవ్వుబట్టి, ఇంత మిడిమే ళంగా అంతరమద్దెంలో నడస్తావుండాది. తరిమేయండి. ఊర్లో లేకుండా"

"నల్లగున్నా... కంటికి నదురుగా కనిపి స్తాది. వయసైనట్టు పెద్దగా తెలీదు. అందుకని ఈ బిజినిస్సీ ఆరంభించినట్టుం డాది" అని కొందరు అనుకోసాగారు.

"ఏం జేస్తాం. కరువుకాలం. పనుల్లేవు. మొగుడు చూస్తే దినామ్ము సారాయి తాగే సొస్తావుండె. ఇంక ఆయమ్మ మాత్రం ఏం చేస్తుంది. గడవద్దా"

"అంతేలే. దినామ్ము వోనాలీసాడు దాగే సొస్తావుంటే ఇంట్లో వాళ్ళు ఇంకేం బొక్కలా డుతారు. (తింటారు) మన్ను బొక్కలాడా ల్సిందేగదా"

"ఈ కరువుకు ఎట్టో వొగట్ట బిడ్లసాక్కోవా లగదా. అది మాత్రం ఏం చేస్తాది. దరిద్ర మట్టాంటిది" అని మరికొందరు... అలా తల ఓరకంగా అనుకున్నారు.

"పోయే ఇంక లమ్మిడీ! ఇంట్లో కొస్తివా... చించి ఉప్పు పోసేస్తాను. కోసి సున్నం బెట్టే స్తాను. కండకండాలుగా కోసేస్తాను. నరికే స్తాను. పేగులు దీసి కసురు తోడేస్తాను" ఆవేళ అతని నోటికి అడ్డే లేకపోయింది.

"పోయే లం... నా ఇంట్లో ఉండద్దు పోయే. నన్నూ, నా బిడ్డను నాశనం జేస్తి విగదే. నీ బగిసిమార పో..." అంటూ మెడబట్టి తోశాడు.

ఆ ఊపుకి విసురుగా వెళ్ళి ఇంటిముందర కూలబడింది దేవకి.

మనుషుల ముఖాలు చూడలేక అవమా నంతో ముడుచుకుపోయి కుమిలి కుమిలి ఏడ్చింది.

ఈ విషయం తెలిసి అందర్నీ తోసు కుంటూ వచ్చి నిలబడింది గౌరి తండ్రివైపు

తల్లివైపు మార్చి మార్చి చూసింది. తను విన్నది నిజమేనని నిర్ధారణ చేసుకుంది.

"అమ్మా! ఎంతపని 'చేశావే" అంటూ అలాగే నేలకూలబడిపోయింది గౌరి.

గొంతు చించుకుని దిక్కులు పిక్కటిల్లేలా "నేనిలా దిగజారిపోయిందీ... ఇన్ని అవమానాలు భరించిందీ మీ కోసమే. మీ కోసమేనే. మిమ్మల్ని పస్తులుంచలేక, మీ కడుపుకింత ముద్ద పెట్టడానికేనే నేను చెడిపోయిందీ" అని అరచి చెప్పాలనుకుంది. నరాలు చిట్లిపోయి శరీరంలోని రక్తమంతా కారిపోయి ప్రాణం పోయేంతవరకూ అరిచి చెప్పాలనుకుంది దేవకి.

'కానీ ఆ మాటలు ఎవరు వింటారు. అసలు నమ్మేదెవరు? నమ్మినా ఈ లోకం హర్షిస్తుందా?' అనుకుంటూ మౌనంగా రోదించసాగింది.

నేలకరుచుకుపోయి ఆ నేల తడిచిపోయేలా ఏడ్చి ఏడ్చి కన్నీరు కార్చింది.

కుశాలన్న సారామత్తు పూర్తిగా దిగిపోయింది.

కళ్ళనీళ్ళతో వెళ్ళి గౌరిని అక్కున చేర్చుకున్నాడు.

ఆ ముగ్గురి కళ్ళు మరో గంగోత్రిలా ధారాపాతంగా వర్షిస్తున్నాయి.

"అప్పా!" అంటూ రోదిస్తున్న గౌరిని తీసుకుని ఇంట్లోకి వెళ్ళి తలుపేసుకున్నాడు కుశాలన్న.

అంతటితో ఎవరిండ్లకు వాళ్ళు వెళ్ళిపోయారు.

కానీ దేవకి మాత్రం ఆ ఇంట్లోకి తిరిగి అడుగుపెట్టలేక అలాగే రోదిస్తూనే వుంది.

"ఉన్నవాళ్ళు పొద్దుపోక కొత్త రుచుల కోసం తప్పుచేస్తే చూస్తూ మౌనంగా వుండే ఈ లోకం, బతుకు తెరువుకోసం, తనవారిని బతికించుకోవడం కోసం దరిద్రులు తప్పు చేస్తే ఎంతగా కళ్ళపొడుస్తుందీ... ఛీ... ఛీ..." అనుకొంది దేవకి.

అలా ఒక్కక్షణం ఆలోచించి ఎంతసేపటికీ ఇంటి తలుపు తెరవకపోయేసరికి మెల్లగా లేచి పులిచెర్ల దారి పట్టింది దేవకి.

అలా వెళ్ళిన దేవకి ఆ రాత్రి కనకమ్మ కంపెనీలో తల దాచుకుంది.

ఆ మరునాడు ఎవరికీ కనిపించకుండా ఎటో వెళ్ళిపోయింది. ఎలా వెళ్ళిందో, ఎక్కడికి వెళ్ళిందో ఎవ్వరికీ తెలీదు.

కొందరు బొంబే చేరిపోయిందని అనుకున్నారు. మరికొందరు పాకాల్లో చూశామనీ, ఇంకొందరు తిరుపతి సావిత్రి కంపెనీలో చేరిపోయిందనీ, కొత్తగా కంపెనీ ప్రారంభించిన భీమవరం భద్రమ్మ అనే విడో కంపెనీలో చూశామనీ రకరకాలుగా అనుకున్నారు.

అలా ఆరోజు రాత్రి చీకట్లో ఇల్లు వదలిన దేవకి వెలుగే కనిపించని మరో చీకట్లో కలిసిపోయి అలాగే అంతర్ధానమైపోయింది.

## ఎక్కడబోయినా ఒక్కటే



తగిలిన కాలికే తగుల్తుందని సామెత.

కష్టాల్లో మునిగినవాళ్ళకే ఇంకా కష్టాలు, ఒకదానిపైన ఒకటి వరుసగా వచ్చి పడుతుంటాయని అంటారు.

కుశాలన్న విషయంలో అదే నిజమనిపిస్తోంది. అతన్ని ఏ శనిదేవతో వదలకుండా వేధిస్తోందనిపిస్తోంది. ఆతనిపట్ల విధి మరోసారి క్రూరంగా ప్రవర్తించింది.

చుట్టుపక్కల ఎక్కడా పనుల్లేవు.

కల్లూరు దగ్గరున్న దేవళంమిట్ట సమీపంలో రోడ్డుపని జరుగుతోంది. ఆ పక్కనే వున్న 'టెంకాయలపల్లి' నివాసి నాయుడయ్య ఆ రోడ్డుపని చేయిస్తున్నాడు. ఎలాగో నాయుడయ్యా కాళ్ళో కడుపులో పట్టుకొని ఆ పనిలో చేరారు కుశాలన్న, అతని కూతురు గౌరి.

ఎలా లేధన్నా ఆ పని ఒక నెలపాటు వుంటుంది. వారం పొడుగునా పనిచేసి ఆదివారం సంతనాడు డబ్బులు తీసుకుంటుంటారు కూలీలు. ఆ ప్రదేశం 'దేవళంమిట్ట' సమీపంలో వుంది.

బండారోళ్ళపల్లెనుంచీ 'చీనీతోపు' పక్కగా, చింతపర్తోని కుంట దాటుకొని, ఆ పక్కనే వున్న రెండు మామిడితోటల మధ్య 'మేకపోతు దిన్నె'లో దూరి, వెంకటమ్మ చెరువు కట్టమీదుగా దిగితే దేవళంమిట్ట వస్తుంది. అక్కడ ప్రఖ్యాతి చెందిన 'కదిరి నరసింహస్వామి' ఆలయం వుంది. దానికి కొంతదూరంలో రాసపల్లె... ఈ రెంటికిమధ్య'మూగోడిబాయి'. దానికి కూత వేటు దూరంలోనే రోడ్డుపని జరుగుతున్నది.

ఈదారి గుండానే రోజూ కుశాలన్న తన కూతుర్ని తీసుకొని, మధ్యాహ్న భోజనానికి కేరియర్ కట్టుకొని వెళ్ళివస్తుంటాడు. కుశాలన్న ఇంటిముందరున్న కాలనీ ఇండ్లవాళ్ళు కూడా కొందరు ఆ పనికి వెళ్తున్నారు.

ఉదయం ఎనిమిదినుంచీ సాయంత్రం అయిదువరకు పని జరుగుతుంది.

ఆరోజు ఉదయాన...

కొందరు మగకూలీలు రోడ్డుపక్కనున్న సైడుకాలువల్లో పెరిగి వున్న చెట్లను మొదలంట నరికి అవతలకి వేస్తున్నారు. మరికొందరు పూడిపోయివున్న ఆ కాలవల్లోని మట్టిని గునపాలతో తవ్వి 'సలంకపార'లతో ఎత్తి 'తగార్ల'కు వేస్తుంటే... ఆడకూలీలు, ఆ తగార్లను నెత్తిన పెట్టుకొని వెళ్ళి రోడ్డులో తారు కొట్టుకుపోయినచోట, తారుకిరుపైపులా పోస్తూవస్తున్నారు.

కాంట్రాక్టర్ నాయుడయ్య రోడ్డువారవున్న ఒక కానగ చెట్టుకింద వున్న ఒక గుంటిమీద కూర్చొని సిగరెట్టు కాల్చుకుంటున్నాడు. ఆ చెట్టు కొమ్మలకు, కూలీలు మధ్యాహ్నం కోసం తెచ్చుకున్న చద్ది అన్నం క్యారియర్లు మూటలు కట్టబడి వున్నాయి. అవి ఏ మహా మాంత్రికుడో మంత్రాల మర్రిచెట్టుకు వేలాడ దీసిన మహర్షుల శిరస్సుల్లా గాలికి ఊగుతూ కనిపిస్తున్నాయి.

టెంకాయలపల్లెనుంచి కూడా కొందరు ఆడ కూలీలు వచ్చి ఫనిచేస్తున్నారు.

"ఆఁ త్వరగా కానీ... కానీ..." అంటూ ఆడ కూలీలను హెచ్చరిస్తోంది టెంకాయపల్లెనుంచి పనికివచ్చిన వేణమ్మ.

నాయుడయ్యకు దూరపు బంధువు వేణమ్మ. వయసులో ఉన్నప్పుడే భర్త చనిపోతే అప్పటినుంచీ నాయుడయ్యే ఆమెను ఉంచుకుని తిండీ బట్ట సమకూరుస్తున్నాడు. దానికి ప్రతిఫలంగా వేణమ్మ అతను చేయించే కాంట్రాక్టు పనులకు కూలీలను పిలవడం, పనికి వచ్చిన కూలీలు సరిగా చేసేట్లు చూడ్డం వంటివి చేస్తుంటుంది.

పైగా నాయుడయ్యకు స్త్రీల బలహీనత వుంది. కాబట్టి అప్పుడప్పుడు నాయుడయ్య కోరుకున్న ఆడవాళ్లను ఎలాగో ఓలాగు వప్పించి నాయుడయ్య వ్యవసాయం వున్న మూగోనిబాయికాడికి పంపుతుంటుంది. నాయుడయ్య అక్కడ వాళ్లతో తన కోరిక తీర్చుకొని వేణమ్మకు బహుమానాలు ఇస్తుంటాడు.

ఆరోజు మధ్యాహ్నం పదకొండుగంటలు కావస్తోంది. నాయుడయ్యకు ఆకలి ఎక్కువ కాసాగింది. అతను ఉదయం టిఫిన్ చేయడు. ఒకేసారి పదకొండున్నరకంతా భోజనం చేసేసేయడం అతని అలవాటు. ఇంటినుంచి ఇంకా క్యారియర్ రాలేదు.

ఇంటికెవర్నయినా పంపిద్దామా అనుకుంటూ కూలీలవైపు చూశాడు. ఎదురుగా,

రోడ్డుపైన గౌరి కనిపించింది.

మట్టి తట్టను నెత్తిన పెట్టుకొని, నడుస్తుంటే నాయుడయ్య మనసు జివ్వుమంది.

ఆమె పనిలో చేరిన రోజే... వేణమ్మ ద్వారా ఆమెను మూగోడి బాయికాడున్న షెడ్డులోకి రప్పించుకోవాలనుకున్నాడు. కానీ కుశాలన్న ఆమెకెప్పుడూ అందుబాట్లోనే వుండడంతో ఆ ప్రయత్నం చేయలేదు. ఇప్పుడు కుశాలన్న... కాస్త దూరంగా ఇంకొక గుంపులో పనిచేస్తున్నాడు. అది



మంచి సమయంగా భావించాడు. మెల్లగా వేణమ్మకు సైగచేసి రమ్మన్నాడు...

"ఏమ్మామా" అంటూ కానగచెట్టు కింద వున్న నాయుడయ్యే దగ్గరకు వెళ్ళింది వేణమ్మ.

"అమ్మీ! ఆ కుశాలగోడు కూతురుందే... ఆయమ్మి ఎట్టాంటిది" అని అడిగాడు.

"ఏమో మామా... కానీ బిడ్డను చూస్తా వుంటే మంచిదిగానే వుంది"

"వారం దినాలనుంచీ దాంతో కలిసి పని చేస్తావుండావే. అదెట్టాంటిదయిందీ

తెలీదా... సరేగానీ, ఈరోజు క్యారియర్ నువ్వు తేవద్దు..."

"ఓహో అర్థమైందిలే... కానీ ఆయమ్మి ఏదయినా బాయికాడ రాద్ధాంతం చేస్తే ఎట్ట మామా"

"దాని మొహం అదేం చేస్తుందిగానీ... ఈసారి క్యారియర్ని మాత్రం ఆయమ్మి నెత్త కరమ్మని... పంపేబాధ్యత నీది"

"సరే మామా... కానీలే. నిన్న క్యారియర్ తెచ్చినాయమ్మి ఏమన్నా రాద్ధాంతం చేసిందా"

"ఆc... కొంతసేపు ఏదో పతివర్త మాదిరి డైలాగులు కొట్టింది. పట్టుకుంటే మాత్రం, గమ్మునైపోయింది"

"ఆయమ్మిది కుశాలన్నోళ్ళ ఊరే... కూలికి రాకుండా చేస్తారని భయంతో వప్పేసుకునింది. ఏబాధాలే, బుద్ధిమంతురాలు"

"నువ్వు దినొమ్ము నేను మనసు పడిన ఆడోళ్ళ దగ్గిర క్యారియర్ పంపించు. పంపించిన ప్రతిసారీ గాకుండా ఈపని పూర్తవుతానే నీకొక పట్టుచీర కొనిపెడతా"

ఆమాటతో మురిసిపోయింది వేణమ్మ.

నాయుడయ్య సంవత్సరం పొడుగునా ఏదో ఒక పనిచేయిస్తూనే వుంటాడు. రోడ్డు పనులు, ఇటుక కోయించడం, చిన్నచిన్న డ్యాంలు కట్టించడం వంటి పనులు.

ఆ పనులు చేయడానికి చుట్టుపక్కల పల్లెలనుంచీ ఎందరో కూలీలు వస్తుంటారు.

అలా వచ్చిన ఆడకూలీలలో నాయుడు మనసు పడిన ఆమెను మూగోడిబాయి దగ్గరికి నయానో భయానో వప్పించి పంపించేస్తుంటుంది. లేదా ఇంటినుంచీ నాయుడయ్యకు వచ్చే క్యారియర్ ఇచ్చయినా పంపిస్తుంటుంది.

అందుకే ఆరోజు అక్కడ ఈసారి గౌరి చేత క్యారియర్ మోయించాలన్న నిర్ణయం జరిగిపోయింది.

కొంతసేపటికి రానే వచ్చింది క్యారియర్.

పల్లెనుంచి అతని జీతగాడు మూరెడు పొడవున్న నాలుగు గిన్నెల క్యారియర్ను తెచ్చి ఆకానగ చెట్టుకింద పెట్టేసి "ఇంట్లో గొడ్లను నీళ్ళకొదలాల, వస్తానయ్యా" అంటూ వెళ్ళిపోయాడు.

నాయుడయ్య పైకిలేచి, "వేణీ! నేను బాయికాడుంటాకాని క్యారియర్ బాయికాడికి తీసుకరా" అని కనుసైగ చేసి వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళిన పదినిమిషాలకు వేణమ్మ గౌరిని సమీపించింది. పనిచేస్తూనే ఏవేవో మాటలు కలిపింది.

ఇంతలో పన్నెండు గంటలయింది మధ్యాహ్న భోజనాలకోసం అందరూ పని విరమించారు.

వేణమ్మ క్యారియర్ చేత బట్టుకొని మూగోనిబాయి దగ్గరకు బయలుదేరింది.

తిరిగి అరగంట తర్వాత వట్టి క్యారియర్తో తిరిగి వచ్చింది. అప్పటికే భోజనం ముగించి దూరంగా ఓ రాతిపైన, చెట్టునీడలో వంటరిగా కూర్చొనివుంది గౌరి. కుశాలన్న ఇంకా కొందరు ఏదో లోకాభిరామాయణం మాట్లాడుకుంటూ, ఒకరి అన్నం ఒకరు మార్చుకుంటూ ఒకరి కూరలు మరొకరు రుచులు చూసుకుంటూ అన్నాలు తింటున్నారు.

"ఏమమ్మణ్ణీ! అన్నం అయిందా? "

ఆమె పక్కగా వచ్చి కూర్చుంటూ అడిగింది వేణమ్మ.

"అయిందక్కా" అంటూ సమాధానం చెప్పింది గౌరి.

"నీతో ఒకమాటుంది. సెప్పనా? "

"ఏమ్మాటక్కా? "

"ఏమీ అనుకోవుగదా"

"అనుకోన్లే చెప్పు"

"నిన్ను చూస్తావుంటే బాధగావుందమ్మా!

"ఎందుకు? "

"నిన్ను జూస్తావుంటే, చిదిమి దీపం

పెట్టుకోవాలనిస్తావుంది. ఆ కనుముక్కు తీరు అదీ సూస్తావుంటే... ఇంకా సూద్దామ నిపిస్తోంది. నీమాదిరి సక్కనిబిడ్డె మా ఇండ్లల్లో గూడా లేరంటే నమ్ము"

ఆ మాటలతో సిగ్గు మొగ్గయింది గౌరి.

"అందుకే నువ్వు ఏమీ అనుకోనంటే... కష్టపడకుండా వుండేమార్గం ఒకటి చెబతా వినుకుంటావా? "

తిరిగి తనే అంది వేణమ్మ.

"కష్టపడకుండానే... అంటే? " ఆశ్చర్యంగా అడిగింది గౌరి.

"నీ మొనుసుకు కష్టపెట్టేదయినా ఏమీ అనుకోవు గదా!"మళ్ళీ అడిగింది వేణమ్మ చుట్టూ కలయచూస్తూ.

ఎవరి మాటల్లో వారున్నారు.

ఎవరి తిండిలో వాళ్ళున్నారు.

వాళ్ళనెవ్వరూ గమనించడంలేదు.

"ఫరవాలేదులే చెప్పక్కా!" భరోసా ఇచ్చింది గౌరి.

అయితే సరే... ఏమీలేదమ్మణ్ణీ! ముందు ఈడ కూలిపనులు నీకు నచ్చాయో లేదో చెప్పు"

"నచ్చినా నచ్చకపోయినా చేయాల్సిందే గదా! చేయకపోతే గడవద్దా? నోటికి నాలు గేళ్ళు ఎట్టబోతాయి!"

"అంతేగదా! అదిసరే... మన కాంట్రా ట్టరు నాయుడన్న శానామంచోడు గదా"

చేపకు ఎరవేసే ప్రయత్నంగా అంది వేణమ్మ. తనకిష్టంలేకపోయినా 'మంచోడు గాదు' అని చెప్పేస్తే యాడబొయ్యి యాడొ స్తుందోలే. మంచోడే అంటే పోలా? " అను కొని "మంచోడేలే" అనేసింది గౌరి.

"అందుకే ఆయనకు కష్టాల్లో ఉండేవా ళ్ళకు సాయంజేయాలంటే బలేమునాస. నువ్వంటేగూడా ఆయనకు బలే ఇదిలే"

"'ఇది' అంటే"

"ఇష్టం. అందుకే నీకు సాయంజేయాల నుకుంటావుండాడు"

"సాయమా! నాకా!"ఆశ్చర్యంగా అంది.

"నువ్వంటే ఆయనకు బలేభ్రమగా ఉండాది" అంటూ ఇంకా చెప్పబోయింది.

ఆమాట చెర్నాకోలతో కొట్టినట్టనిపించింది గౌరికి.

"ఏమ్మో... నేనింకా ఏమోననుకుంటి. అసాధ్యురాలుగా ఉండావే. ఏమనుకుంటివి నన్ను. కొంచెం వళ్ళు దెగ్గిరి బెట్టుకోని మాట్టాడు. ఇట్టాంటివి నాదెగ్గిర సెప్పకు" అని మధ్యలోనే అక్కడినుంచి లేచి వచ్చే సింది గౌరి.

అలా తాను పంపిన వేణమ్మ రాయ బారం ఫెయిలవడంతో నాయుడయ్య మనస్సు చివుక్కుమంది. పట్టుదల పెరి గింది. ఎలాగయినా ఆమెను అనుభవించా ల్సిందే అనుకున్నాడు. సమయం కోసం ఎదురుచూస్తూవుండిపోయాడు.

ఇలా మరికొన్ని రోజులు జరిగాయి.

గౌరి కూడా ఆ సంఘటనను మరచి పోయి తన పనిలో తాను మునిగిపో యింది.

ఒకరోజు మధ్యాహ్నం ఇంటినుంచి క్యారి యర్ రాగానే నాయుడయ్య వేణమ్మను పిలిచి చెవిలో ఏదో చెప్పి మూగోని బాయి కాడికి వెళ్ళిపోయాడు.

"ఏం గౌరమ్మా! నేను అన్నానికి ఇంటికి బొయిరావాల... ఇందా ఈ కేరేజి తీసక పొయ్యి. బాయికాడిచ్చిరాపో" అంది వేణమ్మ.

కాదంటే ఏంరాద్ధాంతం జరుగుతుందోనని క్యారియర్ చేతిలోకి తీసుకొని మూగోనిబా యివైపు బయలుదేరింది గౌరి.

అక్కడ చుట్టూ ఎత్తయిన చెరుకుతోటలు. మధ్యలో బావి. దాని పక్కన బావిగడ్డ. ఆ గడ్డన ఓ పెద్దనేరేడిచెట్టు. కొన్ని సీమరాల చెట్లు, ఒక జీడిమామిడిచెట్టు వున్నాయి.

అక్కడ... ప్రకృతి పచ్చగా, చల్లగా ఎంతో ఆహ్లాదకరంగా వుంది.

ఆ బావిగట్టున ఓ పెద్ద మిషన్‌షెడ్డు... ఆ షెడ్డు ముందర ఓ నీళ్ళతొట్టి. షెడ్డులో

నుంచి ఒకపైపుద్వారా నీళ్ళతొట్టిలోకి నీళ్ళు పడి అలాగే దానికిందినుంచి వున్న కాలువ ద్వారా పక్కనే వున్న వరిమడికి వెళుతున్నాయి.

మిషన్ రన్నవుతున్న శబ్దం వినిపిస్తోంది.

ఆ బావిగడ్డన కూర్చొని ఆమెకోసమే ఎదురుచూస్తున్నాడు నాయుడయ్య.

పులి గుహను సమీపిస్తున్న లేడిలా బెదురుతూ బెదురుతూ వచ్చింది గౌరి.

ఆమెను చూడగానే లేచి వచ్చి "షెడ్డులో పల పెట్టు... ముఖం కడుక్కోని వస్తా" అన్నాడు నాయుడయ్య.

గౌరి తటపటాయిస్తూనే షెడ్డులోపలికి వెళ్ళింది. సరిగ్గా అప్పుడే... నాయుడయ్య గుమ్మంలోకి వచ్చి అడ్డుగా నిలబడ్డాడు.

ఆమె బెదిరిపోయి చూసింది.

"వేణమ్మ నీకేమీ చెప్పలేదా?" అన్నాడు కాంక్షగా ఆమె కళ్లలోకి చూస్తూ.

గౌరి ఏమీ సమాధానం చెప్పలేదు.

"నిన్నే... వేణమ్మ చెప్పలేదా?" కొంచెం గద్దించినట్టు అడిగాడు.

భయంతో గౌరి మెల్లగా వణకసాగింది.

"సరేలే... క్యారియర్... తీసి పెట్టు" అన్నాడు తిరిగి తనే షెడ్డులోపలికి అడుగు పెడుతూ.

గౌరి భయపడుతూనే అలాగే గొంతుక్కూర్చొని కేరియర్‌విప్పసాగింది. నాయుడయ్య... మెల్లగా వెళ్లి ఆమె భుజాల్ని పట్టుకున్నాడు.

గబుక్కున పైకి లేచింది గౌరి.

అతను ఒక్కక్షణం కూడా అవకాశం ఇవ్వలేదు. వాటేసుకున్నాడు.

"వదులు వదులు" అంటూ గింజుకోసాగింది గౌరి.

రోజుకొక్క ఆడకూలి... నాయుడయ్యకు క్యారియర్ ఎందుకు మోస్తారో, వేణమ్మ వారికి క్యారియర్ ఇచ్చి ఎందుకు పంపుతుందో అప్పుడర్థమైంది గౌరికి.

"ఉండే లచ్చీ... ఇంక తప్పించుకోలేవు గానీ నా మాటినను సుఖపడతావు" అని తమకంతో ముద్దుపెట్టుకోబోయాడు...

"ముండనాబట్టా! వదల్రా" అని అతన్ని ఒకవైపు తిడుతూనే "అప్పా! అప్పా!" అంటూ గట్టిగా అరవసాగింది.

ఇక వదలకపోతే తనగుట్టు ఎక్కడ రట్టవుతుందోనని కాస్త జంకాడు నాయుడయ్య.

దాంతో గబాలున అతని కౌగిట్లోనుంచి తప్పించుకొని షెడ్డు వెలుపలికి వచ్చేసింది.

సరిగ్గా అప్పుడే కొందరు కూలీలు నీళ్ళు తాగడానికి అటువైపుకు రావడంతో... అతని ప్రయత్నం విఫలమైపోయింది.

బతుకుజీవుడా అనుకుంటూ అక్కడి నుంచి వచ్చేసింది గౌరి.

అప్పటికే కుశాలన్న అన్నం తినేసి 'ఎక్కడబోయిందబ్బా!' అనుకుంటూ ఆమెకోసమే ఎదురు చూస్తున్నాడు.

"అప్పా! నేనింక పనిచెయ్‌లేను బేగ్గా ఇంటికి పోదాంపద" అంది సీరియస్‌గా గౌరి.

ఆ మాటవిని ఒక్కసారిగా కంగారుపడిపోయాడు కుశాలన్న.

"ఏం జరిగింది. అసలు ఏమైంది?" ఆత్రతగా ప్రశ్నించాడు.

"ఏం లేదు... వళ్ళు బాగలా" తనను తాను సంబాళించుకుంటూ చెప్పింది.

"ఏమైంది తల్లీ!" బెంబేలుపడిపోయాడు.

"ఏంలేదు. తలనొస్తావుంది. కడుపు వడేసివడేసి నొస్తావుంది. పదప్పా పోదాం" అని... అతని పక్కనే వున్న క్యారియర్‌ను చేతిలోకి తీసుకుంది.

బాయిదగ్గర జరిగిన సంఘటన వెంటనే చెబితే ఏం రాద్ధాంతం జరుగుతుందోనని గౌరి ఆ విషయం అప్పుడు చెప్పలేదు. ఇంటికి వచ్చింతర్వాత సూచాయగా చెప్పింది.

జరిగింది తెలుసుకున్న కుశాలన్న 'వయసు బిడ్డె'ను కూలిపనికి తీసకపోవడం నాదే తప్పు. 'ఇకమీదట బిడ్డెను ఏ పనికీ

తీసకపోకూడదు' అనుకుంటూ వుండిపోయాడు.

కానీ పెళ్ళి కావాల్సినపిల్లనీ, పేదవాడి కోపం పెదవికి చేటుగదానీ భావించి నాయుడయ్యను ఏమీ అనలేకపోయాడు కుశాలన్న.

ఈ సంఘటనవల్ల అతనిలో కాస్తమార్పు వచ్చింది. ముందులాగా అందరితో చనువుగా ఉండడం మానేశాడు. జీవితం నేర్పిన అనుభవాలు, గుణపాఠాలు అతన్ని గంభీరంగా మార్చాయి. అంతకన్న ముఖ్యంగా తాగుడు మానేశాడు.

## గోపాలకపర్వం!



**ఊ**ర్లో వాళ్ళ ఆవులు మేపుతున్న మాల కొండయ్య అనారోగ్యంపాలై ఆ పని విరమించుకున్నాడు. రైతులు ఎవరి ఆవుల్ని వారు విడివిడిగా మేపుతూ పనులు చేసుకోవడానికి యాతన పడిపోతున్నారు.

కుశాలన్న మాత్రం ఏ పనులూ దొరక్క ఇబ్బందిపడిపోతున్నాడు. బతుకు చితికిపోయిన కుశాలన్నను రైతులు కొందరు తమ ఆవుల్ని మేపుకురమ్మని అడిగారు. రోజుకొక ముద్ద అన్నం, పసరానికి నెలకు అయిదు రూపాయలు చొప్పున ఇచ్చేటట్టుగా నిర్ణయం జరిగింది. కరువు కాలానికి ఆ పనైనా కుదిరినందుకు కుశాలన్నకు కాస్త ఊరట కలిగింది.

ఆరోజు ఉదయం తొమ్మిది గంటల సమయం.

సంగటితట్ట అడుగుభాగాన శుభ్రమైన తడిబట్టను పరచి అందులో ఒకవైపు రెండు సత్తుచెంబులు పెట్టుకొని ఊర్లో అన్నానికి బయలుదేరింది గౌరి. ముందుగా గుర్రం కొండోళ్ళ పెద్దక్క ఇంటిముందర తట్ట ముందు పెట్టుకొని కూర్చొని "గుర్రంకొండోళ్ళ పెద్దమ్మా ఆవులోళ్ళకు సంగటి పెట్టు" అని కేకేసింది.

పొయ్యిమీద ఉడికిన సద్దనూకల్లో అంత పిండిపోసి, మూరెడు పొడువున్న 'సంగటికట్టె'తో కెలుకుతోంది ఇంట్లోయమ్మ.

"పెద్దమ్మో! ఆవులోళ్ళమొచ్చినాం. అన్నం బెట్టు" మళ్ళీ అరచింది గౌరి.

"ఆఁ... వస్తాండు... అమ్మణ్ణీ!" అని పక్కనున్న చిప్పకట్టెతో 'కొంచెం' కెలికిన అన్నం మూకుట్లోకి తోడుకొని చేతికి నీటిని తడుపుకొని తడుతూ ముద్ద చేసింది. ఒక చిన్న గ్లాసులో కాస్తంత కూర పోసుకుంది. ఆ రెంటినీ తెచ్చి గౌరి తట్టలో వేసింది.

ఆ తట్టను సంకన బెట్టుకొని పక్కింటి ముందరకు వెళ్ళి కూర్చొని "ఓ నాగమ్మ చినమ్మా... ఆవులోళ్ళం వచ్చినం అన్న మెయ్యి" అంది. ఆ మాట విని హడావిడిగా వెలుపలికి వచ్చింది నాగమ్మ.

"సంగటి కెలకతావుండా. అలసందల పులుసుకని... పొయ్యిమీద అలసందలుడకతండాయి. వొగ్గెడివు (ఒక ఘడియ) అట్ట పొయ్యిరా పాపా... ఎంతసేపులే. మీ నాయన కూతేసేసందికి అయిపోతుంది"

ఆలస్యమైనందుకు అభ్యర్థించింది.

"అట్టేగానీ సిన్నమ్మా... ఆవేరకు అట్ట దిగవీధికి పొయ్యొస్తా" అని ఆ తట్టను తిరిగి చంకనబెట్టుకొని దిగవీధికి బయలుదేరింది గౌరి.

అప్పుడే ఎదురుపడింది పోతన్నగారి పావులమ్మ.

"ఏమమ్మణ్ణీ. సంగటి పెట్టించుకునేది

అయిపోయిందా? " అని పలుకరించింది.

"లేదత్తా! ఆ పనిమీదనే వుండా" అంది గౌరి.

"కొందరు ఆవులమేపుకు వదల్తారుగానీ అన్నం సరిగా యెయ్యరు. నువ్వేమీ వప్పు కోవద్దు కోడలా. ఏమీ బలవంతం లేదు" వెళ్తున్న గౌరినే చూస్తూ అంది పావులమ్మ.

"సూడొదినా బంగారట్ల బిడ్డెలు. పిల్లోడు శక్రవర్తిమాదిరుండాడు. ఈ బిడ్డె సుక్కల్లో సందమామ మాదిరి వుంది. ఇట్టాంటి బిడ్డెల్ని వదిలేసి పాయనే వీళ్ళమ్మ"

గౌరి స్థితికి బాధపడిపోతూ అంది నాగమ్మ.

"ఆయప్ప ఇంట్లోనుంచి ఎళ్ళగొట్టేస్తే... ఇంకేం చేస్తుంది ఆయమ్మ" అంది పావులమ్మ.

"ఇవన్నీ కర్మాలొదినా కర్మాలు. లేకుంటే ఇంత సక్కని బిడ్డెకు ఎన్ని కష్టాలో సూడు"

"పెండ్లి జేయాల్సిన పిల్ల... ఎప్పుడు వొకింటిదవుతుందో... ఎప్పుడు పిల్లాపాప కలగతారో ఏమో?"

"అవునొదినా... కంటికి ఇంపుగా వుండాది. అసలే మనూర్లో పిలగోళ్లు మంచోళ్లు గాదు"

"ఆయమ్మి జోలికి ఎవురూ పోర్లే వదినా... గొప్ప బుద్ధి. మంచిబిడ్డె. అందు కనీ అందరూ మరేదగా జూస్తారు. ఆయమ్మి నడవర్తి (నడవడిక) అంత మంచిది"

"ఇట్టాంటి బిడ్డే మనకున్నింటే... కండ్లల్లో బెట్టుకోని సూసుకోమూ"

"మంచి కష్టజీవి. మొగున్ని కూసోని పెట్టి కూలీనాలీ అయినా జేసి సాకుతుంది. అట్టాంటి బిడ్డె"

"అందుకే ఆయమ్మి కష్టం చూసైనా ఎవురో ఒకరు పెండ్లి చేసుకుంటార్లే. పొయ్యిమీద సంగటి మాడిపోయేట్టుగా వుందొదినా వస్తా" అని నాగమ్మ ఇంట్లోకి వెళ్ళిపోయింది.

గౌరి పల్లెమీద వేయించుకొచ్చిన అన్నంకూరా కడుపునిండా తిని, ఒక ముద్ద సంగటి, ఒక చిన్న బుడిగెలో అంత కూర వేసుకుని చిక్కెంలో పెట్టుకొని, ఓ ఊతక ర్రను చేతబట్టుకొని "ఆవలిడండమ్మో... ఆవలిడండీ" అంటూ వీధిలో కూతవేసు కుంటూ పోతున్నాడు కుశాలన్న.

గెల్లపల్లోళ్ళ యల్లమ్మ ఇంకా ఆవు దగ్గర పాలు పిండుతూనే వుంది.

"ఏమి యల్లక్కా తొందరగ్గానీ పొద్దు మీరిపాయ" అని తొందరచేశాడు కుశాలన్న.

"అయిపాయలే అన్నా... నువ్వు ఈ ఎగ వవీధినించి దిగవీధికి పొయ్యేలోపల ఆవును ఇడిసిపెట్టేస్తాలే"

ఇంటిముందర పందిరికింద కాళ్ళకు ఉరి వేయబడివున్న ఆవు, యల్లమ్మ పాలు పిండుతుంటే దాని ముందర రాతికూసానికి కట్టివున్న దూడను ఆప్యాయంగా నాకు తోంది.

ఆ ఆవుదూడను చూసుకుంటూ కూత వేసుకుంటూ ముందుకు వెడుతున్నాడు కుశాలన్న. అతని కూతవిన్న రైతులు వ్యవ సాయం చేసే ఎద్దుల్ని, కోడెల్ని అలాగే ఉంచేసి ఆవుల్ని, ఎడదూడల్ని మూగతరు పుల్ని మాత్రం కట్లువిప్పి వీధిలోకి తోలుతు న్నారు.

అలా వీధిలోకి వచ్చిన ఆ గొడ్లనన్నింటినీ గుంపుగా చేర్చుకుంటూ వీధి చివరికి తోలు కుపోతూ తండ్రికి సహకరిస్తోంది గౌరి.

చిన్న పెయ్యల్ని వదిలి వెళ్ళలేని ఆవుల అరుపులతోను, తమ తల్లుల్ని వదిలి ఉండ లేని పెయ్యల 'అంబా'రావాలతోను పల్లె ప్రతిధ్వనిస్తోంది.

అలా అందరి ఆవులూ వచ్చేసింతర్వాత "అమ్మణ్ణీ. భద్రం తల్లీ... ఈరోజు పొద్దుక ల్లనే వచ్చేస్తాలే. ఇంక నువ్వు ఇంటికి పోతల్లీ" అని కూతుర్ని వీడ్కొని, చీనీతోపు పక్కగా ఆవుల్ని తోలుకొని వెళ్ళిపోయాడు కుశాలన్న.

అతను అలా వెళ్ళగానే తిరిగి ఇల్లు చేరు కుంది గౌరి. ఇంట్లో పనీపాటాలేదు. ఆమెకు ఏమీ తోచలేదు.

మధ్యాహ్నం అన్నం తినడం ముగించి నట్టింట్లో కాసేపు నడుంవాల్చింది. పగటి నిద్ర అలవాటు లేనందువల్ల కాబోలు ఆమె కంటికి కునుకు రావడంలేదు. ఏవేవో ఆలో చన్లు. మనసు స్థిరంగా ఉండడంలేదు. పరి పరివిధాల పరుగెడుతోంది.

ఇలా చాలాసేపు గడిచింతర్వాత పొయ్యి లోకి కట్టెలైపోయి ఉండడం గుర్తుకొచ్చింది. దాంతో ఊరికే ఉండి ఏం చేయాలి. దట్ల పొయ్యి తోపుల్లో ఎండిపోయిన పుల్లలు గట్టార ఏరుకొనొస్తే పోలా! అనుకుంటూ లేచి మూల వుండే మచ్చుకొడవలి చేతికి తీసుకుంది. దండెంపైనుండే ఒక పాత టవల్ తీసి భుజాన వేసుకుంది. ఇంటి ముందర పందిరికింద ఓ మూల వున్న తట్టను తీసుకొని తలుపు మూసి బీగం వేసుకొని చీనీతోపు వైపుకు బయలుదేరింది.

అది చాలా విశాలమైన తోపు. చుట్టూ కంచె. దాని మధ్యలో ఒక దిగుడుబావి. ఆ బావిలో ఎక్కడో అడుగుభాగాన నీళ్లు కనిపి స్తున్నాయి.

ఆ తోపులో మామిడిచెట్లు, ముంతమా మిడి చెట్లు, చీనీ చెట్లు దట్టంగా కనిపిస్తు న్నాయి.

కంచె పక్కగా అక్కడక్కడా పెద్ద పెద్ద చింతచెట్లు, సీమరాల చెట్లు... కంచె పొడు గునా లోపలివైపుకు 'కలబంద' చెట్లు వున్నాయి.

ఆ తోపుకు పడమటి పక్కన పల్లెకు వెళ్ళే దారి. తూర్పువైపున దిగుడుబావికి సమీ పంలో తోపులోకి వెళ్ళడానికి ఉన్న ఒకే ఒక దారి అదీ మనిషి పోయేంత ఇరుకైనదారి.

తోట పంటపైనున్నప్పుడయితే ఎవ్వరినీ లోపలికి పోనీయరు. మిగతా సమయంలో పెద్దగా పట్టించుకోరు. అది పంటలకాలం కాకపోవడంతో ఆ తోపులోకి వెళ్ళింది గౌరి.

అది సాయంత్రం మూడు గంటల సమయం.

చెట్లలో ఎండిపోయిన పుల్లల్ని విరిచి ఒక చోట కుప్పపెట్టింది. అలాగే ఎండిన కల బంద పట్టల్ని వాటి మొదళ్లను సేకరించి ఒకచోట కుప్ప పెట్టింది. ఇంక అన్నీ తట్టకు పేర్చుకొని వెళ్ళడమే. ఆ పనికి సుమారు గంటపైనే పట్టింది. చివర బావిగట్టున ఎండిన ఒకచిన్న సీమరాల మొక్క ఆమెను ఆకర్షించింది. దాని పక్కనే ఒక చిన్న పుట్ట, దానికపతల మరోచిన్న 'గబ్బోటాకు'పొద.

కలబంద పొదల్లో ఎండిన పట్టల్ని తీసు కుంటే ఏమీ అనరుగానీ, ఎండిన మామిడి కట్టెల్నిగానీ, అక్కడున్న సీమరాల మొక్కల్ని గానీ కొడితే మాత్రం తిడతారు. అది తెలిసీ గౌరి ధైర్యం చేసింది. ఈ సాయంత్రంవేళ ఇక్కడికి ఎవరొస్తార్లే అనుకుంది. దాన్ని కొట్టుకొనిపోతే రెండు రోజులు వంటకు సరి పోతుంది. అనుకుంటూ కొడవలి చేతబట్టు కొని ఆ గడ్డపైకొచ్చింది. ఎవరయినా ఉన్నా రేమోనని చుట్టూ ఒకసారి కలియచూ సింది. ఆవేళ అక్కడ ఎవ్వరూ ఉన్నట్లు అనిపించలేదు.

మెల్లగా వంగి ఎక్కువ శబ్దం కాకుండా ఆ మొక్కను నరకసాగింది. పక్కనేవున్న పుట్ట కత్తివేటు పడుతున్న ప్రతిసారీ కొద్ది కొద్దిగా కదుల్తోంది.

ఆమె మొక్కను నరకడంలోనే నిమగ్నమై వుంది.

అదే ఆమె చేసిన పొరపాటు.

రెండు తీక్షణమైన కళ్లు ఆమెనే గమనిస్తు న్నాయని ఆమెకు తెలీదు. అదే సమ యంలో కదిలిపోయిన పుట్టలోనుంచి ఒక నడివయసు నాగుబాము సర్రున వెలుపలికి వచ్చి ప్రాణభయంతో పక్కనే వున్న గబ్బో టాకు పొదలోకి దూరింది. ఆ విషయాన్ని గౌరి గమనించనేలేదు.

ఆ శ్రమకు పట్టిన చిరుచెమటలు ఆమె ముఖానికి కొత్త అందాల్ని తెచ్చి పెడుతు

న్నాయి అప్పుడప్పుడూ పైటతో ముఖానికి పట్టిన చెమటను తుడుచుకుంటూ నరుకుతోంది. ఇంతలో ఆమె భుజాన ఏదో ప్రాకినట్లనిపించి ఉలిక్కిపడి వెనక్కి చూసింది.

ఆమె భుజాల్ని స్పృశిస్తూ... ఎదురుగా వికారంగా నవ్వుతూ మంగరాజు ఎక్కడినుంచి ఊడిపడ్డాడో గానీ, తన్మయత్వంతో ఆమె అందాల్ని కళ్ళతోనే తాగేస్తున్నాడు.

ఆ తోపులో, ఆ స్థితిలో అతన్ని చూసిన గౌరి గుండెలవిసిపోయాయి. భయంతో కొడవలి విసిరివేసి పరుగెత్తుకుంటూ గడ్డ కిందికి వచ్చేసింది.

ఆమె విసరిన ఊపుకి కొడవలి వెళ్ళి తోపులోకి వచ్చేదారిలో పడ్డది.

అలా గడ్డకిందికి వెళ్ళడమే ఆమె చేసిన మరో పొరపాటు. గడ్డపైన అలాగే వుండి వుంటే దారినపోయేవాళ్ళు కనిపించేవారు. గడ్డకిందకి పోతే ఇక ప్రపంచమే కనిపించదు.

ఒకవైపు బావిగడ్డ. మరోవైపు దట్టంగా వున్న మామిడిచెట్లు.

వెంటపడ్డ మంగరాజు అప్పటికే ఆమె పైటను చేతికి దొరకపుచ్చుకున్నాడు.

"వసేయ్. మరేదగా లొంగిపో. నేను సెప్పినట్టినుకో. మీ నాయన బాకీ కొట్టేస్తా ఈ కరువుకు సరిపోయేంత బత్తెమిస్తా. లొంగిపో" అంటూ గట్టిగా కావలించుకున్నాడు.

"సామే... నేనట్టాటిదాన్ని కాను. నీకు దండం పెడతా. నన్నొదిలేయి" చేతులు జోడించి అర్థించింది.

అతని కసాయిగుండె కరగలేదు.

"యాడనే మీరంత సొక్కం సంసార్లు. నిన్ను గన్న మీయమ్మే వొగ బజారు ముండ. పచ్చి యభిశారి లం... ఎందుకూ రికే కతలు చెప్తావ్‌గానీ... మరేదగా నా మాటినికో" బెదిరింపుగా అన్నాడు.

తల్లి దుశ్చరిత్ర బిడ్డలపైన ఎలాంటి దుష్ప్రభావాన్ని చూపుతుందో మొదటిసారిగా ఆమెకు అర్థమైంది. ముఖ్యంగా ఆడపిల్లలపైన, వారి వంశచరిత్రలు ఎలాంటి పరిస్థితిని కల్పిస్తాయో కూడా అవగతం అయింది. ఇంకా కుంగిపోయి నోటిమాట రాకుండా అయిపోయింది.

ఆమె ఎంత వేడుకున్నా అతను వినలేదు.

ఆమె అలా వేడుకునేకొద్దీ ఆమెను పొందాలన్న ఆకాంక్ష అతన్లో ఎక్కువైంది.

దాంతో ఆమె పైటను లాగేశాడు.

బైటపడిన అందాలను తన రెండు చేతుల్తో కప్పిపెట్టడానికి ఆమె ప్రయత్నిస్తూనే వుంది.

"అయ్యా! పెళ్ళి కావాల్సినదాన్ని. నన్నేమీ చేయొద్దు" అతని కాళ్ళపైనబడి వేడుకుంది.

"పెళ్ళి కాలేదనేనే నీమీద నాకు మొనుసు ఇంకా రెచ్చిపోయాడు.

అతని బిగికౌగిట్లో ఆమె గింజుకోసాగింది.

నిస్సహాయంగా అరుస్తోంది. కేకలు పెడుతోంది. "వోరే నీయాలీ ముండ మొయ్యా. నీ తాడుదెగా. రాక్షసుడా నన్నిడిసిపెట్టు" ప్రాణభయంతో రొప్పుతోంది.

అదే సమయంలో అడవినుంచీ తిరిగి పల్లెకు ఆవుల్ని తోలుకువస్తున్న కుశాలన్న చెవిన ఆ మాటలు పడనేపడ్డాయి.

కంచెపైగా నిక్కి చూశాడు.

అరుపులు తప్ప తనకేమీ కనిపించలేదు.

ఇంతలో అతని పట్టునుండి ఉన్నట్టుండి తప్పించుకుని గట్టుపైకి వచ్చేసింది గౌరి.

"వొరే! నా దగ్గరికి రావద్దు. వద్దూ" అంటూ వెనక్కి అడుగులు వేసుకుంటూ నడుస్తోంది.

వెనకనే బావి!

అయినా అతను ఆగలేదు.

ముందుకు వస్తూనే వున్నాడు.

"వద్దు... రావద్దు"

ఆమె వెనక్కి నడుస్తూనే బావిని సమీపిస్తోంది.

అక్కడ బావివున్న స్పృహ కూడా ఆమెకు లేనట్టుంది. అలాగే వెనక్కి వస్తూ వస్తూ అంతవరకు తాను నరికిన సీమరాల మొక్క ఆమె కాలికి అడ్డుపడి నిలదొక్కుకుంటూ ఒక కాలును పక్కనే వున్న 'గబ్బోటాకు పొద'పైన వేసింది.

పొదలో అంతవరకు చుట్ట చుట్టుకొని వున్న నాగుబాము కస్సున నోరుతెరచి తల పైకెత్తి నేలకేసికొట్టింది. కొంచెమైతే ఆ కాటు ఆమె కాలికి తగిలేదే. కానీ అదృష్టవశాత్తు అప్పుడే ఆమె తన కాలును పొదపై నుంచీ ఎత్తి పక్కన పెట్టింది. దాంతో రెచ్చిపోయి అలాగే ఉండిపోయింది పొదలో పాము.

"నువ్వు సచ్చినా వదల్నే నీయబ్బడాలా!" అంటూ అతను ఆమెను సమీపిస్తూనే వున్నాడు.

ఆమె వెనక్కి! అతను ముందుకు!

అప్పటికే ఆమె బావిగట్టు అంచున నిలబడివుంది. తెరుచుకున్న మృత్యు గహ్వారంలా కనిపిస్తోంది బావి. అయినా అతను ముందుకు రావడం మాత్రం ఆపలేదు. ప్రాణాలు తోడబోయే యమకింకరుడిలా అతను వస్తూనేవున్నాడు. అతన్లో వెనక బావి వున్నందున ఇక తప్పించుకోలేదు అన్న ధీమా! ఆమెది అసలక్కడ బావి వున్నట్లు గ్రహించేస్థితిలో లేని పరిస్థితి! ఇక అతని చేతికి చిక్కబోయేంతలో, ఉన్నట్టుండి ఒక గావుకేక పెట్టి ఆ బావిలోకి అలాగే పడిపోయింది గౌరి.

దాంతో గుబుక్షున పెద్ద శబ్దం చేసుకుంటూ బావిలో నీళ్లు అల్లకల్లోలమయ్యాయి.

సరిగ్గా అదే సమయంలో అక్కడికి వచ్చిన కుశాలన్న 'గౌరీ' అని పెట్టిన కేక ఆ నీటి శబ్దంలో కలిసిపోయింది.

అతనూ అలాగే బావిలోకి దూకేశాడు.

ఈ హఠాత్సంఘటనకు బెంబేలుపడిపోయిన మంగరాజు తత్తరపాటుతో గబ్బోటాకు పొదపైన కాలు పెట్టాడు.

సరిగ్గా ఆ కాలు వెళ్ళి పొదలో దాగివున్న నాగుబాము నడుంపైన పడ్డది.

ఆ మరుక్షణం కస్సున లేచిన నాగసర్పం బలంగా అతని కాలుపైన కాటువేసి మెలితిరిగి గబగబ అక్కడినుంచి వెళ్ళిపోయి కలబంద పొదల్లో కలిసిపోయి కనిపించకుండా పోయింది.

"గౌరీ! గౌరీ!" అంటూ నీటిలోనుంచి గౌరిని భుజాన మోసుకొని పైకొచ్చాడు కుశాలన్న.

కానీ అప్పటికే ఆలస్యమైపోయింది.

ఆమె అప్పటికే శవంగా మారిపోయి వుంది. అతను కూతురిమీదపడి నెత్తీనోరు కొట్టుకుంటూ గట్టుపైనుంచి అటువైపుకు దొర్లుకుపోయిన మంగరాజును గమనించనే లేదు. ఆ మరునాడు ఉదయం పదిగంటలకంతా బండారోళ్ళ పల్లెకుత్తరాన ఉన్న కుమ్మరకుంటలో గౌరి శవం, అదే సమయంలో దాసపల్లెకు దక్షిణంగా వున్న నాయకురాలు చెరువులో పాము కరచి చనిపోయిన మంగరాజు శవం ఒకేసారి భూమిలో కప్పివేయబడ్డాయి.

అలా అన్నీ పోగొట్టుకున్న కుశాలన్న ఆపైన ఆ ఊర్లో ఉండలేకపోయాడు.

ఆ ఊరొదలి, ఆ జిల్లా వదలి నెల్లూరు సీమ వెళ్ళిపోయాడు. అక్కడే అన్నీ మరచిపోయి ఓ భూస్వామి దగ్గర సేద్యాన్ని చేసుకుంటూ చాలా ఏండ్లు ఉండిపోయాడు.

అక్కడే అతనికి క్షత్తులారం వచ్చి అద్దాలు వేసుకున్నాడు.

## దరిద్రుడు కాశీకి పోయినా...

అది నెల్లూరు సీమలో ఓ మారుమూల పల్లె....

ఆ పల్లెకు ఫర్లాంగు దూరంలో ఓ పదెకరాల నిమ్మతోట. అందులో అక్కడక్కడా పదిపది హేనడుగుల ఎత్తున్న కొబ్బరి

చెట్లు....

ఆ తోటమధ్యలో ఓ పూరిపాక...

కమ్మని నిమ్మచెట్ల వాసనతో... చల్లని వాతావరణంతో ఒక మునివాటికలా వుంది ఆ ప్రదేశం.

ఆ పూరిపాక ముందర ఓ గొట్టపు బావి.... దానికొక మిషన్. ఆ గొట్టం బావి నీరే ఆతోటకాధారం.

రోజూ ఉదయాన లేచివెళ్ళి మిషన్ వదిలి ఆ చెట్లకు నీళ్ళు పెట్టడం... ఆ కలుపుమొక్కల్ని తీసేసి ఆ తోటను శుభ్రంగా ఉంచడం... అదే అతను చేసేపని....

ఇతర వ్యవసాయ పనులతో పోల్చుకుంటే... అదేమంత కష్టమైన పనేంకాదు.

వేళకంత తిండి, నిద్ర జీవితం సుఖంగా నేవుంది. ఎలాంటి బాధలూలేవు.

ఓరోజు మధ్యాహ్నంవేళ... కుశాలన్న... తోటలో తిరుగుతూ కనిపించిన కలుపుమొక్కల్ని పీకి చుట్టూ వేసివున్న కంచెపైకి చేరుస్తున్నాడు.

ఎండతాపం ఎక్కువగా వుంది. ఆ ఎండలో తిరగడంవల్ల కాబోలు దాహంవేసింది. నీళ్ళు తాగాలనుకున్నాడు.

పాకలోకివచ్చి స్టార్టర్ నొక్కాడు. ఊహు... అది స్టార్ట్ కాలేదు. కరెంటు కట్!

బాగా దప్పిక వేస్తోంది. ఏం చేయాలి?

ఒక్కక్షణం ఆలోచించి పాక వెలుపలికి వచ్చి తోటంతా ఒక్కసారి కలయచూశాడు.

ఆ ఎండకు నిమ్మచెట్లన్నీ ముడుచుకుపోతున్నట్టనిపించింది.

అలా చూస్తున్న అతని దృష్టిని ఎదురుగా వున్న రెండు కొబ్బరిచెట్లు అయస్కాంతంలా ఆకర్షించాయి.

వాటిలోని లేతకొబ్బరి కాయలు గుత్తులుగా వేలాడుతూ నోరూరించాయి.

'ఒకరెండు కాయలు కోసుకొని తాగితే పోలా... పాణానికి కొంచెం అల్త (ఆయాసం) తగ్గుతుంది' అనుకున్నాడు.

అనుకోవడమే తడవుగా ఒకచెట్టు దగ్గరికి వెళ్ళి, తొడుక్కున్న ముతక చొక్కాతీసి పక్కనపెట్టాడు. కట్టుకున్న పంచె గోచీ పెట్టుకొని బాగా ఎగచెక్కాడు.

అప్పుడప్పుడు కొబ్బరిచెట్లెక్కడం అతనికలవాటే...

ఆ అనుభవంతోనే రెండుచేతులతో చెట్టును అబ్బిలించుకొని, మెల్లమెల్లగా ప్రాకి చెట్టుకొసకు చేరుకున్నాడు.

నెమ్మదిగా ఒకచేత్తో, ఒక కొబ్బరికాయను మెలితిప్పి తొడిమ తెంచాడు. అది దబ్బుని శబ్దంచేసుకుంటూ కిందపడ్డది. మరోకాయను అలాగే మునివేళ్ళతో పట్టుకొని మెల్లగా మెలితిప్పసాగాడు.

చెట్టును పట్టుకున్న చేయి మంటపెట్టింది.

దాంతోమెల్లగా పట్టుకోసం కాయకు పైనున్న ఓ కొబ్బరిమట్టను ఒకచేత్తో ఆసరాగా పట్టుకున్నాడు.

అతను గమనించలేదు. అది ప్రాణం లేని మట్ట!

పూర్తిగా పండిపోయి ఎండుతున్న మట్ట.

అందుకే అతనలా దాన్ని పట్టుకోగానే, అతని శరీరం బరువుకు ఒక్కసారిగా పుటుక్కున దాని మొదలు చెట్టునుంచి విడిపోయింది. దాంతోపట్టు తప్పి కుశాలన్న నేల కూలిపోయాడు.

ఆ తర్వాత ఏం జరిగిందో అతనికి తెలీదు.

కళ్ళు తెరచి చూసేసరికి ఆసుపత్రిలో బెడ్‌పైన వున్నాడు.

తోట చూడడానికి వచ్చిన ఆ తోట యజమాని... కొబ్బరి చెట్టుకింద అచేతనంగా పడివున్న కుశాలన్నను చూసి ఆసుపత్రికి చేర్పించి చికిత్స చేయించాడు. అప్పటికే అతనలా పడి చాలా సేపయింది. అతనలా రావడం ఏమాత్రం ఆలస్యం చేసివున్నా కుశాలన్న దక్కేవాడేకాదు.

ఆసుపత్రిలో బెడ్‌పైన కదలలేని స్థితిలో

కుశాలన్న... శరీరమంతా నిస్సత్తువుగా ఏదో చెప్పలేని బాధగా అనిపించింది. తలను అలా ఇలా తిప్పిచూశాడు.

తల బాగానే వుంది.

చేతులు బాగానే కదిలాయి. కాళ్ళు కదిలించడానికి ప్రయత్నించాడు. అవి కదలలేదు. మళ్ళీ ప్రయత్నించాడు. కదల్లేదు.

అలా మళ్ళీ మళ్ళీ ప్రయత్నించాడు. అయినా నడుముగానీ, కాళ్ళుగానీ కదల్లేదు.

కాళ్ళు బరువుగా, తిమ్మిరిగా... ఇనుపస్తంభాల్లా అనిపిస్తున్నాయి.

కాళ్ళకేమైందోనని కంగారుపడిపోయాడు.

తనకేమైందో... దగ్గరెవరయినా వుంటే అడగాలనుకున్నాడు.... చుట్టూ చూశాడు.

అదొక చిన్న హాస్పిటల్... అందువల్ల మూడునాలుగు బెడ్లు మాత్రమే వున్నాయి. అందులో రెండు బెడ్లపై ఇద్దరు పేషెంట్లున్నారు. వారేదో ముక్కుతూ మూల్గుతున్నారు.

ఇంకెవర్నడగాలబ్బా అనుకున్నాడు.

ఇంతలో తెల్లటి డ్రస్సులో... హంసలా వయ్యారంగా నడుచుకుంటూ వచ్చి అతన్ని చూసింది నర్సు.

అతను స్పృహలోకి రావడం గమనించి 'ఏమయ్యా! ఇప్పుడెట్టుంది?' అని ఆప్యాయాన్ని వలకబోస్తూ పలుకరించింది నర్సు.

"నాకేమైంది నర్సమ్మ...ఏమైంది... కాళ్ళు కదల్లా ఏమైంది?" గాబరాపడిపోతూ అడిగాడు కుశాలన్న.

"ఏం కాలేదులేవయ్యా! చెట్లోనుంచి పడిపోతూనే నడుములు పోయాయ్ అంతే... కొద్దిరోజులు వైద్యం చేయించుకుంటే బాగయిపోతుంది... అంతే..."

అని అతనికి స్పృహవచ్చిన విషయం డాక్టర్‌కు చెప్పడానికని అక్కడినుంచి వెళ్ళిపోయింది.

కొంతసేపటికి డాక్టర్‌తోబాటు నర్సు తిరిగివచ్చింది. కుశాలన్న యజమానీ అతని వెంటవచ్చాడు.

"ఆ... మొత్తానికి నువ్వు చాలా అదృష్టవంతుడివయ్యా. చెట్టుమీదనుంచి పడితే నడుములు పోవడమేగాక సామాన్యంగా ఉచ్చుకు, దొడ్డికి కష్టమయిపోతుంది. నీకు మాత్రం కాళ్ళు మాత్రమే చచ్చుబడిపోయాయి. సమయానికి మీ యజమాని హాస్పిటల్‌లో చేర్పించాడు కాబట్టి సరిపోయింది." అని పొట్ట వత్తుతూ... "సిస్టర్... ఇంజక్షన్" అని అన్నాడు.

తలూపి... లోపలికెళ్ళి ఇంజక్షన్ తీసుకువచ్చి, యిచ్చింది సిస్టర్.

డాక్టర్ సిరంజిని అందుకొని ఇంజక్షన్ చేసి వెళ్ళిపోయాడు. కుశాలన్న యజమాని, నర్సు అతన్ననుసరించారు.

"ఏమి డాక్టర్... ఎలా అతని పరిస్థితి?" అడిగాడు ఆ యజమాని.

"అతనికెవరన్నా వున్నారా?" డాక్టర్ ప్రశ్నించాడు.

"అతనిది దక్షిణ దేశం గావాల... ఎప్పుడూ నా సొంతూరు ఇదీ అని వాడు చెప్పలేదు."

ఎవరయినా అతన్ని జాగ్రత్తగా చూసుకుని ఎక్సర్‌సైజ్ చేయిస్తూవుంటే కొన్ని సంవత్సరాలకి తిరిగి కాళ్ళువచ్చే అవకాశం వుంది.... మరి మీరేం చేస్తారు?"

"ఇదెక్కడి శని డాక్టర్! నాకు తగులుకుంది. రెండేళ్ళ క్రితం వచ్చి మీతోట చూసుకుంటానయ్యా... అంత తిండీ బట్టా ఇవ్వండి మీ దగ్గరే పడుంటాను అంటే మాయింట్లో పెట్టుకున్నాం అంతే"

"సరే... ఇంక హాస్పటల్‌లో వుండడం వేస్టు.... రేపే డిశ్చార్జి చేస్తాం... మీరు తీసుకెళ్తారా..."

"మా యింటికి నేనెట్టా తీసుకుపోతానండీ.... అతనిష్టం... మీరు డిశ్చార్జి చేసెయ్యండి... ఇక నేనొస్తాను డాక్టర్"

"ఒకే... వెళ్ళిరండి..."

అలా డాక్టర్‌కు, అతని యజమానికి

సాగుతున్న సంభాషణ అతనికి స్పష్టంగానే వినిపించింది.

అనుకున్నట్లు ఆ మరునాడు అతన్ని డిశ్చార్జి చేసేశారు. అతని యజమాని కనీసం చూడ్డానికయినా రాలేదు.

ఒంటరితనం తాలూకు భయం జీవితంలో మొదటిసారి కలిగింది కుశాలన్నకు.

ఇప్పుడింక ఏంచేయాలి? అనుకున్నాడు.

అతనికి ఏమీ తోచలేదు.

హాస్పిటల్ వారే రెండు కట్టెల్ని చేతికిచ్చి బయటకు పంపేశారు. ఆ కట్టెమీదుగా అతి కష్టంమీద నడుచుకుంటూ హాస్పిటల్ వెలుపలికి వచ్చాడు.

ఇన్నిరోజులు ఆసుపత్రిలో ఉండడంవల్ల కాబోలు లోకమంతా కొత్తగా కనిపించిందతనికి.

ఒక్కసారి జేబు తడుముకున్నాడు...

మూడురోజులక్రితం తన యజమాని లెక్కజూసి తనకు రావాల్సిన డబ్బుల్ని ఇచ్చి వెళ్ళాడు.

హాస్పిటల్లో మందులఖర్చుకు పోనూ మిగిలిఉన్న డబ్బు అతని చేతికి తగిలింది. దాంతోపాటు ఒక అగ్గిపెట్టె, బీడీ కట్ట కూడా వున్నాయి.

ఆపదసమయంలో ఆసుపత్రికి తరలించి తగిన వైద్యంచేయించి, న్యాయంగా తనకు రావాల్సిన డబ్బుల్ని కూడా ఇచ్చి వెళ్ళిన యజమానికి మనసులోనే నమస్కారాలు చేశాడు. తిరిగి తన ఇంటికి తీసుకుపోకపోయినా ఫరవాలేదనుకున్నాడు.

కట్టెలపైన అలవాటు లేని నడక...

అలాగే పడుతూలేస్తూ... రైల్వేస్టేషన్‌కు చేరుకున్నాడు. అయినా ఆలోచనలు అతన్ని వెన్నంటివచ్చాయి.

'ఇంక ఎన్నోదినాలు బతకనని తెలిసిపోయింది. పొద్దువాలిపోయింది. దిక్కులేకుండా ఈ పరాయిదేశంలో ఎందుకు సావాల. కనీసం ఈ కడదినాల్లోనైనా పుట్టి పెరిగిన గడ్డకు పోతే అదే పదివేలు. ఆ సచ్చేసావేందో అయినోళ్ళ మద్దెన సస్తే.... కనీసం ఎత్తేసేవోళ్ళయినా వుంటారు.... సచ్చేముందు వంశానికంతా మిగిలిందే ఒక్కగానొక్క మొలక.... పాలేటి... వోన్ని కండ్లార సూసుకుని సస్తా.... వోడు పెండ్లిచేసుకోనుంటాడు.... పిల్లాపాపల్తో సంతోషంగా వుంటాడు.... 'ఇన్నిదినాలు ఏమైపోయింటివిరా ముండాకొడకా... నువ్వూ వొగ తండ్రివేనా అని తిట్టినా పరవాలా... వోళ్లనం దర్నీ కండ్లార సూసుకోని సస్తే.... ఆత్మకు అంత శాంతన్నా దొరుకుతుంది.

అతని ఆలోచన్లు పరిపరివిధాల పరుగెత్తాయి.

అతని ఆలోచన్లకు అంతరాయం కలిగిస్తూ వచ్చింది తిరుపతి బండి... ఎలాగో మెల్లగా ఎక్కి కూర్చొన్నాడు. ఆ తర్వాత తిరుపతిలో దిగాడు...

"తిరిగి ఇంక వస్తానో రానో... దేవున్ని వొగసారి సూస్తే... ఏదో పుణ్యాం పురుషార్థం... కనీసం వచ్చేజన్మలోనైనా మంచి బతుకును ఇయ్యిరా సామీ... అని యేడుకుంటా" అని ఆలోచించి తిరుపతిలో వుండే గుడులన్నీ తిరిగాడు... అలాగే కొండపైకి వెళ్ళాడు. అక్కడ ఓ సత్రంలో నిద్రపోతుంటే... ఆరెండు కట్టెల్ని కూడా ఎవరో దొంగిలించారు.

"వరే పాపిష్టి దేవుడా... ఎందుకురా నన్నిట్ట ఇంస పెడతావు? కాళ్ళు పోగొట్టుకుని అంతకష్టపడి నీదగ్గరికొస్తే కూసింత గూడ కనికరం లేకుండా... ఇంకా యాతన పెడితి వెందుకురా..." అంటూ మనస్సులోనే దేవుణ్ణి నిందించాడు.

అయినా దేవుణ్ణి తనివితీరా దర్శించుకొని కొండదిగి దేకుతూ బస్టాండు చేరుకుని పీలేరు బస్సెక్కేశాడు.

అక్కడ బస్సెక్కి పులిచెర్లలో దిగి అలాగే

దేక్కుంటూ తన ఊరు చేరుకున్నాడు!

## చీకటిలో చిరుదివ్వె



గతమంతా మంచులా కరిగిపోయింది.

అతని కళ్ళు ఆర్ద్రమైనాయి.

అతని కళ్ళల్లో స్రవించిన కన్నీళ్ళు అతని చూపును పల్చటి తెరలా కప్పేశాయి.

అప్పటికే చీకటి లోకాన్ని ఆక్రమించుకుంటోంది. అందరి ఇళ్ళలోను దీపాలు వెలిగాయి.

ఆకాశంలో నక్షత్రాలు, సగం శుక్లపక్షం చంద్రుడు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

ఆ చీకట్లోను... కొంతదూరంలోవున్న అతని గుడిసె అస్పష్టంగా కనిపిస్తూనే వుంది.

అలాగే దేక్కుంటూ, ఆయాసంతో రొప్పుతూ తన శరీరాన్ని బలవంతంగా అటువైపుకు జరుపుకుంటూ వెళ్ళసాగాడు కుశాలన్న.

సరిగ్గా అదే సమయంలో

గుడిసె ముందరున్న రాతి కూసానికాను కొని శూన్యంలోకి చూస్తూ ఆలోచిస్తున్నాడు పాలేటి.

అతని హృదయంలో కత్తులు కవాతు చేస్తున్నాయి.

అతని మెదడులో ఆవేదనల మథనం సాగుతోంది.

ఆ మథనంలో నుంచి ఎన్నెన్నో స్మృతుల దొంతరలు పుట్టుకొస్తున్నాయి.

వీధిలో దీపాల వెలుగు కనిపిస్తూనే వుంది.

అతని చూపులు ఆకాశంలోకి నిర్మలంగా చొచ్చుకుపోతున్నాయి.

పైన ఆకాశం... అందులో నక్షత్రాలు మెల్లగా వీస్తున్నగాలి... రైతు చేతిలోని అర్ధ చంద్రాకారపు కొడవలిలా కనిపిస్తున్న చంద్రుడు దూరంగా కల్లూరడవిలో కాలుతున్న కొండమీది మంటలు... అన్నీ ఆవేళ కొత్తగా గంభీరంగా కనిపిస్తున్నాయి అతని కళ్ళకు.

"వర్షించే మేఘాలు... కోటీశ్వరుని యింటిపైన, పేదవాడి గుడిసెపైనా సమంగా వర్షిస్తాయి.

గాలి, వెలుతురు, అద్దాలమేడపైనా, పక్కనేవున్న పూరిగుడిసె పైనా ఒకలాగే ప్రసరిస్తాయి.

తాజ్‌మహల్‌పైన తన అమృతకిరణాల్ని చిలకరించిన చంద్రుడు, పేదవాడి పొలంపైనా వెన్నెల జల్లును కురిపిస్తాడు. వాటికి లేని ఈ భేదాలు, విభేదాలు ఈ మనుషులకెందుకో...? ఈనేల, ఈ ఆకాశం, సూర్యుడు, చందమామ, గాలి, నీళ్ళు, నిప్పులు... ఎవరి సొత్తు...?

అందమైన అడవి.... అడవి మృగాలు ఎవరి సొంతం! కూసే కోయిలా, నర్తించే నెమలి, ఎగిరేపక్షి, ఎవరి నిధులు?

ఇవి ఏ ఒక్కరికీ సొంతం కానప్పుడు... ఈ భోగాలు, ఆస్తి పాస్తులు, సిరిసంపదలు, సౌకర్యాలు కొందరికే ఎందుకు?" ఆలోచించే కొద్దీ అతని బుర్ర వేడెక్కుతోంది.

కళ్ళు గిర్రున తిరిగినట్టనిపించాయి.

దాంతో కొన్ని ఆకారాలు అతని కళ్ళముందర ప్రత్యక్షమై... కదలసాగాయి.

క్రమంగా ఆ ఆకారాల సంఖ్య మితిమీరిపోతోంది.

వందలు, వేలు, లక్షలు, కోట్లు....

ఆకాశంనిండా అవే ఆకారాలు!!

వాటిని చూసి అతను వణికిపోసాగాడు.

వాటిలో ఒక ఆకారం ముందుకొచ్చింది దీనవదనంతో.

"హారే తమ్ముడూ... ఈ దేశంలో నాలాంటి అమాయకురాండ్రు మంగరాజు, నాయుడయ్యలాంటి ధనవంతుల చేతుల్లోను, మానవత్వం మంటగలసిన అత్తవారిళ్ళలోను ఎందరు హతమైపోతున్నారో గమనించావా...?"

కళ్ళనీళ్ళు కార్చుకుంటూ చెప్పింది ఆ ఆకారం.

అది అతని అక్క గౌరి ఆకారం!

ఇంతలో మరో ఆకారం ముందుకొచ్చింది.

"వరే... ఎందరో అభాగ్య తల్లులు, తన వాళ్ళ ఆకలి మంటల్ని ఆర్పడానికి దారిద్ర్యంతో పతితులుగా మారిపోతున్నారు! అవసరాలు, ఈ మనుషులు వారినలా మార్చేస్తున్నాయి. చూశావా?" అని ప్రశ్నించింది.

అది అతని తల్లి దేవకి ఆకారం!! అలాగే చూస్తున్నాడతను...

అన్ని ఆకారాలు ఏడుస్తున్నాయి. దిగాలుగా అతనివైపే చూస్తున్నాయి.

"తరతరాల పురషుడి అజ్ఞానానికి, అహంకారానికి స్త్రీలు ఇలా బలి కావాల్సిందేనా...?" మరికొన్ని స్త్రీల ఆకారాలు ప్రశ్నించాయి.

వాటికి ఏం సమాధానం చెప్పాలో అర్థంకాలేదు.

ఇంతలో మరో ఆకారం ముందుకొచ్చింది.

"పాలేటీ! పేదవాళ్ళు ఉన్నవాళ్ళ దౌర్జన్యాలకు, దోపిడీలకు గురైపోయి, కృశించి కృశించి నశించిపోతూనే వున్నారు. లేని వాళ్ళ శ్రమను దోచుకుని ధనవంతులు ఇంకా ధనవంతులై పోతూనే వున్నారు" అని ఓ పురుషాకారం అంది.

"శ్రమజీవులంతా తమ బలాన్ని, కండల్ని, ఉన్నవాళ్ళకే బలికావిస్తూ... ఇంకా దరిద్రులైపోతున్నారు.

ఈ అంతరాల్ని తుడిచిపెట్టి అందరూ సమానంగా బతికే సమాజం కోసం, నిజమైన న్యాయంకోసం నడుంకట్టవా?"

అని కొన్ని వేల స్త్రీ పురుష ఆకారాలు అతన్ని నిలదీస్తున్నాయి. అవన్నీ అతను చూసిన సంఘటనల స్మృతులే...

ఆ స్మృతుల దొంతర్లలో అతని మెదడు గిరికీలు కొడుతోంది. దేనిపైనా ఏకాగ్రతను చూపించని అస్థిత్వంలో పడిపోతోంది. ఇంతలో అతని ఆలోచన్లకు అంతరాయం కలిగిస్తూ ఏదో శబ్దమైతే అటు చూశాడు.

ఎదురుగా నేలపైన ఎగాదిగా అతన్నే చూస్తూ కుశాలన్న! అతన్ని పాలేటి చూస్తున్నాడు.

కుశాలన్న సరిగా చూపు ఆనక తలను కాస్త పైకెత్తి మరీ చూస్తున్నాడు.

చిరిగిన గాడా బనీనుతో, పెరిగిన గడ్డంతో మొలకొక అడ్డపంచె చుట్టుకొని... పేదరికానికి ప్రతీకలా కనిపిస్తున్నాడు పాలేటి.

ఆ స్థితిలో కొడుకుని చూసేసరికి "తన వారసత్వమే కొడుక్కు వచ్చిందా" అని ఒక్క క్షణం అతని మనసులో అనుమానం.

పాలేటి తండ్రిని గుర్తుపట్టాడు.

"అప్పా! ఏందిట్లయి పూడిసినావ్" ఆశ్చర్యంగా అడిగాడు.

చనిపోయాడనుకున్న తండ్రి తిరిగి వచ్చినందుకు ఒకవైపు ఆనందం, మరోవైపు ఆశ్చర్యం, అతని దీనస్థితికి బాధ పాలేటికి ఒకేసారి కలిగాయి.

"అంతా నా కర్మ" అతనికి అదే సమాధానం చెప్పాడు కుశాలన్న.

"ఏంపాలేటీ? దాసన్నగారు అగ్గిమీద గుగ్గిలమైపోతావుండారు. పనికిపోయేది సాలించుకున్నావంట. వాళ్ళనాయన చేసిన బాకీ అన్నా తీర్చమను. లేదా పనికన్నా రమ్మను అని సెప్పంపినారబ్బా వోళ్ళు"

సరిగ్గా అప్పుడే అక్కడికి వచ్చిన దాసన్న గారి జీతగాడు మాలకదిరప్ప కొడుకు పెట్టెప్ప అన్నాడు.

ఆమాట వినేసరికి ఎక్కడలేని బాధ కలిగింది కుశాలన్నకు. 'అంటే తను జేసిన అప్పుకు తన కొడుకును వోళ్ళ జీతగాడిగా చేసుకున్నారా ఏందీ? వీడు బెంగుళూరు నుంచి వచ్చేసి బాగా బతకతావుంటే సూసి సంతోషించాలనేగదా కళ్ళల్లో పాణాలు పెట్టుకొని అంత దూరంనుంచీ ఇంత దూరం వచ్చినా...'

మనసులోనే మథనపడ్డాడు.

"ఏంది పాలేటీ ఇదీ? "

అతని మాటలు ఎక్కడినుంచో వస్తున్నట్లు హీనస్వరంతో వినిపించాయి.

"అక్క సచ్చిపోతానే నువ్వెళ్ళిపోయావ్. నువ్వు ఎక్కడబోయినావో కూడా తెలీక



పాయ. అందుకని నువ్వు
చేసిన బాకీ నన్ను తీర్చమని
పట్టుపట్నారు దాసన్న
గారు. ఇంక ఆ యప్పు
తీరేమార్గం లేకండా



ఇన్ని దినాలు వోళ్ళింట్లోనే వుండిపో యేనా... ఎంత పంజేసినా, ఎన్ని సంవత్స రాలున్నా ఆ అప్పుతీరేట్టుగా కనిపించలా... పైగా మీయక్క వల్లనే మంగరాజు మరణ మైపోయినాడని కాకిని పొడిచినట్టు పొడచ బట్రి. దీంట్లో ఏదో పితలాటం వుందనీ, నేను అప్పు తీర్చనని మొండికేసి మొన్ననే ఇంటికొచ్చేసినా, వచ్చి ఇప్పటికి నెలపొద్దయి పాయలే. ఇంక అబ్బుట్నుంచీ వోళ్ళ రాయ బారాలు, బెదిరింపులు ఆగిపోలా..." వివ రంగా చెప్పాడు పాలేటి.

"ఇంకా పెండ్లి చేసుకోలా? "

"లేదు"

"ఎందుకు జేసుకోలా? "

"నా బతుక్కి ఎవుడిస్తాడు పిల్లను" నొప్పిగా చెప్పాడు పాలేటి.

"ఈ కరువు నేలలో, ఈ దరిద్రపు గడ్డ మీద మనలాంటోళ్ళు ఎంతకాలం బతికినా వగిటే... మన బతుకులు మారవు. ఇంకె క్కడికి పోయినా అంతే! యాడికి పోయినా రూపాయికి పదారణాలే. ఈలోకంలో మనం చెల్లనికాసులం. మనం భయపడి పరిగెత్తే కొద్దీ మనల్ను ఇంకా అనగదొక్క తారు. ఎదురు తిరిగితే మాత్రం సలాంచే స్తారు. ఇన్ని దినాలు నేను నేర్చుకునింది ఇదేరా. ఈ సత్తెం తెలుసుకునేసందికి ఒక జీవితం సరిపోయింది. తెలుసుకున్నా ఏమీ చేయలేని పాతతరంమాది"

తండ్రి పలికే ప్రతిమాటా కొడుకు హృద యంపైన శాసనం మీది అక్షరాల్లా చెక్కబ డుతున్నాయి.

అతను మౌనంగా వింటూనే వున్నాడు.

కుశాలన్నకు నీరసంతో ఆయాసం తన్ను కొచ్చింది. ఆపైన మాట్లాడలేకపోయాడు.

"పాలేటీ! నిన్ను రేపు తెల్లారే దాసన్న గారు పల్లెకు రమ్మన్నారబ్బా" అంతవరకూ కుశాలన్నను, అతని మాటల్ని అబ్బురపడి వింటూ చూస్తూండిపోయిన పెట్టెప్ప తిరిగి చెప్పాడు.

"ఆ మాట వాళ్ళల్లో ఎవురు సెప్పినారు? "

"ఒగరేందబ్బా! కేశవులన్నా, నరసిమ్ము లన్నా... ఇంకా పెద్దిరెడ్డితోసహా అందరూ చెప్పినారబ్బా!"

"ఎందుకు రమ్మన్నట్టు? " తెలిసే ప్రశ్నిం చాడు.

"అదే! మీ బాకీ విషయం తేల్చేయాలం టబ్బా!"

"అట్లనా!" నిర్లిప్తంగా అన్నాడు.

"రేపు అట్లో ఇట్లో తేలిపోవాలంట. శానా పట్టుదలగా వుండారబ్బా వోళ్ళు. పెద్దోళ్ళతో యవ్వారం కష్టమే" ఉన్నవిషయం చెప్పుకు పోతున్నాడు పెట్టెప్ప.

వింటూనే మౌనంగా నిర్వికారంగా శూన్యంలోకే చూస్తుండిపోయాడు పాలేటి.

"ఎట్టోవొగట్ట నిన్ను వోళ్ళ జీతగాడిగా మార్చాలనేదే వోళ్ళ ఉద్దేశంగా ఉండాదబ్బా! ఆ తర్వాత నీ యిష్టం సెప్పమన్నారు సెప్పినా అంతే!" అన్నాడు పెట్టెప్ప.

"ఈ బతుకులు యిట్నే తెల్లారాల్సిందేనా. ఈ బాధలకు, ఈ దరిద్రాలకు పరిష్కారం లేదా? "

పాలేటి మెదడు తీవ్రంగా ఆలోచిస్తోంది.

అతని మనసు పరిపరివిధాలా పరుగెడు తోంది. పరిష్కార మార్గాల్ని అన్వేషిస్తోంది.

ఎంత పరుగెత్తినా, ఎంత వెదికినా అతని మనస్సుకు పరిష్కారం మాత్రం స్ఫురించ డంలేదు.

పెట్టెప్ప నక్షత్రకుడిలా అలాగే నిలబడివు న్నాడు.

నిస్త్రాణ, నిస్సత్తువ శరీరాన్ని ఆవరిస్తున్నా అదంతా విన్న కుశాలన్న తన శరీరంలోని శక్తినంతా కూడదీసుకుని తిరిగి చెప్పడం మొదలుపెట్టాడు.

మనిషి మాత్రం ఆయాసపడుతూనే వున్నాడు.

"మన బతుకులు మారాలంటే... తిరగబ

డాల... పిడికిలి బిగించాల... అప్పుడే నిజమైన మనిషివవుతావు నువ్వు"

తన జీవితానుభవాన్నంతా రంగరించి అన్నాడు కుశాలన్న. అతనిలో ఆవేశం తన్నుకొస్తోంది.

ఆ మాటలు కురుక్షేత్రంలో పార్థుడికి కృష్ణుడు చేసిన గీతోపదేశంలా అనిపించింది పాలేటికి.

ఒక మహాప్రవక్త, అంతకుమించి ఒక మహా ఋషి ప్రవచించిన మహత్తర సత్యంలా తోచింది.

తండ్రి మాటలు, పాలేటి గుండెపొరల్లో నుంచీ ఆవేశం మొలకలెత్తేవిగా చేశాయి.

"ఎంత తుఫాను ముంచుకొచ్చినా అప్పుడు అట్టే అణగారిపోయుండి ఆ తర్వాత తిరిగి తలెత్తుకొని పైకి నిలబడే గరికపోచ మాదిర్తో నువ్వూ పైకిలెయ్యి. నిప్పులు చిమ్ముకుంటూ ఆకాశాన్ని తాకు. అప్పుడే ఈ లోకం నీకాళ్ళ దగ్గర పడుంటుంది. అప్పుడు నీ కళ్ళ ఏ మొనగోడూ కళ్లెత్తి చూడలేడు. ఆ... అంతే"

ఆవేశంలో రెచ్చిపోతూ చెప్పడంతో శ్వాసకు దగ్గొచ్చి అడ్డుపడి కుళ్ళు దగ్గుదగ్గుతూ అలాగే ఉండిపోయాడు కుశాలన్న.

"అప్పా" అంటూ అతన్ని సమీపించాడు పాలేటి. అంత దగ్గులోను బనీను జేబులో చేయిపెట్టి అగ్గిపెట్టె తీసి అతని చేతికిచ్చి "ఇంట్లో దీపం వెలిగించు" అన్నాడు మాట్లాడలేక మాట్లాడుతూ కుశాలన్న.

తండ్రి అందించిన అగ్గిపెట్టెలోనుంచి ఒక అగ్గిపుల్లను తీసి సర్రన గీశాడు పాలేటి.

అది చీకటిని తరిమేస్తూ వెలిగింది. వెలుగుతున్న అగ్గిపుల్లను అలాగే పట్టుకొని యింట్లోకి అడుగుపెట్టి నట్టింటి గూట్లో వున్న మట్టిదీపాన్ని చూశాడు పాలేటి. అందులో సగానికిపైగా చమురుంది. వెలిగి ఆరిపోయిన వత్తివుంది. మరో అగ్గిపుల్లను గీసి ఆ వెలుగులో మరో చేత్తో వత్తిని నలిపి దీపం వెలిగించాడు.

కుశాలన్న ఆయాసపడిపోతూనే ఇంట్లోకి వెళ్ళాలన్న కోరికతో గుమ్మంవైపు కదిలాడు.

దీపం వెలిగించి వెలుపలికి వచ్చిన పాలేటిని చూసి, "ఏందబ్బా... ఏదో వొగమాట చెప్పబ్బా... నేను బోతా" అని తొందరించాడు పెట్టెప్ప.

ఇక ఆపుకోలేకపోయాడు పాలేటి. అతనిలో అన్ని ఏళ్ళుగా అణగారివున్న ఆవేశం కట్టలు తెంచుకుంది. అంతే... అతని కళ్ళు ఎరుపెక్కాయి. అతని పిడికిళ్ళు బిగుసుకోసాగాయి. ఆ స్థితిలో పెట్టెప్ప పాలేటి మొహం చూడలేకపోయాడు. కసి, పగ, ద్వేషం అన్నీ ఎరుపెక్కిన అతని కళ్లల్లో ప్రతిబింబిస్తున్నాయి.

దీపం వెలుగుతూనే వుంది. కుశాలన్న గుమ్మంవైపు దేకుతున్నాడు.

పెట్టెప్ప అతని సమాధానం కోసం అలాగే నిలబడి వున్నాడు. "వొరే పెట్టీ, నేనింక పనికి రానని చెప్పు. బాకీ గీకి అన్నారంటే వోళ్ళ పుచ్చలెగిరిపోతాయని చెప్పు. వాళ్లవల్ల ఏమన్నా అయ్యేట్టుంటే, అది చేసుకోమని చెప్పు. ఎక్కువ మాట్లాడితే నిలువునా నరికి పారేస్తానని చెప్పుపో... పోరా... పో..." ఆవేశంగా కేకలేస్తూ చెప్పాడు.

అతని ప్రతిమాటా ఒక తుపాకీ గుండులా అతని నోటినుండి దూసుకువస్తోంది.

ప్రతి కేకా ఓ ఫిరంగి గుండులా... ఆ నిశ్శబ్దాన్ని చీల్చుకొని ప్రతిధ్వనిస్తోంది.

ఆమాట విన్న కుశాలన్న ఒక్కసారి సంతృప్తిగా గాలిపీల్చుకుని చిరునవ్వు నవ్వుతూ, ఆ ఇంటి గడపపైనే అలాగే వొరిగిపోయాడు.

"అప్పా!!!"

అంటూ అతన్ని సమీపించాడు పాలేటి.

అతను వెలిగించిన దీపం... నట్టింట్లో నిశ్చలంగా వెలుగుతూనే వుంది.

★

# చతుర కతలు

## బ్యాంకు రోబరీ

**జే**మ్స్‌కి డబ్బు అవసరం పడింది.

టైం చూసుకున్నాడు. పన్నెండయింది. ఫరవాలేదు బ్యాంకుకి వెళ్ళి డబ్బు డ్రా చేసుకోవచ్చనుకొన్నాడు.

కానీ ఆరోజు శనివారం అని గుర్తుకు ఉంది. ఎవ్వరూ రాకపోకలు చెయ్యడంలేదు. మెయిన్‌గేటువరకు వెళ్ళి ఆగాడు. రోజూ సాధారణంగా ఉండే హడావిడి మెసెంజర్ల గోల విన్పించడం లేదు. తలుపులు తెరిచే ఉన్నాయిగానీ, జాలీ డోర్స్ మూసి వున్నాయి.

జేమ్స్ బుర్రలో ఏదో అనుమానం మెదిలింది. అసలు జేమ్స్ పేరది కాదు. డిటెక్టివ్ నవలలు తెగచదివి షెర్లాక్ హెూమ్స్‌లా



రాలేదు జేమ్స్‌కి. బైక్ బ్యాంకు బయటపెట్టి స్టాండు వేశాడు. లాక్‌వేసి సరిగ్గా పడిందో లేదో పరీక్షించి చూశాడు. ఇగ్నిషన్ బంద్ చేశాడు. ఈ మధ్య బళ్ళు చోరీ అయిపోతున్నాయి మరి.

దృష్టి బ్యాంక్‌మీద పడింది. ఆశ్చర్యం. అంత రద్దీగా ఉండే బ్యాంక్ నిశ్శబ్దంగా

కథానాయకుడు కావాలని జేమ్స్‌బాండ్ అనే పేరు పెట్టుకున్నాడు.

జేమ్స్ మెయిన్‌గేటు వదలి ముందుకు జరిగాడు. కిటికీగుండా చూశాడు. కిటికీ కాస్త ఎత్తుగా ఉన్నా మునికాళ్ళమీద నిలబడి చూశాడు. బ్యాంకులోని క్లర్క్స్, ఆఫీసర్స్, మెసెంజర్స్ అంతా చేతులెత్తి వరుసల్లో నిలబడి వున్నారు. వారిముందొకడు ఏవేవో ఆజ్ఞాపిస్తున్నాడు. అంతా నిశ్శబ్దంగా చూస్తున్నారు. ఎవ్వరి మొహాల్లో కత్తివేటుకి నెత్తురులేదు.

సందేహంలేదు. బ్యాంకులో డబ్బంతా రోబరీ కాబోతోంది. దీన్ని వెంటనే ఆపాలి.

జేమ్సు బుర్రలో యెన్నో ఆలోచన్లు. ఊహా పథంలో ఎన్నో దృశ్యాలు. అతిపెద్ద బ్యాంక్ రోబరీని ఆపిన జేమ్సుని బ్యాంకు యాజమాన్యం నిలువెత్తుపూలదండలతో సత్కరిస్తున్నారు.

తమ సంస్థలో పి.ఆర్.ఒ. గా చేరమని బ్రతిమాలుతున్నారు.

లేడీ క్లర్క్సు తనవైపు అర్థింపుగా చూస్తున్నారు.

ప్యాంటు తడి అవ్వడంతో జేమ్సు ఉలిక్కిపడ్డాడు. ఊరకుక్క ఒకటి విగ్రహంలా నిలబడి ఉన్న తన ప్యాంటు పాడు చేసేసింది.

ఇక నిమిషం వృధా చెయ్యకుండా జేమ్సు బయటకు పరుగెత్తాడు. పదిహేన్నిమిషాల్లో పోలీసులు రంగంలోకి దిగారు. నిమిషాల్లో బ్యాంకుని చుట్టుముట్టేరు. కొంతమంది టెర్రస్ ఎక్కి గన్స్‌తో పొజిషన్‌లో ఉన్నారు. డి.ఎస్పీ. మైక్ పట్టుకొని ఎనౌన్స్‌మెంటు చెయ్యబోతున్నాడు. కుర్ర డి.ఎస్పీ కి అదే మొదటి ఛాన్సు మైకులో మాట్లాడ్డానికి. ఊరికే ఉవ్విళ్లూరిపోతున్నాడు. ఇంతలో బ్యాంకులో కలవరం మొదలయింది. బ్యాంకు స్టాఫ్ కొంతమంది బయటకు వచ్చి సంగతేమిటని అడిగారు.

పోలీసులు చెప్పిన విషయం విని వాళ్లు నవ్వడం మొదలెట్టారు. "మేం ఆర్నెల్లుగా ప్రతి శనివారం బ్యాంక్ అవర్స్ అయిపోగానే "యోగా'' నేర్చుకుంటున్నాం, సార్' అన్నారందరూ ఏకగ్రీవంగా.

**- ఆనందరావ్ పట్నాయక్.**

---

## ఒక్క రూపాయి

సాయంత్రం ఆరుగంటలయింది.

ఫ్యాక్టరీ సైరన్ కూసింది.

ఆరోజు ఒకటో తారీఖు. ఫ్యాక్టరీలో పనిచేసే కూలీలందరూ ఒకరి తరువాత ఒకరుగా లైన్లో నిల్చుని జీతాలు తీసుకుంటున్నారు.

ఏడుగంటలకి బయటికి వచ్చి తన కారు దగ్గరికి వెళ్లబోయిన ప్రొప్రయిటరు రవి అక్కడేదో గొడవ అవటం గమనించి అటుగా అడుగులు వేశాడు.

"ఏమిటయ్యా గొడవ?" క్యాషియర్ని అడిగాడు రవి.

క్యాషియర్ 'చెప్పాలావద్దా?' అన్నట్లు క్లర్కుకేసి చూశాడు.

"మీరెళ్లండి సార్. ఇవన్నీ మాకు అలవాటే'' అన్నాడు క్లర్కు.

"అసలు విషయం ఏమిటని అడుగుతున్నాను'' అన్నాడు రవి కసురుతున్నట్లు.

"ఇతని పేరు కొమరయ్య సార్. నాలుగు నెల్ల క్రితం మన ఫాక్టరీలో లేబర్ వర్కర్‌గా చేరాడు సార్. ఏదో గిరిజన ప్రాంతం నుంచి వచ్చాడు. చదువురాదు. వేలి ముద్రలే."

"ఎస్..."

"ఇతనికి మనం నెలకి ఆరువందలు ఇస్తున్నాం. రెండు నెల్లు అలాగే నెలకి ఆరువందలు జీతం ఇచ్చాం. తీసుకున్నాడు. కాని కిందటి నెలనుంచి గొడవ పెడుతున్నాడు సర్."

"కూలి సరిపోదంటున్నాడా?" అని గద్దించి కొమరయ్యకేసి తిరిగి - "ఏమయ్యా నీకు ఆరువందలు ఇస్తున్నాంగదా. కటింగులు, మామూళ్లు అంటూ మా వాళ్లు ఏమైనా తక్కువ ఇస్తున్నారా?" అన్నాడు.

"అటువంటిదేం లేదు దొరా! ఆరు నూర్లూ నిండా ఇస్తున్నారు!" అన్నాడు ఒదిగి నిల్చున్న కూలీ కొమరయ్య.

"మరింకెందుకయ్యా గొడవ?"

"మీరు నెలకి ఆరు నూర్లు ఇస్తున్నారు దొరా. కాని నాకు ఆ జీతం వద్దుదొరా. దానికి బదులు నెలకి ఒక్క రూపాయి జీతం

ఇప్పించండి''

అదిరిపడ్డాడు ప్రొప్రయిటర్.

నొసలు ముడిచి ప్రక్కన నిల్చున్న క్లర్క్-క్యాషియర్‌ల కేసి చూశాడు.

వాళ్లు వస్తున్న నవ్వుని పంటి బిగువున ఆపుకొంటున్నారు.

"ఏంటయ్యా 'ఇతనంటున్నది? ఒకరూపాయి జీతం కావాలంటాడేంటి?"

"మొదటి రెండు నెల్లు ఆరువందలు జీతం సరిగానే తీసుకున్నాడు సర్. కాని అతనికి ఆరువందలు ఇంటి ఖర్చులకి, అవసరాలకి, తిండికి సరిపోవటం లేదట."

"అందుకని మనమేం చెయ్యాలిట?"

"కిందటి నెల ముఖ్యమంత్రిగారు ప్రజల వద్దకి పాలన అంటూ హెలికాప్టర్‌లో వచ్చి అక్కడ్నించి కారులో వాళ్ళ గూడానికి వచ్చాడుట. వాళ్ళ గూడానికి నీళ్ళ పంపులు, కరెంటు వేయిస్తానని, పక్కా ఇళ్ళు కట్టిస్తానని మాట ఇచ్చాడుట. ఆయనకి నెలకి ఒక్కరూపాయి జీతం అని ఎవరో చెప్పారుట. ఆయన ఎప్పుడూ విమానాల్లో, కార్లలో తిరుగుతాడనీ, ఆయన భార్య రోజూ ఇంట్లో కూడా పట్టుచీరలు కట్టుకొంటుందని, ఏడు వారాల నగలు పెట్టుకొంటుందని, ఎవరో ఇతనికి చెప్పారుట. అప్పట్నించి ఈ కొమరయ్య ధోరణి మారింది సర్. ఒక్కరూపాయి జీతానికి ఆ బాబుకి విమానం, కారు, పెళ్ళాన్కి పట్టు చీరలు, నగలు వచ్చినపుడు నాకు ఆరువందలు జీతం వచ్చినా అవన్ని ఎందుకు రావటం లేదు? నాకు ఆరువందలు జీతం వద్దు. ఆ బాబు తీసుకొనేలాంటి ఆ ఒక్కరూపాయి జీతమే కావాలి అని గొడవ పెట్టుకొన్నాడు సర్. వాడికి అర్థం అయ్యేలా చెప్పలేక మేం ఆరువందల జీతంతో పాటు అదనంగా ఇంకో ఒక్క రూపాయి కూడా ఇచ్చాం."

"ఆ...!?"

"అప్పుడు బాగానే తీసుకున్నాడు. కాని ఆ మర్నాడు వచ్చి, మళ్ళీ గొడవ పెట్టుకొన్నాడు సర్".

"ఏమని?"

"బజారుకెడితే ఆ ఒక్క రూపాయికి ఏమీ రావటంలేదంటున్నాడు. బాబుకి ఒక్క రూపాయికి విమానాలు, కార్లు అన్ని వచ్చాయి.



కాని నాకు రావటంలేదు. కాబట్టి అవన్నీ వచ్చే ఆ ఒక్క రూపాయి తనకి కావాలి అంటున్నాడు. ఆయనికి ఒక్కరూపాయి జీతానికి అవన్నీ వచ్చినపుడు నాకెందుకు రాదు, నాకు అలాంటి ఒక్క రూపాయి నెలకి జీతంగా కావాలి. అని గొడవ చేస్తున్నాడు సార్... ఎంతచెప్పినా అర్థం చేసుకోవటం లేదు."

"చంపాడు పొండి. అయితే వీడి సంగతేంటో మీరే చూసుకోండి..." అంటూ వెనక నుంచి ఎవరో తరుముతున్నట్లు తన కారు దగ్గరికి పరిగెత్తాడు ప్రొప్రయిటర్ రవి.

**- కాకాని కమల**

---

## చిన్ని చిన్ని ఆశ

బస్సు బయలుదేరింది.

డ్రైవర్ కండక్టర్ వంక చూసి నవ్వాడు. ఎన్నడు లేంది బస్సుజనంతో కిటకిటలాడుతోంది. చిల్లర బాగా మిగులుతుందని ఇద్దరికీ తెలుసు.

కండక్టర్ వెనుకవైపునుండి టిక్కెట్లు కొట్టడం ప్రారంభించాడు.

బస్సు బయలుదేరగానే ప్రయాణీకులందరూ కళ్ళు మూసుకొని దైవధ్యానం చేయడం కండక్టర్‌ను ఆశ్చర్యపరచింది. అదీగాక ప్రయాణీకుల్లో ఆడా, మగా తేడా లేకుండా అందరి కళ్ళనుండి సన్నగా కన్నీరు కారుతోంది.

కారణం అడగుదామనుకొన్నాడు గానీ, బస్సు నిండుగా ఉండటంతో టిక్కెట్లు కొట్టడంలో బిజీ అయ్యాడు. దానికితోడు వర్షం.

దాదాపు అరగంట గడిచింది. టిక్కెట్స్ కొట్టడం పూర్తవడంతో కండక్టర్ తన సీట్లో కూర్చొని యస్ఆర్ రాయడంలో నిమగ్నమయ్యాడు.

సరిగ్గా అదే సమయంలో ఆ ఆర్‌టిసి బస్సు నలభై అడుగుల వెడల్పు, పదిహేనడుగుల లోతు ఉన్న ఓ వాగుమీద వంతెనెను దాటసాగింది. ప్రయాణీకులంతా మరింత భక్తిశ్రద్ధలతో దేవున్ని స్మరిస్తుండగా బస్సు క్షేమంగా వంతెన దాటింది. ప్రయాణీకులు దీర్ఘంగా నిట్టూర్చారు.

రాయడం పూర్తయిన తర్వాత కండక్టర్ జేబులోనుండి డిటెక్టివ్ నవల తీసి దీక్షగా చదవసాగాడు.

మరో అరగంట గడిచింది. వర్షం ఎక్కువయింది.

ఈసారి బస్సు పెద్ద నదిని దాటసాగింది. వంతెన కింద సుడులు తిరుగుతూ వేగంగా ప్రయాణిస్తోందో నది. బస్సు ఆ వంతెన కూడా దాటేసింది. ఈలోగా వర్షం ఆగిపోయింది.

మరుక్షణం ఓ యువకుడు చాలా ఫాస్ట్‌గా తన సీట్లోనుండి లేచి డ్రైవర్ దగ్గరకు వెళ్ళి "బస్సు ఆపరా ఇడియట్" అన్నాడు.

"ఏమన్నావ్? " ఆశ్చర్యంగా చూశాడు డ్రైవర్.

"బస్సు ఆపరా రాస్కెల్"

డ్రైవర్‌కు విపరీతమైన కోపం వచ్చి సడెన్ బ్రేక్ వేసి ఇంజన్ ఆఫ్‌చేశాడు.

సడెన్‌గా బస్సు ఆగిపోవడంతో పైగా ఏవో అరుపులు వినిపించడంతో చదువుతున్న నవలలోనుండి తలెత్తి చూసాడు కండక్టర్.

అదే సమయంలో ప్రయాణీకులంతా "చూస్తూ ఊరుకుంటారేంటండీ. ఆ డ్రైవర్ గాడ్ని పట్టుకొని ఏ పార్ట్‌కాపార్ట్ ఊడదీయక" అంటూ డ్రైవర్‌ను చొక్కాపట్టుకొని బస్సులోంచి రోడ్డుమీదకు లాగారు.

కండక్టర్ ఖంగారుగా డిటెక్టివ్ నవలని పాంటుజేబులోకి మనీ బాగ్ బనీను వెనక్కి



తీసేసుకొంటూ **తానూ** ప్రయాణీకులతోపాటు బస్సుదిగాడు.

"ఏంట్రా మీకేమన్నా పిచ్చిపట్టిందా అందరూ నన్ను కొట్టడానికి వస్తున్నారేంటి? " బింకంగా అడిగాడు డ్రైవర్.

"చేసిన వెధవ పని చాలక ప్రశ్నలు కూడానా! ఇంకా చూస్తారేంటండీ బాదండి" అన్నారెవరో.

మరుక్షణం ప్రయాణీకులంతా డ్రైవర్ని ఫుట్ బాల్ ఆడటానికి సిద్ధపడ్డారు.

చూస్తున్న కండక్టర్ అదిరిపడ్డాడు. డిటెక్టివ్ నవల ఇచ్చిన ధైర్యంతో దూకుడుగా ముందుకెళ్ళి ప్రయాణీకులందర్నీ పక్కకు నెట్టి డ్రైవర్‌ను సేవ్‌చేస్తూ "ఆగండయ్యా ఆగండి అసలకారణం ఏంటి? డ్రైవర్ ఎవరినైనా ఏమైనా అన్నాడా? లేడీస్‌కు ఏమైనా సైగలు చేసాడా? కనీసం మావాడు తాగి కూడా డ్రైవ్ చేయడే" అడిగాడు ఆవేశంగా.

"అంతకన్న ఎక్కువే ఘోరం చేశాడు" అరిచారు ప్రయాణీకులు.

"ఏంటది? **మిమ్మల్నందర్నీ** బస్సుతో సహా వాగులోకో, ఈ నదిలోకో దూకేయించకుండా క్షేమంగా ఇవతలికి చేర్చడమా? " వ్యంగ్యంగా అడిగాడు కండక్టర్.

"అవును" ముక్తకంఠంతో చెప్పారు ప్రయాణీకులు.

"ఆ!..."

"అవును! నేను ప్రేమించిన అమ్మాయి నా ప్రేమను కాదంది. ఆత్మహత్య చేసుకోవాలనుకొన్నాను. ఎలాగూ ఈమధ్య బస్సులు నదుల్లోకి, వాగుల్లోకి, కాల్వల్లోకి దూకేస్తున్నాయి కదా, వర్షం జోరుగా ఉంది గదా అని ఈ బస్సు ఎక్కాను" చెప్పాడోయువకుడు.

"నా భర్త రోజూ కట్నంకోసం నన్ను వేధిస్తున్నాడు. అది భరించలేక ఆత్మహత్య చేసుకోవాలనే బస్సు ఎక్కాను" చెప్పింది ఇల్లాలు.

"నా వ్యాపారం పూర్తిగా దివాళా తీసింది. అందుకే ఈ బస్సెక్కా" అన్నాడో స్థూలకాయుడు.

"నా ప్రియుడు నాకు కడుపుచేసి వేరే అమ్మాయిని పెళ్ళిచేసుకొంటున్నాడు" అందో యువతి.

"నాకు ఉద్యోగం వచ్చే వయసు దాటిపోయింది. ఇంక బ్రతికేదెలా. అందుకే బస్సెక్కాను" అన్నాడో మాసిన గడ్డం ప్యాసింజర్.

"నా కొడుకు, కోడలు నన్ను ఇంట్లోంచి

"బయటకు గెంటేసారు" అందో వృద్ధురాలు.

చివరగా ముక్తకంఠంతో "మా ఆశల్ని చిన్నాభిన్నం చేశాడీ డ్రైవర్. ఇంకా మమ్మల్నీ బాధామయ ప్రపంచంలో బతికే ఉండమని శాసించడానికి వీడెవడు? మా ఆశల్ని నిరాశలుగా చేసిన ఈ డ్రైవర్ని ఏం చేసినా పాపం ఏముంది" అన్నారందరూ ఏకగ్రీవంగా.

–కలపర్తి సత్యం

---

## పరమేశ్వరుడి జలుబు

పరమేశ్వరుడికి బాగా జలుబు చేసింది. "ఏమిటో! మీకీమధ్య ఈ మంచుకొండలు పడటంలేదు. పైగా నెత్తిమీద గంగ. జలుబు చెయ్యక ఏంచేస్తుంది! కాస్త అలా ఎండల్లో విహరిస్తూ వద్దాం. ఈ జలుబు ఎప్పటికి వదులుతుందో ఏమో" అని రుసరుసలాడింది పార్వతీదేవి.

"సరే పద!" అంటూ మంచుకొండ మీద నుంచి బయలుదేరారు పరమేశ్వరులవారు. బాగా చల్లదనం అలవాటు అయిన పార్వతీదేవికే నాలుగు అడుగులు వేసేసరికి సూర్యుడి ఎండకి చురచురమంది. గొంతు పిడచకట్టుకుపోయింది. ఆహార పానీయాల విషయంలో ఆవిడ యమ స్ట్రిక్ట్. ఎక్కడా మంచినీళ్ళు తాగదు. గంగ ఎటూ పరమేశ్వరుడి తలపైనే వున్నా అభిమానపడి అడగలేదు.

పరమేశ్వరుడు జాలిపడి "దేవీ! పోనీ కొంచెం 'కోకోకోలా' తాగుదామా?" అన్నాడు. మానవలోకంనుంచి వచ్చిన భక్తులు "అమృతం మన కోక్ రుచిముందు బలాదూర్" అంటూంటే చాటుగా వింది పార్వతీదేవి. ఇన్నాళ్లనుంచీ పరమేశ్వరుడికి కూడా ఆ కోరిక వున్నట్టుందే అని నవ్వుకుని, "సరే అదీ రుచి చూద్దాం కిందకి దిగండి" అందావిడ.

"మనం ఇలా వెడితే డ్రామా వేషగాళ్ళో, సినిమా షూటింగ్‌నుంచి వచ్చిన బాపతో అనుకోగలరు జనం. సామాన్య మానవుల్లా వస్త్రధారణ చేద్దాం" అంది దేవి.

అలాగే వేషాలు మార్చి, భూలోకంలో కూల్‌డ్రింక్ షాప్‌ముందు దిగారిద్దరూ

ఆహా... ఏంరుచి... దేవీ, అమృతంలో తీయదనం తప్ప, ఇంత ఘాటు లేదు అంటూ నాలుగు సీసాలు ఖాళీ చేశారు పరమేశ్వరులవారు. దేవి కూడా రెండుసీసాలు గడగడ తాగింది.

"అయ్యో! మీ జలుబు సంగతి మరచిపోయామండీ. ఏ జ్వరం ముంచుకొస్తుందో ఏమో" అని ఆందోళన పడింది దేవి.

"పోనీయ్... మరేం కొంప మునిగిపోదు. జలుబే కదా! రోజూ ఇటువచ్చి కాస్త తాగివెడదాం" అన్నాడు పరమేశ్వరుడు తన్మయత్వంతో.

మూడోరోజుకి జలుబు భారం తగ్గింది గానీ పరమేశ్వరుడికి మనసులో పీకుతోంటే కాళ్ళు డ్రింక్ షాప్‌వైపుకి ఆటోమేటిక్‌గా దారి తీశాయ్.

ఈసారి పార్వతి రాకుండా తనొక్కడే వెడితేనయం. ఆవిడ లేకపోతే గణేశుడు, కుమారస్వామి వెదుక్కుంటూ నంది వాహనం మీద వచ్చేస్తారు. కైలాస శిఖరం ఖాళీ అయిపోతుంది. దేవగణమంతా ఇంక భూలోకంలోనే వుండిపోతారు అనుకున్నాడు పరమేశ్వరుడు.

"దేవీ! అలా గగన విహారానికి వెళ్ళివస్తాను. కాస్త బొజ్జ తగ్గుతుంది" అన్నాడు పార్వతీదేవితో.

"నేనూ వస్తానండీ! ఈమధ్య వెయిట్ పుటప్ చేసినట్టు అనుమానంగా వుంది.

బ్లౌజ్‌లు టైట్ అయ్యాయి" అంది పార్వతీ దేవి. చచ్చాం! ఈవిడా వెంటపడుతోంది. కనిపెట్టేసినట్టుందని, "దేవీ, నిన్న చాలా టైర్ అయిపోయావ్. డైటింగ్ ఎటూచేస్తు న్నావ్ కదా! ఈరోజు రెస్ట్ తీసుకోరాదూ" అన్నాడు.

ఇంతలో చిటపట చినుకులు మొదల య్యాయ్. వర్షం వంకన ఇద్దరూ ఆగిపో యారు. కానీ, ఆ తర్వాత దేవి కళ్ళుకప్పి ఎలాగోవెళ్ళి వచ్చాడు పరమేశ్వరులవారు భూలోకానికి.

ఓరోజు డ్రింక్ షాపతనికి బేరాలు డల్‌గా వుండి, తీరికగా కూర్చుని బాటిల్స్ లెక్క చూసుకుంటూండగా పార్వతీపరమేశ్వ రులు యధాప్రకారం వచ్చి డ్రింక్స్ తాగేరు. ఈసారి ఎవరూ లేరని అదృశ్యరూపంలో వచ్చారు. అందువల్ల వట్టినే పైకిలేచి గాల్లోనే ఖాళీ అయిపోతున్న బాటిల్స్ కేసి కళ్ళు వప్పగించి చూస్తుంటే అర్థం అయింది షాపతనికి, ఎవరో వచ్చి ఇలాగే ఖాళీ చేస్తు న్నారనీ హాయిగా తాగి, డబ్బు ఇవ్వకుండా వుడాయిస్తున్నట్టున్నారని.

మరోవారం తర్వాత దేవితో బయలుదేరి యధాప్రకారం షాప్ దగ్గరికి చేరుకున్నారు పరమేశ్వరులవారు. ఈసారి ఏమిటో కోక్ రసం ఘాటుగా, కారంగా, తేడాగా అనిపిం చింది. ఆ ఏంలేదు జలుబు భారానికి గొంతు. అలా అనిపించి వుంటుంది లెమ్మని మాటాడక తాగసాగాడు. దేవి రహస్యంగా "పరమేశ్వరా! ఈరోజు రుచి తేడాగా ఉంది. గిరాకీ పెరిగి కల్తీ జరిగినట్లుంది. ఇక చాల్లెండి. ఈసారి మరో షాప్‌కి వెడదాం" అని వారించింది. ఆశ్చర్యం! వారిరువురూ కైలాస శిఖరానికి చేరుకునేసరికి జలుబు.



గిలుబు భారం తగ్గి హాయిగా తేలిగ్గా వుంది. రాత్రి బాగా నిద్ర కూడా పట్టింది పరమేశ్వరులవారికి.

సంగతేమా అని దివ్యదృష్టిని షాపుమీ దకు సారించారాయన. షాపతను డ్రింక్ బాటిల్లో మిరియాలకషాయం, నాటుసా రాతో కలిపి చిక్కగా తయారుచేసి పోస్తు న్నాడు.

'ఎలా అయితేనేం దెబ్బకి జలుబు వది లింది!' అనుకున్నాడు పరమేశ్వరులవారు. సరిగ్గా అదేమాట అనుకున్నాడు షాపతను కూడా మరో వారం తర్వాత.

—ఎ. అన్నపూర్ణ

# బస్‌జర్నీ

కైవల్యరావు కూచొన్న బస్సు యమస్పీడులో పోతోంది. ఉండుండి ఓ పురుగో నలుసో గానీ వచ్చి కంట్లో పడింది. అలవాటుగా కన్ను నలిపేశాడు. ప్రాణం జివ్వుమంది. ఎదురుగాలి తోడవడంతో ఒక కన్ను ఎర్రబడి నీరు కారుతోంది. ఇక లాభం లేదనుకొని హేండ్‌కర్చీఫు తీసి అదిమిపట్టి ఉంచాడు. తరువాత బ్యాగ్‌లోని కూలింగ్ గ్లాసెస్ తీసి పెట్టుకొన్నాడు. ఇప్పుడు కాస్త హాయి అన్పించింది. సామాన్లు సరిగ్గా ఉన్నాయోలేదో ఒక సారి చూసుకుని నిద్రకుపక్రమించాడు.

కైవల్యరావు మామగారికి షష్ఠిపూర్తి. భార్యామణి పిల్లలతో ముందే వెళ్లిపోయింది. తనొక్కడే బయల్దేరాడు. బయలుదేరేముందు మామగారికోసం బహుమతిగా ఒక శాలువా, భగవద్గీత, చేతికర్ర కొన్నాడు. అవన్నీ సూటుకేసులో ఉంచాడుగానీ కర్ర మాత్రం అలా పెట్టటం కుదరక సీటుపక్కన నిలబెట్టి పట్టుకొన్నాడు.

కాసేపయిన తర్వాత బస్సాగింది. ఎవరో పిలుస్తుంటే తెలివొచ్చింది.

"కెన్ ఐ హెల్ప్‌యూ" ఒక తెల్లదొర తనని పలకరిస్తున్నాడు.

"నో...నో... థ్యాంక్స్" అని మళ్లా నిద్రకు పక్రమించాడు.

"డూ యూ వాంట్ ఎనీ కూల్‌డ్రింక్" మళ్లా ప్రశ్న.

"నాటెటాల్. థ్యాంక్‌యూ ఒన్స్ ఎగైన్" అని చెప్పాడు కైవల్యరావు. తెల్లదొర భుజాలు ఎగరవేసుకొని బస్సు దిగాడు. దిగి ఊరుకోక ఒక జంటతో కబుర్లు పెట్టుకున్నాడు. వాళ్లు కొత్తగా పెళ్లయిన వాళ్లలా ఉన్నారు. మగవాడు ఈ ఇంగ్లీషాయన చనువు, చొరవ చూసి కాబోల్ను తెగడంచేస్తున్నాడు. వచ్చీరాని ఇంగ్లీషులో మాట్లాడుతూ 'యా... యా' అంటున్నాడు. క్రీగంట భార్యను చూస్తూ! తెల్లదొర అతి వినయంగా మాట్లాడుతూ సంభ్రమంగా చూస్తున్నాడు ఆ యువకుణ్ణి.

బస్ మళ్లీ బయల్దేరి వాగులు, కాల్వలు దాటుకొంటూ దేన్లోనూ పడకుండా తెల్లారేసరికి హైద్రాబాద్ చేరుకొంది. జనానికి ఎక్కేందుకేగాదు దిగేందుకూ అంతకన్నా రెట్టింపు తొందర గనుక, కొంప మునిగేంత తొందరేం లేదుకదా అని కైవల్యరావు సీట్లోనే బైరా



యించి అందరూ దిగిన తర్వాత దిగాలని నిర్ణయించుకొన్నాడు.

"డూయూ వాంట్ మై హెల్ప్" మళ్లీ తెల్లవాడి ప్రశ్న.

ఇదేమి తద్దినం రా బాబూ. వీడెవడో నక్షత్రకుడిలా వెంటబడ్తున్నాడు గదా అని విసుగేసి తెల్లదొరని ఓ ఆటపట్టించాలనుకున్నాడు కైవల్యారావు.

"ష్యూర్... ఐ హేవ్ లగేజ్" అన్నాడు.

"మై గుడ్‌నెస్. దెన్ గివ్‌మి" అన్నాడు దొర.

సూటుకేసు వాడికి అందజేసి దర్జాగా బస్ దిగాడు కైవల్యారావు. దిగబోతున్న కైవల్యారావుకి రెండో చెయ్యి అందించి అపురూపంగా దించాడు దొర.

"థ్యాంక్‌యూ. థ్యాంక్స్ ఎలాట్" అన్నాడు కైవల్యారావు కృతజ్ఞతతో.

"ఎనీ అదర్ హెల్ప్" అన్నాడు మళ్లీ. అతని కన్నుల్లో కరుణ కన్పిస్తోంది. జీసస్ క్రీస్తు గెడ్డం గీయించుకొని ఆంధ్రదేశంలో అవతరించినట్లుగా ఉన్నాడు వాడు.

"నో థ్యాంక్స్" అని చెయ్యి చాపాడు కైవల్యారావు. దొర ఆ చేతిని దొరకపుచ్చుకొని షేక్‌హేండిచ్చి తన కోసంవచ్చిన పడవ లాంటి కారులో వెళ్లిపోయాడు.

ఎందుకో జేబులు తడుముకొన్నాడు కైవల్యారావు. పర్స్ భద్రంగా ఉంది. కాని ఇంటి తాళాలులేవు. రుమాలు తీసినప్పుడు బహుశా సీటులో పడిఉంటాయని మళ్లీ బస్సెక్కాడు వాటిని వెతకటానికి. సీటు క్రింద తాళాలగుత్తిపడి ఉంది. అది తన ముందర సీటు. వంగి కీబంచ్ తీస్తుంటే చూశాడు సీటు వెనుక 'రిజర్వుడు ఫర్ ఎమ్.పి' అని రాసుంది. కైవల్యారావుకి నవ్వొచ్చింది. ఈ దేశంలో దేనిమీద ఏం రాసున్నా ఆచరణలో మాత్రం అలా జరగదని. అలవోకగా తన సీటు మీదికి దృష్టి మళ్లింది. దానిపై 'సీట్‌ఫర్ బ్లైండ్ అండ్ హేండీక్యాప్డ్' అని రాసుంది.

తను పెట్టుకున్న నల్లకళ్లద్దాలు, చేతికున్న హేండ్‌స్టిక్ ఒకసారి చూసుకున్నాడు. కైవల్యారావుకి ఈసారి నవ్వురాలేదు.

—ఆనందరావ్ పట్నాయక్

---

## "ఆద్యుడి కాద్యు దెవ్వరిమ్మహిన్?"

వర్ధమాన రచయితగా దినదిన ప్రవర్ధమానుడౌతున్న బ్రహ్మయ్య ప్రచురింపబడిన తన కవితలనన్నిటినీ చక్కగా బైండు చేయించాడు. భారత, భాగవతాది ఉద్గ్రంథాల నెన్నింటినో తిరగరాసి, ప్రజాబాహుళ్యం మెప్పు పొందిన తన మేనమామ శంకరంగారికి ఆ బైండును చూపించి ఆయన మన్ననలను పొందాలనీ, ఆపైన అందాలరాసిగా తన మనసు దోచుకున్న ఆయన కూతుర్ని వివాహమాడాలనీ ఉవ్విళ్లూరుతున్నాడు బ్రహ్మయ్య.

ఓ మంచిరోజు చూసుకుని బ్రహ్మయ్య మేనమామ శంకరంగారి ఇంటికెళ్ళాడు. అక్కడ శంకరంగారు తాను రచించిన భారతభాగవతాది గ్రంథాల్ని తనే చదివి ఆనందిస్తున్నాడు.

కుశల ప్రశ్నలవీ ముగించుకుని, స్నానపానాదులు పూర్తిచేసుకున్నాక బ్రహ్మయ్య తన బైండు పుస్తకం పట్టుకుని శంకరంగారి పక్కనే చేరాడు. మెల్లిగా తన పుస్తకాన్ని చదవమన్నట్టుగా మేనమామ కందించాడు.

బ్రహ్మయ్య అందించిన బైండు చిన్నదేకావడంతో, అందులో వున్న కవితలను శంకరంగారు కాసేపట్లోనే చదివేసి పెదవి విరిచేశాడు.

"ఏం మావయ్యా? నా కవితలేం బాగులేవా?" అంటూ కంగారుగా అడిగాడు బ్రహ్మయ్య.

"బాగులేవనేం కాదురా! కవితలు వేటికీ శాశ్వతత్వం వుండదురా! భారత- భాగవతాది గ్రంథాలన్నిటికీ శాశ్వతత్వం వుంటుందిరా. జనులు వీటిని నిత్యపారాయణం చేస్తుంటారు'' అన్నాడు శంకరంగారు.

"నేను నా కవితలకు శాశ్వతత్వం కోరుకోవటంలేదు మామయ్యా! చిన్ని గడ్డిపూలల్లా సాహితీవనంలో వికసించిన నా కవితలు కొందరికైనా ఆహ్లాదాన్నిస్తే అదే పదివేలు. మృగ్యమైపోతున్న మానవత్వాన్ని మేల్కొలిపి, కొందరినైనా మనుషులుగా తీర్చిదిద్దితే అదే నాకానందం. యింక... భారత భాగవతాదులంటావా?! అవన్నీ మన స్వంతం కానే కావు. మనం తిరగరాసినా మన పేరెవరూ చెప్పుకోరు. వాల్మీకీ- వ్యాసులవారి పేర్లే చెప్పుకుంటారు. పాత చింతకాయ పచ్చడిని రుబ్బి పోపుపెట్టి ఏం లాభం అన్నాడు'' బ్రహ్మయ్య.

మేనల్లుడి మాటల్లోని నిజాన్న అవగతం చేసుకున్న శంకరం ఏమీ అనలేదు. కానే పాగి బ్రహ్మయ్య నడిగాడు, "నాయనా! నువ్వు బెంగాలీ సాహిత్యంలోని రవీంద్రనాథ్ ఠాగూర్, రచనలేమైనా చదివావా?" అని.

"లేదండీ!" అన్నాడు వినమ్రంగా బ్రహ్మయ్య.

"హిందీ సాహిత్యంలోని కవితలు చదివావా?"

"లేదండీ!" మళ్ళీ బ్రహ్మయ్యదదే సమాధానం.

"పోనీ, ఇంగ్లీషులోని గొప్ప కవితలేమైనా చదివావా?"

"నేనెవరి కవితల్నీ చదవలేదు మామయ్యా? పోనీ మీరు చదివారా?" ఎదురు ప్రశ్నేశాడు బ్రహ్మయ్య.

"నాకేమవసరం? నేను చదవలేదు. నేనేం కవిత్వం రాయాలనుకోలేదు. నువ్వు రాస్తున్నావు కాబట్టి చెబుతున్నాను. కవిత్వం కమామీషు తెలియాలంటే పెద్దవాళ్ళ రచనల్ని చదివితీరాలి. అంతవరకూ కలం పట్టుకోగూడదని తెలుసుకో. కనీసం తెలుగులోనైనా చదివి మరీ కలం పట్టు!" అంటూ హితోపదేశం చేశారు శంకరంగారు.



"రామాయణం రాసిన వాల్మీకిని ఆదికవి అంటారు కదా మామయ్యా! మరి... ఆయన ఎవరి రచనల్ని చదివి రామాయణం రాశాడంటారు?" అడిగాడమాయకంగా బ్రహ్మయ్య.

"వాల్మీకితో మనకి పోలికేంటి? ఆయన సాక్షాత్తూ విష్ణుమూర్తి అవతారం. ఆయనకెవరి రచనలూ చదవ్వలసినవసరం లేదు. క్రౌంచమిథునంలోని మగ పక్షి, బోయవాని బాణానికి గుర్రైనందుకు శోకించిన ఆయన హృదయంలోంచి శ్లోకం పుట్టింది. అక్కడ్నించి ఆయన రాసిన శ్లోకాలన్నీ అజరామరమయ్యాయి'' చెప్పారు శంకరంగారు.

"అదేనండీ నేను చెప్పేదీను. సమాజంలో నాకెదురౌతున్న ఎన్నో సంఘటనలకి నా హృదయం శోకతప్తమవుతోంది. అందులోంచే నా కవితలు పుట్టుకొస్తున్నాయి'' చెప్పాడు బ్రహ్మయ్య.

బ్రహ్మయ్య మాటలకి తలుపు చాటునించి అంతా ఆలకిస్తున్న శంకరంగారి కూతురు శారద కిసుక్కున నవ్వింది.

తనకాబోయే అల్లుడి బుర్రలో తెలివితేటలకి లోటులేదని తెలటంతో శంకరంగారు మనసులోనే శ్లాఘించాడు బ్రహ్మయ్యని.

-రాంరశి

---

## పబ్లిసిటీ

ఆమె పేరు సాధన.

కాలేజీలో చదువుకుంటూ నాట్యం నేర్చుకుంది. డిగ్రీ పూర్తయ్యేసరికి నాట్యంలో కూడా ప్రావీణ్యత సంపాదించింది.

కాలేజీ డే నాడు ఆమె నాట్యం చేసింది. ముఖ్య అతిథిగా సినీ డైరెక్టర్ రంగనాథరావు హాజరయ్యాడు. అతను ఆ కాలేజీ పాత విద్యార్థి గూడా. సాధన అందచందాలు, నాట్యంలో నేర్పు అతన్ని ఆకర్షించాయి.

"మిస్ సాధనా! మీరు అంగీకరిస్తే నా నెక్స్ట్ పిక్చర్‌లో హీరోయిన్ చేస్తాను" అన్నాడు రంగనాథరావు.

"తప్పకుండా!" అన్నది సాధన.

సాధన అనే కొత్తమ్మాయిని హీరోయిన్‌గా నాట్యప్రధానమైన చిత్రం 'సిరిమువ్వల సందడి' ప్రారంభమైంది.

రంగనాథరావు దాదాపు ఇరవై చిత్రాలు డైరెక్టు చేసినా, కొన్ని హిట్ చిత్రాలుగా పేరు తెచ్చుకున్నా పెద్దగా మార్కెట్ లేదు. అతని చిత్రం అయితే హిట్, లేకపోతే ఫట్ అని మార్కెట్లో జోక్స్ వేసుకుంటారు.

'సిరిమువ్వల సందడి' పూర్తయినా కొనడానికి జిల్లాలనుంచి బయ్యర్లు ఎగబడలేదు. అందులో హీరోగా నటిస్తున్న శోభనాద్రికి మార్కెట్ పూర్తిగా పడిపోవడం అసలు కారణం. అతని చిత్రాలు అరడజను వరసగా ఫ్లాపులు కావడంతో ప్రొడ్యూసర్లు అయోమయంలో పడిపోయారు. బయ్యర్లు నెత్తిన గుడ్డేసుకున్నారు.

ఫైనాన్స్ వారికి వడ్డీలు పెరిగిపోతూ వుండడంతో 'సిరిమువ్వల సందడి' ప్రొడ్యూసర్‌కి బి.పి. పెరిగిపోయి మూలనపడ్డాడు.

రంగనాథరావుతో చిత్రాలు తియ్యాలనుకున్న ప్రొడ్యూసర్లు ఆ ప్రయత్నం విరమించుకుని హిట్ చిత్రాల డైరెక్టర్ల వెంట పరుగులు తీశారు.

మొదటి చిత్రమే విడుదల కాకపోయేసరికి సాధన డీలా పడింది.

మద్రాస్ నుంచి ఇంటికి వెళ్ళడానికి మొఖం చెల్లడంలేదు. పిక్చర్ ఎప్పుడు రిలీజవుతుందని అడిగేవాళ్ళకి ఏంచెప్పాలో ఆమెకు అర్థంకావడంలేదు. అలాగని మద్రాస్‌లో ఎంతకాలం వుండగలదు. ఆమె అందంగానే వున్నా, మంచి నటన ప్రదర్శించినా మొదటి చిత్రం హిట్ అయితేనే మళ్ళీ అవకాశాలు వస్తాయి. లేకపోతే ఎవరూ తీసుకోరు. పేపర్లలో ఫొటోలు పడుతూ, పబ్లిసిటీవున్న స్టార్స్‌కే ఫాలోయింగ్ కూడా వుంటుంది.

ఈ సందిగ్ధ సమయంలో రంగనాథరావు ఆమెకో అద్భుతమైన సలహా చెప్పాడు.

"సాధనా! హీరోయిన్ అంటే ఎప్పుడూ వార్తల్లో వుండాలి. డైరెక్టర్స్‌తో, ప్రొడ్యూసర్స్‌తో బాగా సహకరిస్తుందని అందరికీ తెలియాలి. అప్పుడిక వేషాలకు కొదవ వుండదు"

అతను చెప్పేదేమిటో సాధనకు సరిగా అర్థంకాలేదు.

"ఏం చెయ్యాలంటారు? నాకేం అర్థంకావడంలేదు" అన్నది. అతను నవ్వాడు.

"నాకు తెలుసు. నీకు కొత్త. అందుకే చెప్తున్నాను. మనం గ్యాసిప్స్ పుట్టించుకోవాలి. అంటే తెలుసుగా! నాతోపాటు డిన్నర్లకనీ, పార్టీలకనీ కలిసి రావాలి. ఇద్దరి మధ్యా ఏదో వుందిరోయ్ అని జర్నల్స్‌లో గ్యాసిప్ న్యూస్ వస్తుంది. మంచి పబ్లిసిటీ నీకు"

సాధన అదోలా చూసింది.

"మళ్ళీ చెప్పలేదనుకోవద్దు. ఎప్పుడు చూసినా మీ అమ్మను వెంటేసుకుని తిరుగుతుంటే నీకెవడూ వేషాలివ్వడు. హీరోయిన్ అంటే లిబరల్‌గా వుండాలి"

సాధన చురుగ్గా చూసింది.

"నువ్వు వూc... అంటే చెప్పు. తాజ్‌లో రూమ్ బుక్‌చేస్తాను. కొందరు జర్నలిస్టుల్ని అదంతా కవర్ చేయడానికి ఏర్పాటుచేస్తాను. ఏం... ఈ రాత్రికి రూమ్ బుక్ చేయించమంటావా? "

"పబ్లిసిటీయేగా మనకి కావలసింది? " ప్రశ్నించింది సాధన.

"అవును"

"రేపు పాండీబజార్ రండి. సినీ ఇంటర్నేషనల్ రెస్టారెంట్లో లంచ్ చేద్దాం. మనవాళ్ళంతా అక్కడే వుంటారుగా" అన్నది.

"అలాగే..." సంతోషంగా అన్నాడు రంగనాథరావు.

మర్నాడు లంచ్ టైమ్‌కి హోటల్ దగ్గరికి వచ్చి కారు దిగాడు రంగనాథరావు. ఎక్కడ్నుంచి వచ్చిందో సాధన విసురుగా వచ్చి



చెయ్యి బారజాపి మరీ ఫట...ఫటామని నాలుగు లెంపకాయలు కొట్టింది. సినీ రాత పక్షులంతా నోరెళ్ళబెట్టి తిలకిస్తూ వుండగా సాధన అతనికి మాత్రమే వినపడేటట్లు అన్నది.

"సారీ డైరెక్టర్! ఇప్పుడు మనిద్దరికీ మంచి పబ్లిసిటీ వస్తుంది. నేను మిమ్మల్ని కొట్టడంవల్ల మనిద్దరికీ చెడిందని అందరికీ తెలిసిపోతుంది. ఇక మనకి ఛాన్సులే... ఛాన్సులు" అనేసి మరో రెండు లెంపకాయలువేసి విసవిసా నడిచి కారెక్కింది సాధన.

**వాణిశ్రీ**

# ఏరిన ముత్యాలు

★ కష్టంతో కలిసి ఉండని సుఖాన్ని, చెడుగుతో కలిసి ఉండని మంచిని పొందుట అసాధ్యం.

-స్వామివివేకానంద

★ తోటివారికి నీవు స్వేచ్ఛ ఇవ్వనంత వరకు, దాన్ని పొందటానికి అర్హుడవుకావు.

-విలియమ్ వైట్

★ తోటివారికి కించిత్తు సహాయపడలేని శ్రీమంతుడు ఊరి మధ్యలో వ్యాపించే విషవృక్షంలాంటివాడు.

-తిరువళ్లువర్

★ నీ గురించి నీవు సత్యాన్ని చెప్పకపోతే, తోటివారిగురించి నీవు ఎప్పటికీ సత్యం చెప్పలేవు.

-వర్జీనియా ఉల్ఫ్

★ ఉదాసీనత యజమానిగా ఉన్నచోట, అక్కడి నరులందరూ బానిసలే.

-జి.కె.చెస్టర్‌టన్

★ జీవిత పరమావధి క్రియాశీలతేగానీ, జ్ఞానసముపార్జన కాదు.

-థామస్‌హక్స్‌లే

★ మానవకళ్యాణం కోసం, ఏదైనా కొంత సాధించనంతవరకు చనిపోవటానికి నీవు సిగ్గుపడాలి.

-హొరేస్‌మాన్

★ మనల్ని మనం పాలించుకునేటట్లు నేర్పించేదే, అన్నిటికంటే ఉత్తమ ప్రభుత్వం.

-గోతే

★ ఉన్నతాసనాలు ఎప్పుడూ మనశ్శాంతిని ఇవ్వవు.

-బ్రూక్స్

★ ఓ సంఘటనను చరిత్రాత్మకమైందిగా ఎవరైనా చేయవచ్చు. కాని గొప్ప వ్యక్తి మాత్రమే దాన్ని రాస్తాడు.

-ఆస్కార్‌వైల్డ్

★ అధికారాన్ని తృణీకరించేవాడే ఉత్తమ వ్యక్తి.

-మహమ్మద్

★ మతంలేని విజ్ఞానశాస్త్రం అవిటిది. విజ్ఞానశాస్త్రంలేని మతం గుడ్డిది.

-అల్బర్ట్ ఐన్‌స్టీన్

★ ఏ వ్యక్తి అయినా తప్పు చేయవచ్చు. కాని అవివేకి తప్ప, ఎవరూ మరలా ఆ పొరపాటు చేయరు.

-సిసెరో

సేకరణ: తుమ్మా కవితాకుమారి

# చతుర ప్రపంచం

## జన్మజన్మలకి వెన్నంటివచ్చే 'ఆరా'

దేవుళ్ళు, దేవతల చిత్రపటాలను పరిశీలిస్తే వారి తల వెనక భాగంలో గుండ్రంగా ఓ కాంతి వలయాన్ని చిత్రించినట్టు మనం గమనిస్తాం. ఇది కేవలం కల్పితమో లేక ఊహో కాదని, అది నిజమని అంటున్నారు కొంతమంది మేధావులు. ఈ కాంతివలయాన్ని 'ఆరా' అంటారు. ఇది కేవలం భగవంతుడికీ లేదా సత్పురుషులకో, ఋషులకో కాక ప్రతి మనిషికీ వుంటుందనీ, గుర్తించే నేర్పు ఉంటే తప్ప అది కనుపించదనీ అంటున్నారు. సైంటిస్టులు కూడా దీన్ని అంగీకరించినట్టు తెలుస్తోంది.

పాశ్చాత్య దేశాల్లో దీనిపై చాలా పరిశోధనలు జరిగాయి. అదీగాక ఈ కాంతివలయాల ఆకారం, పరిమాణాల విషయంలో కూడా భిన్నాభిప్రాయాలున్నాయి. డాక్టర్ హార్వర్డ్ ఎల్డర్‌మాన్ అనే పేరాసైకాలజిస్ట్ "ఈ ఆరా సూక్ష్మాతిసూక్ష్మమైన అణువుల కలయికతో రూపొందిందనీ, ఇది మనిషిని ప్రతి జన్మలోనూ వెన్నంటి వుంటుందని" అంటున్నారు. అంతేకాకుండా ఈ 'ఆరా'ని గుర్తించడానికి ఈయన అనేక రకాల పద్ధతులను సూచించారు. ముఖ్యంగా ముందుగా మనిషి తనకున్న టెన్షన్స్‌నన్నిటినీ మర్చిపోవాలి. అంతకన్న ముందు అతనికి 'ఆరా' ఉనికిపై నమ్మకముండాలి. తనలో వున్న భయం, శంక, స్వార్థం, ఆందోళనలాంటివన్నీ విడిచిపెట్టాలి. 'నేను తప్పకుండా 'ఆరా'ని గమనించగలను' అని తనపై తనకి నమ్మకముండాలి ఆ మనిషికి.

'ఆరా'ను పరిశీలించే పద్ధతి వింతగా, ఉత్సాహకరంగా వుంటుందంటున్నారాయన. మొట్టమొదట ఏ వ్యక్తి 'ఆరా'ను మనం పరి



శీలించదలుచుకున్నామో అతనిని మన ఎదుట నిలబడమనాలి. మన దృష్టి సరాసరి అతని ముఖం మధ్యలో స్థిరమవ్వాలి. నెమ్మదిగా ఆ దృష్టిని ముఖమంతా ప్రసరింపచేయాలి. అటుపైన దృష్టిని ఆ వ్యక్తి మెడ వద్ద నిలపాలి. క్రమేపీ ఆ దృష్టిని అతని తలపై భాగంలో అంటే తలనుంచి ఆరు అంగుళాలకుపైన నిలపాలి. తిరిగి మళ్ళీ ముఖం మధ్యలోకి దృష్టిని తీసుకురావాలి. పైన చెప్పిన పద్ధతిలో శిరస్సుకు పైన ఆ రంగుళాలదూరందాకా వెళ్ళాలి. ఇలా అతడి 'ఆరా' గోచరించేవరకూ ఈ 'దృష్టి ప్రసరణ క్రియ'ను జరుపుతూ వుండాలి.

ఇంకా ఈ 'ఆరా' రకరకాల రంగుల్లో కూడా కనిపిస్తుందనీ, ఒక్కొక్క రంగుకీ ఒక్కొక్క విశేషం వుందనీ తెలుస్తోంది. ఇది తెల్లరంగులో వుంటే ఆ వ్యక్తి పరిశుద్ధాత్ముడుగా గుర్తించవచ్చు నలుపు రంగులో కనిపిస్తే అతనికి త్వరలో మృత్యువు ప్రాప్తిస్తుందని తెలుసుకోవచ్చు ఎర్రరంగులో కనుపిస్తే అతడు చాలా కోపధారి మనిషి అని చెప్పచ్చు అయితే ఇది పూర్తిగా ఖచ్చితమని చెప్పలేమనీ, కొంతలో కొంత ఆ రంగులు ఆయా వ్యక్తుల స్వభావాలను సూచనామాత్రంగా తెలియజేస్తాయని అంటున్నారు.

డాక్టర్ జాన్‌కిల్నర్ అనే ఆయన ఈ విషయం పై విస్తృత పరిశోధన జరిపాడు. ఈయన లండన్‌లో 'సెయింట్ థామస్ హాస్పిటల్'లో ఫిజీషియన్‌గాను, సర్జన్ గానూ కూడా పనిచేస్తున్నాడు.

ఎలక్ట్రో థెరపీలో ఈయన చక్కని పరిశోధనలు జరిపాడు. ఈయన సమకాలికుడైన జర్మన్ సైంటిస్ట్ డాక్టర్ బారన్ కార్లవాస్, అమెరికన్ సైంటిస్ట్ డాక్టర్ ఎడ్విన్ కూడా ఈ రంగంలో గణనీయంగా కృషిచేశారు. ఈ ఇద్దరు శాస్త్రవేత్తల రిపోర్ట్‌లతో ప్రభావితుడైన డాక్టర్ జాన్ కిల్నర్ ఈ విషయంలో మరింత కృషిచేశాడు. అంతేకాకుండా ఈ 'ఆరా'ను అతడు స్వయంగా చూసి మిగతా వాళ్ళు కూడా చూడగలిగే పద్ధతులను గురించి కూడా పరిశోధించాడు.

బొగ్గునుంచి వెలువడే ఓ 'డై'లాంటి పదార్థాన్ని కళ్ళల్లో లెన్స్‌కి రాసుకుంటే మామూలు కంటి చూపుకు ఆనని సూక్ష్మ పదార్థాలని, లేదా అత్యంత దూరంగా వుండే పదార్థాలను కూడా స్పష్టంగా గుర్తించవచ్చును అంటారాయన.

తను కనుగొన్న విషయాలన్నింటినీ ఓ గ్రంథంగా తయారుచేసి అచ్చువేయించాడు కిల్నర్. కానీ శాస్త్రజ్ఞులు దీనిని అంగీకరించలేదు. అతని కృషిని కూడా అంతగా పట్టించుకోలేదు. డాక్టర్ కిల్నర్ ఈ 'ఆరా'ని 'ఆత్మ' మొదలైన అలౌకిక విషయాలకి సంబంధించినది అని చెప్పకుండా కేవలం భౌతికమైనదే అని వాదిస్తున్నాడు. 'ది హ్యూమన్ ఎట్మాస్ఫియర్' అనే తన పుస్తకంలో "10,000 మందిలో ఏ ఒక్కరో ఈ 'ఆరా'ను గుర్తించగలరు" అని పేర్కొన్నాడు. ఆ తరువాత ఈ 'ఆరా'ను చూడగలగడానికి రెండు రకాల గాజు పలకలను ఉపయోగించాడితడు. ఆల్కహాల్‌లో కరిగిపోయే స్పెక్టనైన్ అనే రసాయనాన్ని ఓ గాజు పలకపై పలుచగా పూసి, మరో గాజు పలకపై దానినే మందంగా పూశాడు. ఈ పలకల సహాయంతో అతడు తన స్నేహితుడి 'ఆరా'ను గుర్తించడానికుపక్రమించాడు. అప్పుడతడి తలవెనుక బూడిద రంగువలయం కనిపించింది. అదే 'ఆరా' అనే స్థిరనిర్ణయానికి కొచ్చాడు. అటుపైన గాజు పలకలను తీసేసి చూడగా అప్పుడు కూడా దానిని చూడగలిగాడు. ఆ తరువాత ఈ 'ఆరా'ను బాగా చూడడానికి 3 రకాల గాజు పలకల అవసరాన్ని సూచించాడు. కార్మనైన్ అనే రసాయనాన్ని మందంగా పూసిన పలక ఒకటి, పలుచగా పూసిన పలక మరొకటి, మూడవది లేతనీలిరం

గులో వుండే గాజుపలక

ఈ 'ఆరా'కి 3 లెవెల్స్ వున్నాయంటాడీతడు. మొదటిదాన్ని 'ఈథరిక్ డబుల్' అంటారు. రెండోది 'ఇంటర్నల్ ఆరా', మూడవది' 'ఎక్స్టర్నల్ ఆరా'. ఈథరిక్ డబుల్ అనేది చాలా గాఢమైన రంగులో వుండి, మనిషి శరీరం చుట్టూ వుంటుంది. ఇది మనిషిని, అతడి 'ఆరా'ని వేరుచేసే డివైడర్‌లా కన్పిస్తుంది. ఇది ఒక అంగుళం మందంలో వుంటుంది. మిగతా రెండు ఆరాలు ఈ ఈథరిక్ డబుల్ ఆరాకి దగ్గరగా వుంటాయి. ఇంటర్నల్ ఆరా యొక్క సైజు మనిషి మార్చేయాంగిల్స్‌నిబట్టి మారుతూ వుంటుంది. ఎక్స్టర్నల్ ఆరాకి ఒక స్థిరమైన షేప్ లేదు. మనిషి జబ్బుతో వున్నప్పుడు ఈ 'ఆరా' చెదిరిపోతూవుంటుంది.

డాక్టర్ హార్‌వర్డ్‌ఎల్డర్‌మాన్ అనే మరో సైంటిస్ట్ ఈ 'ఆరా'ను గమనించే పద్ధతులను చెప్పడమేకాక రోగాల్ని కూడా దీని సాయంతో నయం చెయ్యవచ్చు అంటున్నాడు. ఈ 'ఆరా'లు 3 రకాలు కాదు, 4 పొరలుగా విభజింపబడుతున్నాయనీ, ఇవి ఒకదానికొకటి దగ్గరగా వున్నా"యని అంటారీయన.

దీనిమీద పాశ్చాత్య దేశాల్లో చాలా పరిశోధనలే జరిగాయి. ఇండియాలో కూడా దీనిని గురించిన అవగాహన చాలా మందికి వుందని తెలుస్తోంది.

---

## 'మీ' చర్మ సౌందర్యానికి...

ప్రస్తుతం టీవీల్లో 'మీ చర్మ సౌందర్యానికి' అంటూ ఎన్నోరకాల సబ్బులకి సంబంధించిన ప్రకటనలు వస్తున్నాయి. నిజంగా ఆ మోడల్ యువతుల శరీరపు నిగనిగలు చూస్తుంటే తప్పకుండా ఆ సబ్బు కొనాలనే అనిపిస్తుంది. అయితే 'మన చర్మం ఎలాంటిది? దానికి ఏ రకమైన సబ్బు నప్పుతుంది? అసలు ఏ రకమయిన సబ్బైనా మన చర్మానికి నప్పకపోవడం అనేది వుందా?' మొదలయిన విషయాలని మనం క్షుణ్ణంగా పరిశీలించుకోవాలి. సబ్బులు ముఖ్యంగా రెండు రకాలు. స్నానం సబ్బు, బట్టల సబ్బు. బట్టల సబ్బుల్లో క్షారపదార్థం ఎక్కువ కాబట్టి అది చర్మానికి హానిచేస్తుంది. శరీరానికి వాడే సబ్బులు రకరకాల రంగుల్లో, ఆకారాల్లో, వివిధ రకాలైన సెంటు వాసనలతో తయారవుతాయి. అన్ని సబ్బుల్లో కొద్దో గొప్పో కెమికల్స్ తప్పకుండా వుంటాయి. కొందరు జుట్టు కూడా సబ్బుతోనే రుద్దుకుంటారు. దీనివల్ల వెంట్రుకలు త్వరగా నెరిసిపోవడం, లేదా రాలిపోవడం జరుగుతుంది.

భారతదేశంలో జనాభా ఎక్కువగా వుండటం, ఉష్ణదేశమవడంతో వాతావరణంలో ధూళి, తేమ కూడా ఎక్కువగా వుండి సామాన్యంగా ప్రజలు, ముఖ్యంగా వేసవిలో రెండు పూట్లా స్నానం చేస్తారు. స్నానంలో సబ్బును తప్పక వాడతారు. కొన్ని సబ్బులలో నూనెపదార్థం ఎక్కువగా వుంటే, మరికొన్నిటిలో క్షారపదార్థం ఎక్కువగా వుంటుంది. మన శరీరానికి నప్పే సబ్బుని ఎన్నుకొని వాడుకోవాలి.

మన శరీరంపై చర్మం సాధారణంగా 0.2 మిల్లీమీటర్ల మందాన వుంటుంది. కాబట్టి చర్మం చాలా సున్నితంగా వుంటుంది. సోప్‌ని సున్నితంగా రుద్దుకోవాలి. కొందరి చర్మం జిడ్డుగాను, మరికొందరి చర్మం పొడిగాను వుంటుంది. జిడ్డు చర్మంగలవారు క్షారసంబంధమైన సబ్బులను వాడినా అంత హాని కలగదు. కానీ పొడి చర్మంవారు మాత్రం నూనెపదార్థం ఎక్కువగా వున్న

సబ్బులు వెదికి తెచ్చుకుని మరీ వాడుకోవాలి. క్షారపదార్థం ఎక్కువగా వున్న సబ్బులు చర్మాన్ని మరింత ఎండగట్టి కురుపులు కూడా వచ్చేందుకు దోహదం చేస్తాయి. చర్మమంతా గరుకుగా తయారవుతుంది.

మన చర్మానికి 3 పొరలుంటాయి. మధ్య పొరనుంచి సెబమ్ అనే నూనె పదార్థం విడుదల అవుతుంది. సెబమ్ ఉత్పత్తి తగ్గుముఖం పట్టినప్పుడు చర్మం ఎండిపోవడం

సున్నితమైన భాగాల్లోకి సబ్బు వెళ్ళకుండా చూసుకోవాలి.

ఈ రోజుల్లో సబ్బు వాడకం ఎంత సర్వసాధారణ మైందంటే అది లేకుండా స్నానం చేసేవారిని అనాగరికుల జాబితాలో చేరుస్తారు.

స్నానం సబ్బులు... వేప, మల్లి, గులాబి, చందనం మొదలైన వివిధ గుబాళింపులతో తయారవుతాయి. ఈ రోజుల్లో హెర్బల్ సోప్స్ జనాన్ని ఎక్కువగా ఆకట్టుకుంటు




మొదలవుతుంది. చాలారకాల చర్మవ్యాధులు దీని కారణంగానే వస్తాయి. కాబట్టి పొడిచర్మం గలవారు తాము రుద్దుకునే సబ్బును ఎంపిక చేసుకోవడంలో చాలా జాగ్రత్త వహించాలి.

ఇంకో ముఖ్యవిషయమేమంటే సబ్బును డైరెక్ట్‌గా చర్మంపై పెట్టి రుద్దకుండా, చేతికి పట్టించుకుని ఆ నురగతో ఒళ్లు రుద్దుకోవాలి. ఒళ్లు సబ్బుతో రుద్దాక, నీళ్లు పోయకుండా ఎక్కువసేపు ఆరనివ్వకూడదు. పోతే... కళ్లు, ముక్కు, చెవులు మొదలైన

న్నాయి. పసుపు, శనగపిండి, దోసకాయ వగైరా వంటింటి, అందుబాటు వస్తువులను వాడుకునేందుకు నేటి మనిషికి తీరిక లేదు. అందుకే "పసుపు, చందనం... మొదలైన ఔషధగుణాలతో...:" అన్న ప్రకటనలు చూసి ఆ సబ్బులను కొనితెచ్చుకుంటున్నారు.

ఏదిఏమయినా సబ్బు మన శరీర శుభ్రతకి ఎంత బాగా ఉపయోగపడుతుందో, శృతిమించితే అంత హాని కూడా కలుగజేస్తుందంటున్నారు శాస్త్రవేత్తలు.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad Tel: 290328 Office Address: CHATURA Monthly, Eenadu Compound, Somajiguda. Tel. Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777: Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 331080

CHATURA Telugu Monthly Hyderabad 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78